# భారతామృత రసము

## అజ్ఞాతవాసము, కీచకవధ

కాకూరి వ్యాసమూర్తి

[illegible]

# పీఠిక

వేదవ్యాస విరచితమైన మహాభారతము పలుమారులుగా పఠించుట ఉభయలోకతారకమైనది. పఠించిన కొలంది యందలి విశేషములవగాహనమగుచుండును. (ఒక్కొక్కమారు క్రొత్త విశేషము సువ్యక్తమగుచుండును.) అవగాహనమునకొలంది యాసక్తి నొందదగును. మనశ్శాంతి యేర్పడి సత్ప్రవృత్తి కలుగును. వినోదముగా పఠించినగాని గ్రహింపశక్యము కాదు. భారతామృతరసము నోపికగా పఠించియనుభవింపవలసి యున్నది. పాఠకులోపికపట్టి పలుమారులుగా నీగ్రంథమును పఠించి విషయగ్రహణము గావింపవలసినది. తాత్పర్యము, వివరణముల మూలముగా భారతశ్లోకములనవగాహన మొనరింపవలసియున్నది. అట్లయిననే రససిద్ధియేర్పడగలదు.

రోమహర్షణపుత్రుడైన సూతపౌరాణికుడు నైమిశారణ్యమందు కులపతియగు శౌనకుడు ద్వాదశవార్షిక సత్రయాగమొనరించుచుండగా మునీశ్వరుల సమక్షమందు భారతమును వినిపించెను. సర్పయాగమందు జనమేజయునకు వైశంపాయనుడు వేదవ్యాసుని నియోగానుసారము దెల్పిన యీయితిహాసమును మునీశ్వరులు విని తరించిరి. మనోబుద్ధి సమాధులతో నొప్పినవాడై వైశంపాయనుడు మొదట గురువునకు నమస్కరించి, ద్విజులను ఇతరులైన విద్వాంసు

లను పూజించి సర్వలోక విశ్రుతుడైన వ్యాసుని మతమునం
తయు వినిపించెను (ఆది ౬౧-౧౯, ౨౦).

గ్రంథకర్తయగు కృష్ణద్వైపాయనుడు బ్రహ్మర్షియగు వసిష్ఠుని వంశమందు పరాశరునివలన సత్యవతియందు సద్యోగర్భమున నుద్భవించి వెంటనే యభివృద్ధినొందెను. 'స్మరణమాత్రమున గానవచ్చెదను' అని కన్నతల్లికి దెల్పియామె యనుజ్ఞనొంది వేదవ్యాసుడు తపమొనరింప వెడలిపోయెను (౬౩-౮౪-౮౬) అతిమానుషకర్మకారుడు (౧-౨౧) సర్వలోకపూజితుడు, అమితతేజస్కుడు (౬౨-౧౩) తపము, వేదాధ్యయనము, వ్రతము, ఉపవాసము, సంతానము, కోపము వీనియందతని నతిశయించినవారెవరును లేరు (౬౦-౮).

పుణ్యమైన హిమవత్పాదమందు గిరిగుహాలయమందా ధర్మాత్ముడు దేహమును శుద్ధమొనరించుకొని ప్రాచీనాగ్రములగు దర్భలపై నాసీనుడాయెను. శుచియు, నియమవంతుడు, శాంతాత్ముడునగు పరాశరాత్మజుడు తపస్స్థితుడై ధర్మముగా నీభారతేతిహాసము నన్వేషించెను. జ్ఞానయోగనిష్ఠుడై యంతయు నవగాహన మొనరించుకొనెను (౧-౩౩-౫౪). త్రివిధరహస్యమైన భూతస్థానములు, వేదములు, యోగము, విజ్ఞానము, ధర్మకామములు, ధర్మార్థకామములును వివిధ శాస్త్రములు, లోకయాత్రా విధానము నాసాత్వన సేయుడ వగాహనమొనరించుకొనెను (౧-౫౪,౫౬) మూడుసంవత్సరము లహోరాత్రములు, తదేకదీక్ష వహించి [illegible]

డై న వేదవ్యాసుడు పంచమవేదమును రచించెను. (౩-౩౦-౮౧, ౮౨)

లోకానుగ్రహమును కోరి వేదవ్యాసుడు వేదవిభాగ మొనరించి సుమంతుడు, జైమిని, పైలుడు, శుకుడు-వీరిచే నదిలోకప్రచార మొనరించెను, (౬ ౩-౮౮, ౯౦) భారతము ౬౦ లక్షల గ్రంథముగా రచించి యందు ౩౦లక్షల గ్రంథము నారదుని వలన దేవలోకమందునను, ౧౫ లక్షల గ్రంథము అసితుడగు దేవలుని వలన పితృలోకమందునను, ౧౪ లక్షల గ్రంథము కుమారుడగు శుకుని వలన యక్షరాక్షసులందును. ౧లక్ష గ్రంథము వైశంపాయుని వలన మనుష్యలోకమందును వ్యాపింపజేసెను (౧-౧౧౧-౧౧౪)

జనార్దనులకు గానమునకు సనాతనుడైన నారాయణుని దివ్యగాథ లన్నీ మహాభారతమందుగలవు. దేవతలు, దేవర్షులు, నిర్మలులగు బ్రహ్మర్షులు, యక్షులు మహోరగులు మున్నగువారిందు చెప్పబడియున్నారు. (౧-౨౬౦,౨౬౧) దేవేశుడు, దేవి కార్తికేయుడు, బ్రాహ్మణులు, గోవులు-వీరిమహిమ యిందు కీర్తింపబడినవి. (౬ ౨-౩౪,౩౫)

బ్రహ్మతో సంయోగమగుటకు రాగా వ్యాసుడు భారతప్రశస్త్య మునిట్లు నుడివెను. 'పరమపూజితము, అభిహితము, వేదరహస్యమునైన యీకావ్యము నాచే రచింపబడినది. సాంగోపాంగమైన యుపనిషత్తులు, వేదవిస్తారమైన క్రియలు, ఇతిహాసపురాణోన్మేషము నిందు నిరూపింపబడినవి. త్రివిధసంస్కృత

మైన కాలముయొక్క నిర్ణయమిందు గలదు. జరామృత్యు భయవ్యాధి భావా భావవినిశ్చయమిందు గలదు. ధర్మము యొక్క వివిధలక్షణము, ఆశ్రమముల లక్షణము చాతుర్వర్ణ్యము యొక్కయు, కృత్స్నమగు పురాణములయొక్కయు. తపో బ్రహ్మచర్యలయొక్కయు విధానమిందు చెప్పబడినది. పృథివి చంద్రసూర్యులు, గ్రహనక్షత్ర తారలు, యుగములయొక్క ప్రమాణములు నిందు చేర్కొనబడినవి. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము అథర్వ వేదాధ్యాత్మము, న్యాయ శిక్ష, చికిత్స, జ్ఞానము — వాని ప్రమాణమిందు గలదు. ఇట్లుగా ననేకాశ్రయమైన జన్మయు పుణ్యతీర్థములు, దేశములు నిందు కీర్తింపబడినవి. నదులు, పర్వతములు, సాగరములిందు కీర్తింపబడినవి. దివ్యమైన పురములు, కల్పములు, యుద్ధ కౌశలము, వాక్యజాతివిశేషములు, లోకయాత్రాక్రమము నిందు ప్రతిపాదింపబడినవి. సర్వగతమైన వస్తువేయిందు ప్రతిపాదితమైనది. (౧—౬౮, ౭౬) అని వ్యాసుడు బ్రహ్మకు నివేదించెను.

భారతశాస్త్రమును గూర్చి బహువిధములు నా గ్రంథమందే యిట్లు వ్రాయబడియున్నది. * ఈ భారతము నకు శరీరము సత్యము మఱియు నమృతము. దేవతలు నాలుగువేదముల నొకవైపున, భారతము నొకవైపున నుంచి తూచిరి రహస్యసహితమైన నాలుగువేదములకంటె నిది

* భారతస్య వపుర్హ్యేతత్ సత్యం చామృతమేవచ   అని ౧—౨౬౮
'వపుః' అనునది ఈ గ్రంథమునకు గూఢముగా నున్నది.

యధికముకాగా గొప్పను మహిమతోను, భారముతోను నొప్పియున్నందున, మహాభారతమని ప్రసిద్ధి నొందినది. (౧-౨౭౪) వేదములు, ఉపనిషత్తులు తెలిసినను నీయితిహాస మెఱుంగనివాడు విచక్షణుడగు విద్వాంసుడు కానేరడు. (౨-౩౭౮) విస్తారార్థమైన యీ విచిత్రార్థ పదాఖ్యానము నేక సమయాన్వితమైనది. మోక్షేచ్ఛగలవారు వైరాగ్యమును వలె ప్రాజ్ఞులగు వారు దీని నాశ్రయించెదరు. వేదితవ్యము లందాత్మవలె, ప్రియములందు జీవితమువలె నీయితిహాసము ప్రధానార్థమైనది. సర్వాగమములందు శ్రేష్ఠమైనది. ఆహా రము నాశ్రయింపక శరీరధారణమట్లు దీని నాశ్రయింప కథ భూమియందు లేనేలేదు. (౨-౩౮౨) శుభోదయము గోరు భృత్యులు అభిజాతుడగు నేలికనువలె కవులీభారతము నాదరించుచున్నారు (౨-౩౮౩) అక్షరయుక్తమగు వాక్య-మందు లోకము, వేదము నున్నట్టుల నీయుత్తమేతిహాసమం దుత్తమమైన బుద్ధియున్నది (౧-౩౫-౮౧). ఇది యర్థ శాస్త్రము, మహాధర్మశాస్త్రము, కామశాస్త్రము, మోక్ష శాస్త్రము (౯-౧-౧౩). ఇట్లుగా నమితబుద్ధిగల్గిన వ్యాసుడు దీనిని దెల్పెను. పుంస్కోకిలము రుతము విన్నపిదప రూక్షమైన కాకికూత యింపుగానట్లు శ్రావ్యమైన యుపాఖ్యానమింకేదియు రుచింపనేరదు. త్రిలోకవిభులు పంచభూతముల వలన నైనట్లు కవిబుద్ధులీయుత్తమేతిహాసమునుండి గలుగుచున్నవి. అంతరిక్షవిషయముగా చతుర్విధప్రజమైనట్లీయుపా

మైన కాలముయొక్క నిర్ణయమిందు గలదు. జరామృత్యు భయవ్యాధి భావా భావవినిశ్చయమిందు గలదు. ధర్మము యొక్క వివిధలక్షణము, ఆశ్రమములలక్షణము చాతుర్వర్ణ్యము యొక్కయు, కృత్స్నమగు పురాణములయొక్కయు. తపో బ్రహ్మచర్యలయొక్కయు విధానమిందు జెప్పబడినది. పృథివి చంద్రసూర్యులు, గ్రహనక్షత్ర తారలు, యుగములయొక్క ప్రమాణములు నిందు జెప్పబడినవి. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము అట్లే వేదాధ్యాత్మము, న్యాయ శిక్ష. చికిత్స, జ్ఞానము — వాని ప్రమాణమిందు గలదు. ఇట్లుగా ననేకాశ్రయమైన జన్మయు పుణ్యతీర్థములు, దేశములు నిందు కీర్తింపబడినవి. నదులు, పర్వతములు, సాగరములిందు కీర్తింపబడినవి. దివ్యమైన పురములు, కల్పములు, యుద్ధ కౌశలము, వాక్యజాతివిశేషములు, లోకయాత్రాక్రమము నిందు ప్రతిపాదింపబడినవి. సర్వగతమైన వస్తువేయిందు ప్రతిపాదితమైనది. (౧-౬౮, ౭౬.) అని వ్యాసుడు బ్రహ్మతో నివేదించెను.

భారతశాస్త్రమును గూర్చి బహువిధముల నా గ్రంథమందే యిట్లు వ్రాయబడియున్నది. * ఈ భారతము నకు శరీరము సత్యము మఱియు నమృతము. దేవతలు నాలుగువేదముల నొక వైపున, భారతము నొక వైపున నుంచి తూచిరి సరహస్యమైన నాలుగువేదములకంటె నిది

* భారతస్య వపుర్హ్యేతత్ సత్యం చామృతమేవ చ   ఆది ౧-౨౬౮

'వపుః' అనునది ఈ శ్లోకమందు గుర్తుగా నున్నది.

యద్ధిశేషముగాఁగా కథయు మహిమతోను, భారముతోను నొప్పియున్నందున మహాభారతమని ప్రసిద్ధి నొందినది. (౧-౨౬౮) వేదములు, ఉపనిషత్తులు తెలిసినను నీయితిహాస మెఱుంగనివాఁడు విచక్షణుఁడగు విద్వాంసుఁడు కానేరఁడు. (౨-౩౭౮) విస్తారార్థమైన యగాధచిత్రార్థ పదాఖ్యానమునేక సమయాన్వితమైనది. మోక్షేచ్ఛగలవారు వైరాగ్యమునవలె పాత్రులగు సాధువులు దీని నాశ్రయించెదరు. వేదితవ్యములందాత్మవలె, ప్రియములందు జీవితమువలె నీయితిహాసము ప్రధానార్థమైనది. సర్వాంగములందు శ్రేష్ఠమైనది. ఆచనిరము నాశ్రయింపక శరీరధారణమట్లు దీని నాశ్రయింపక కథ భూమియందు లేనేలేదు. (౨-౩౮౧) శుభోదయము గోరు భృత్యులు అభిజాతుఁడగు నేలికనువలె కవులీ భారతము నాదరించుచున్నారు (౨-౩౮౩) అక్షరయుక్తమగు వాక్కునందు లౌకికము, వైదికము నున్నట్టుల నీయుత్తమేతిహాసమందుత్తమమైన బుద్ధియున్నది (౧-౩౭-౮౧). ఇది యర్థశాస్త్రము, మహాధర్మశాస్త్రము, కామశాస్త్రము, మోక్షశాస్త్రము (౨. ౧-౧౩). ఇట్లు అమితబుద్ధిగల్గిన వ్యాసుఁడు దీనిని దెల్పెను. పుంస్కోకిలము రుతము విన్నపిదప రూక్షమైన కాకికూత యింపుగానట్లు శ్రావ్యమైన యుపాఖ్యానమింకేదియు రుచింపనేరదు. త్రిలోకవిధులు పంచభూతముల వలన నైనట్లు కవిబుద్ధు లీయుత్తమేతిహాసమునుండి కలుగుచున్నవి. అంతరిక్షవిషయములుగా చతుర్విధప్రజమైనట్లీయుపా

మైన కాలముయొక్క నిర్ణయమిందు గలదు. జరామృత్యు భయవ్యాధి భావా భావవినిశ్చయమిందు గలదు. ధర్మము యొక్క వివిధలక్షణము, ఆశ్రమములలక్షణము చాతుర్వర్ణ్యము యొక్కయు, కృత్స్నమగు పురాణములయొక్కయు. తపో బ్రహ్మచర్యలయొక్కయు విధానమిందు జెప్పబడినది. పృథివి చంద్రసూర్యులు, గ్రహనక్షత్ర తారలు, యుగములయొక్క ప్రమాణములు నిందు జెప్పబడినవి. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము అట్లే వేదాధ్యాత్మము, న్యాయ శిక్ష, చికిత్స, జ్ఞానము—వాని ప్రమాణమిందు గలదు. ఇట్లుగా ననేకాశ్రయమైన జన్మయు పుణ్యతీర్థములు, దేశములు నిందు కీర్తింపబడినవి. నదులు, పర్వతములు, సాగరములిందు కీర్తింపబడినవి. దివ్యమైన పురములు, కల్పములు, యుద్ధ కౌశలము, వాక్యజాతివిశేషములు, లోకయాత్రాక్రమము నిందు బ్రతిపాదింపబడినవి. సర్వగతమైన వస్తువేయిందు బ్రతిపాదితమైనది. (౧-౬౮, ౭౬) అని వ్యాసుడు బ్రహ్మతో నివేదించెను.

భారతప్రశస్త్యమును గూర్చి బహువిధముల నా గ్రంథమందే యిట్లు వ్రాయబడియున్నది. * ఈ భారతము నకు శరీరము సత్యము మఱియు నమృతము. దేవతలు నాలుగువేదముల నొక వైపున, భారతము నొకవైపున నుంచి తూచిరి. సరహస్యమైన నాలుగువేదములకంటె నిది

* భారతస్య వపుర్హ్యేతత్సత్యం చామృతమేవచ ఆది ౧-౨౬౫

'వపుః' అనునది ఈ శ్లోకమం దుత్తమముగా నున్నది.

యతిశయముగా గన్నదు మహిమతోను, భారముతోను నొప్పియున్నందున ,మహాభారతమని ప్రసిద్ధి నొందినది. (౧-౨౭౯) వేదములు, ఉపనిషత్తులు తెలిసినను నీయితిహాస మెఱుంగనివాడు విచక్షణుడగు విద్వాంసుడు కానేరడు. (౨-౩౭౬) విస్తరార్థమైన యీవిచిత్రార్థ పదాఖ్యానమనేక సమయాన్వితమైనది. మోక్షేచ్ఛగలవారు వైరాగ్యమును వలె ప్రాజ్ఞులగు నరులు దీని నాశ్రయించెదరు. వేదితవ్యము లందాత్మవలె, ప్రియములందు జీవితమువలె నీయితిహాసము ప్రధానార్థమైనది. సర్వాగమములందు శ్రేష్ఠమైనది. ఆహారము నాశ్రయింపక శరీరధారణమట్లు దీని నాశ్రయింపక కథ భూమియందు లేనేలేదు. (౨-౩౮౨) శుభోదయము గోరు భృత్యులు అభిజాతుడగు నేలికనువలె కవులీభారతము నాదరించుచున్నారు (౨-౩౮౩) అక్షరయుక్తమగు వాక్కునందు లోకము, వేదము నున్నటుల నీయుత్తమేతిహాసమందుత్తమమైన బుద్ధియున్నది (౧-౩౪-౮౧). ఇది యర్థశాస్త్రము, మహద్ధర్మశాస్త్రము, కామశాస్త్రము, మోక్షశాస్త్రము (౬౨-౧౩). ఇట్టి యమితబుద్ధిగల్గిన వ్యాసుడు దీనిని చెప్పెను. పుంస్కోకిలము రుతము విన్నపిదప రూక్షమైన కాకికూత యింపుగానట్లు శ్రావ్యమైన యుపాఖ్యానమింకేదియు రుచింపనేరదు. త్రిలోకవిధులు పంచభూతముల వలన నైనట్లు కవిబుద్ధులీయుత్తమేతిహాసమునుండి గలుగుచున్నవి. అంతరిక్షవిషయముగా చతుర్విధప్రజమైనట్లీయుపా

ఖ్యానవిషయమందే పురాణము వర్తించుచున్నది. సమస్తేం ద్రియములకు జితమైన మనఃక్రియలెట్లో యట్లే సమస్త క్రియాగుణములకు నీయాఖ్యాన మాశ్రయమైనది. సాధు వగు గృహస్థుని తక్కిన మూడాశ్రమములవారు నతిశయింప లేనట్లు కవులు దీనినతిశయింపలేరు. సతతోత్థితులగువారలకు ధర్మమందే మతియుండదగును. ఇది యొకరలోకమునకు బంధువు. అర్థములు లలనలు నిపుణముగా ననుభవింపబడినవైనను నవి యాస్తభావమును పొందలేవు. స్థిరత్వము లేదు. ద్వైపాయనోష్ఠ పుట నిస్సృతమైనట్టి, యప్రమేయము, పుణ్యము, పవిత్రము శివమునైన యీభారతాఖ్యానము సర్వోద్ధారకమైనది. (౨-౩౭౭-౩౮౬) వ్యాసమహర్షియొక్క మనస్సాగరసంభూత మైన యీభారతము (౫౭-౯) సముద్రము, మేరుపర్వతము వలె రత్ననిధియైనది (౬౨-౭౮)

మహాభారత మాహాత్మ్య మిట్టుగా నాదిపర్వమందు బలుచోట్ల దెల్పబడినది. ఇందలి విశేషములు గ్రంథప్రాశ స్త్యమును చక్కగా విశదీకరించుచున్నవి. అనునిత్య మన్ని విషయములందు నాత్మోద్ధరణముగా బ్రవర్తించు సన్మార్గ వివేక మిందువలన నవగాహనము కాగలదు. తల్లిదండ్రులు, అన్నదమ్ములు, ఆలుబిడ్డలు, బంధువులు, జ్ఞాతులు, స్నేహి తులు, అహితులు, విరోధులు మఱియు సంఘము, రాజ్యము, దేశము, ప్రపంచము, లోకములు, దేవతలు— వీనియందు నరుడింటను, బైటను నెట్లు ప్రవర్తించుట యుచితమగునో,

వీనిపట్ల పరస్పరవిరోధ మేర్పడినపు డేదిగావించిన ధర్మమగునో (ప్రశస్తమగునో) యేదిగావించిన ధర్మముగా బైకిగనబడుచు ధర్మాభాసమై యుండునో (అప్రస్తుతమగునో) యీవివేకము గలుగగలదు. ప్రపంచమం దన్నివిధముల ప్రశాంతిగా నుండదగురీతి యిందువలన దెల్లము కాగలదు. సకల మానవోద్ధారక రూపమైనది, యింకను చరాచరలోకోద్ధరణ రూపమైనది, మఱియు సకల లోకోద్ధరణరూపమైన దీభారత గ్రంధరాజము.

ఇందలిరచనావిధానమమోఘమైనది. ఈగ్రంథముప్రజ్ఞాభిపన్నమైనది. విచిత్రపదపర్వమైనది. సూక్ష్మార్థన్యాయయుక్తము. వేదార్థభూషితము, అర్థసంయుతము, చతుర్వేదసహితము, ధర్మ్యము, పాపభయాపహము నైనది (౧-౧౭-౨౨॥ ౨-౮౧) దివ్యమానుషసమయమైన శుభశబ్దములతో గూడినది, వివిధ ఛందస్సులు గల్గినది. విద్వత్ప్రియము, వేదార్థసారభూతము నఖిలార్థ ప్రదము నైనది (౧-౩౨, ౩౩)

ఇతిహాస పురాణముల చేత వేదమును విఱివిగా తెలియవలయును. అల్పశ్రుతుడగు వానిజూచి వేదము 'వీడు నన్ను మోసపుచ్చును' అని భయమొందును (౧—౨౭౩). అని చెప్పబడినది. తపము, అధ్యయనము, స్వాభావికమైన వేదవిధి, కష్టించి ధర్మమార్జించుట విపరీతముగాదు. భావోపహతముగా వాని నొనర్చుటయే విపరీతము (౧—౨౮౦). విపరీత ప్రవృత్తిగల దుర్యోధనాదులను, తత్పక్షస్థులను, సత్ప్రవృత్తిగల పాండవులు హతమార్చిరి. అరివినాశనము, సర్వ

లోకహితముగోరి దివౌకసులు బ్రహ్మర్షి రాజర్షికులములం దుద్భవించిరి. దైవీసంపద, ఆసురీసంపద భారతపాత్రలందు సువ్యక్తము కాగలదు.

రామాయణ భారతములు, తిక్కనభారతము విమర్శించి గ్రంథములు ముద్రించుచున్నాను సంస్థలు, వ్యక్తులు నాకు ప్రోత్సాహము కూర్చుచున్నందున నిప్పటికి కొన్ని గ్రంథములు ముద్రింప గల్గితిని.

పరాభవసంవత్సర ఆషాఢశుద్ధ పంచమీ బుధవారమునాడు నేను జన్మించితిని. మాతండ్రిగారు తాళూరి హనుమంతాచార్యులుగారికి వ్యాసపూజాధికారము లభించిన సందర్భములో నేను పుట్టినందున వారు నాకు 'వ్యాసమూర్తి' అని పేరు పెట్టిరి. దత్తత తండ్రిగారు (పినతండ్రిగారు) రామమూర్త్యాచార్యులుగారు 'వ్యాసనరసింహము' అని పేరు పెట్టిరి.

షష్టిపూర్తి సందర్భముగా నిప్పటికి 5 గ్రంథములు ముద్రించితిని. తెలుగులోను, హిందీలోను నేను గ్రంథములు ముద్రించి ప్రచారము గావించుచున్నాను. కర్నూలు వాస్తవ్యులు శ్రీ పాగా వెంకోబరావుగారు B. A., నా గ్రంథములను హిందీలోనికి అనువాదము గావించినారు.

ఆంధ్రప్రదేశము సాహిత్యఎకాడమివారు గ్రంథముద్రణకు నాకు 1000 రూప్యములు మంజూరు చేసినారు,

1. భారతామృతరసము – అజ్ఞాతవాసము, కీచకవధ.

2. భారతామృతరసము - గోహరణము.

ఈ రెండు గ్రంథములు ఇంతవరకు ముద్రించినాను. వ్యాసభారతముపై బహుపరిశ్రమ గావించి యీరెండు గ్రంథములు రచించినాను. ఏకాదశమీ సభ్యులందఱకు నీ రెండు గ్రంథములు చేరగలవు, కావున వారందఱు నీ రెండు గ్రంథముల నామూలాగ్రముగ పఠింపగలరని యాశించుచున్నాను. వారి యభిప్రాయములను కూడ సంపగోరుచున్నాను.

హైదరాబాదు చిక్కడపల్లి హనుమదాలయమున నేను ఉపన్యాసము లిచ్చినందున లభించిన ద్రవ్యమున 'తిక్కన కళాసామ్రాజ్యము - సంజయ రాయబారము' అను గ్రంథమును ముద్రించినాను.

Central government, State government నాకు నెలకు 75 రూప్యములు భృతి నిచ్చుచున్నవి. అందువలన నాకు గ్రంథముద్రణము తగువిధముగా గావించు నావకాశమగుచున్నది.

శ్రీ వాసా అన్నప్పశాస్త్రిగారు శ్రమచేసి ప్రూఫులు దిద్దియున్నారు. వారికి కృతజ్ఞుడను. నాకృషిని తొలినుండి ప్రోత్సహించిన వారందఱకు, సంస్థలకు నేను కృతజ్ఞుడను.

గ్రంథమందు తప్పులుండిపోయినవి. సందర్భమును బట్టి వానిని సవరించుకొనుచు గ్రంథపఠనము గావింపవలసినదని విజ్ఞప్తి గావించుచున్నాను.

## తెలుగు

1. రామరాజ్యము - కుశలవులు
(ద్వితీయముద్రిణ మగుచున్నది) రూ॥ పై॥
2. తిక్కన కళాసామ్రాజ్యము-అజ్ఞాతవాసము, కీచకవధ 2-25
భాషాప్రవీణకు పాఠ్యగ్రంథము
3. తిక్కన కళాసామ్రాజ్యము-సంజయరాయభారము 2-75
4. భారతామృతరసము-అజ్ఞాతవాసము, కీచకవధ 2-75
5. భారతామృతరసము-గోహరణము 3-00

## హిందీ

1. రామరాజ్యము - కుశలవులు 2-50
2. గౌతమాశ్రమము - అహల్య 2-00
3. విశ్వామిత్ర 1-50

విజయనగరము } శా॥ శ॥ ౧౮౭౭ }
కాశూరి వ్యాసమూర్తి
గ్రంథకర్త



# భారతామృత రసము

## పాండవాజ్ఞాత వాసము

నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయే.
కథం విరాటనగరే మమ పూర్వపితామహాః
అజ్ఞాతవాస ముషితా దుర్యోధనభయార్దితాః విరా॥ ౧.౨
పతివ్రతా మహాభాగా సతతం బ్రహ్మవాదినీ
ద్రౌపదీచ కథం బ్రహ్మ న్నజ్ఞాతా దుఃఖితాఽవసత్, 3

(జనమేజయుడు వైశంపాయనుని జూచి యిట్లు ప్రశ్నించెను. నాముత్తాతలయిన పాండవులు దుర్యోధనుని వెఱపుచే నలగినవారై విరాటనగరమున నెటుల నజ్ఞాత వాసము సలిపినారు. పతివ్రతయు, భాగ్యవతియు, బ్రహ్మవాదినియునగు ద్రౌపది దుఃఖితురాలై యెటుల నజ్ఞాత వాసమున నున్నది.)

స సాధు కౌంతేయ ఇతో వాస మర్జున రోచయ
సంవత్సర మిమం యత్ర వసే మా విదితాః పరైః. ౪

(పిమ్మట మహామనస్కుడు, ధర్మపుత్రుడునగు యుధిష్ఠిరుడు సమీపవర్తులగు దమ్ములతో బ్రసంగించుచు నిట్లనెను. 'అర్జునా! ఈసంవత్సరము పరుల కెఱుకరాకుండ నెచ్చట నుండుదము, బాగుగా నాలోచించి చెప్పుము.)

ఇందు 'పరైః' అని గలదు. కౌరవులకు, కౌరవానుకూలురకు మాత్రమే కాకుండ పాండవద్వేషులగువారి కెవ్వరికి దెలిసినను అజ్ఞాతవాసభంగ మగునను గొప్పభయము సూచింపబడినది. పాండవుల మహదైశ్వర్యము నంతయు జూచిగొనిన దుర్యోధనుడు దానినంతయు దుర్వినియోగ మొనర్చి ప్రపంచము తన కనుకూలమగునటుల గావించికొని యుండుటచే బాండవు లిప్పుడు మఱియు జాగ్రత్తపడవలసిన వారైరను గొప్పభయ మిందు దెల్ప బడినది 'కృచ్ఛ్రాత్ పరమదుర్గసః' (౮) అని ధర్మజుడు పలికినాడు. కావున నర్జును డుచితరీతిని బదులు పలికినాడు.

తస్యైవ వరదానేన ధర్మస్య మనుజాధిప
అజ్ఞాతా విచరిష్యామో నరాణాం నాత్రసంశయః ౧౦
కింతు వాసాయ రాష్ట్రాణి కీర్తయిష్యామి కానిచిత్
రమణీయాని గుప్తాని తేషాం కించిత్స్మరోచయ ౧౧
సంతిరమ్యా జనపదా, బహ్వన్నాః పరితఃకురూన్. ౧౨

(మనుజాధిప ! ఆధర్మదేవతా వరప్రభావంబువలననే జనుల కెఱుకపడక యీయేడు మనము గడపగలము. దీనికి సందియము వలదు. ఇంక రమణీయంబులును, గుప్తంబులు నైన కొన్ని దేశంబుల జెప్పెద. వానిలో నెచ్చట నుండుట తగునో చూడుము. రమ్యమైనవి, జనపదములతో గూడినవి, ధనధాన్య సమృద్ధిగలవియు నగు రాష్ట్రములు కురుదేశమును చుట్టియున్నవి. పాంచాల చేది మత్స్య శూరసేన పటచ్చర

దశార్ణ నవరాష్ట్ర మల్ల సాల్వ యుగంధర కుంతిరాష్ట్ర సురాష్ట్ర అవంతి- ఈ దేశములున్నవి. వీనిలో నే దేశమున నుండ నీ వపేక్షించెదవో యచట నీయేడు మన ముందము. అని యర్జునుడు పలికెను.)

'ధర్మదేవతావరప్రసాదమున్నదిగాన నజ్ఞాతవాసము నిర్విఘ్నముగా జరిగిపోగలదు' అని యర్జునుడు పలికినాడు. ఇందు 'మనుజాధిప' అని ధర్మజుని సంబోధించినా డర్జునుడు. మనుజాధిపుడు సంపాదించిన ఘనవరమది. అది తమకును పనికివచ్చు వరమై యొప్పియున్నది. కావున నెట్లును నజ్ఞాత వాసము నిర్విఘ్నముగా గొనసాగియే తీరును - అని యర్జునుడు చక్కగా బలికినాడు. ఇందు 'నరాణాం' అను పదము గూడ విస్తృతార్థమును స్ఫురింపజేయుచున్నది. మనుజాధిపుడగు ధర్మజుడు ధర్మదేవతవలన సంపాదించిన గొప్పవరమది. కావున నరుల కెవరికి భేదించుటకురాని ఘనరక్షమైన గొప్పవర మదియని యభిప్రాయము. ఇట్లుగా ధర్మజుడు సంపాదించిన వరమునకు బ్రాధాన్య మొసగుచు నర్జునుడు ప్రసంగమారంభించినాడు. 'కింతు' అని తరువాయిపలికినాడు. ఆ వరము ఘనమైనరక్షగా నేర్పడియున్నది, ఇంక పురుష ప్రయత్న మున్నది, పురుషప్రయత్నమును బురస్కరించి కొని యర్జునుడప్పుడు రమణీయములు గుప్తములునగు గొన్ని దేశములను బేర్కొనినాడు. అందెచ్చట నుండుట యుచి

తము. అని మరల ధర్మరాజునే యర్జునుడు డడిగినాడు. అపుడు యుధిష్ఠిరుడిట్లు పలికెను.

శ్రుత మేత న్మహాబాహో యథా స భగవాన్ ప్రభుః
అబ్రవీ త్సర్వభూతేశ స్త త్తథా న త దన్యథా ౧౬
అవశ్యం త్వేవ వాసార్థం రమణీయం శివం సుఖం
సంమంత్ర్య సహితై స్సర్వై ర్వ స్తవ్య మకుతో భయైః ౧౭
మత్స్యో విరాటో బలవా నభిరక్తోఽథ పాండవాన్
ధర్మశీలో వదాన్యశ్చ వృద్ధశ్చ సతతం ప్రియః ౧౮
విరాటనగరే తాత సంవత్సర మిమం వయం
కుర్వంత స్తస్య కర్మాణి విహరిష్యామ భారత ౧౯
యాని యానిచ కర్మాణి తస్య వక్ష్యామహే వయం
ఆసాద్య మత్స్యం తత్కర్మ ప్రబ్రూత కురునందనాః ౨౦

(యుధిష్ఠిరు డిట్లు బదులు పలికెను. మహాబాహూ! ఆ భగవంతుడగు సర్వభూతేశ్వరుడైన ధర్మదేవత చెప్పిన ప్రకారము జరుగగలదు, వేఱువిధముగ కాదు. మనమందఱము గలసి యెవరివలనను భీతిలేక యొకచోట నుండవలయును. రమణీయంబును, శివప్రదంబును, సౌఖ్యదాయినియైన ప్రదేశముననుండవలయును. మత్స్యదేశాధీశుండయిన విరాటుండు బలవంతుడు, పాండవులం దభిరక్తుడు, ధర్మశీలుడు, వదాన్యుడు, వృద్ధనృపతి యతడు. నాయనా! యట్టి విరాటనగరముననుండి యతడు చెప్పిన కార్యంబులు చేయుచు నచ్చట నుందము. కురునందనులారా! మనలో

నెవ్వ రెవ్వ రేపని చేయఁగలమని యా విరాటరాజుతోఁ జెప్పుదము చెప్పుడు.)

తన వరమునకు బ్రాధాన్య మొసంగుచు మాటాడినా డర్జునుడు. అగ్రజుడగు ధర్మజుడు తండ్రియు, దైవము నగు ధర్మదేవతావరమునకు బ్రాధాన్య మొసంగుచు బలుకఁ జొచ్చినాడు. 'కింతు వాసాయ రాష్ట్రాని కీర్తయిష్యామి కానిచిత్' అని యర్జునుడు పలికియున్నాడు. (ధర్మజు డవశ్య ముచితప్రదేశమున వాస మొనరింపవలసియే యున్నదియని యర్జునుడు పలికినాడని యభిప్రాయము.) అర్జునుడు కొన్ని దేశములను నిర్దేశించి యందేది యుచితమని వచించి యున్నాడు. ఆ దేశములలో నొకటియైన విరాటనగరమును ధర్మజుడు పేర్కొనినాడు. వర మొసంగిన యమధర్మరాజును గూర్చి 'భూతేశః' అని చెప్పబడుట బహురమణీయముగా నున్నది. భూతేశుడుగాన నాతని మాటప్రకారమే జరుగ గలదని యభిప్రాయము. ఇంక పురుషప్రయత్న మొనరింప వలసియున్నది. బలవంతుడు, పాండవులం దభిరక్తుడు నగు విరాటుని రాజ్యమందుండుట సమంజసమని ధర్మజుడు పలికినాడు. 'అభిరక్తోఽథ పాండవాన్' అని యిచ్చటగలదు. 'అథ' అను పదము విచిత్రముగా నున్నది. కీచకసంబంధము తొలంగిననాడు పాండవులందలి విరాటుని యభిరక్తి సువ్యక్తము కాఁగలదను విశేష మిందువలన ధ్వనించుచున్నది. ధర్మజుడు 'విరాటుడు పాండవులం దభిరక్తుడు' అనినాడు,

పాండవులమగు మనయందత 'డభిరక్తుడు' అని పలుకక యిట్లు పలుకుట గమనింపదగినది. ఇది విరాటుని యుచిత ప్రవర్తనమును సమర్థించుచున్నది. పాండవు లెక్కడనుండిననూ విరాటుడు వారియందే యభిరక్తిగల్గి సదాయుండునని యిది వివరించుచున్నది. కావున విరాటునింట నుండుటే పరమానుకూలమని ధర్మరాజు డనినాడని యభిప్రాయము. పాండవులు ధర్మపత్నీసమేతులై విరాటుని జేరవచ్చుచున్నారు. విరాటుడు ధర్మశీలుడు, వదాన్యుడు, వృద్ధుడు సదాప్రియుడునై యుండుట మిగులననుకూలమై యున్నదని భావము. ధర్మరాజుడు 'విరాటునింట నీ సంవత్సర ముందము', ఆతనికి పనులుగావించుచు నుందము' అనినాడు. ఇంకొకనికి పనులు గావింపవలసియే యున్నదని ధర్మరాజు డిందు మూలముగా దనయభిప్రాయమును వెలిబుచ్చినాడు. 'ఏయే పనులవెంట మన మచట నుందము' అని ధర్మరాజుడు పలికినాడు, 'కురునందనాః' అని చివరనుంచుట గొప్పకష్టమును సూచించుచున్నది. విరాటునకు బనులు గావింపవలసియున్నదని ధర్మరాజుడు పలికినాడు కాన నాతని విషయమే సుఃఖించుచు నర్జును డిట్టుల పలికినాడు.

నరదేవ కథం తస్య రాష్ట్రే కర్మ కరిష్యసి
విరాటనగరే సాధో వత్స్యసే కేన కర్మణా ౨౦
మృదు ర్వదాన్యో హ్రీమాంశ్చ ధార్మిక స్సత్యసంగరః
రాజం స్త్వ మాపదాఽఽకృష్టః కిం కరిష్యసి పాండవ ౨౧

న దుఃఖ ముచితం కించి ద్రాజా వేద యథా జనః
స ఇమా మాపదం ప్రాప్య కథం ఘోరాం తరిష్యసి3౨

(నరాధిప! ఆవిరాటరాష్ట్రంబుననుండి యేకార్యంబు చేయుదువు. సాధుపుంగవ!, యేమిపనిమీద విరాటనగరంబున నుందువు. మృదుశీలుండవు, వదాన్యుడవు, హ్రీమంతుడవు, ధార్మికుడవు, సత్యసంగరుడవు. రాజా! నీ వాపదాకృష్టుడవై యేమి గావించువాడవు, నీకు దుఃఖ ముచితము కాదు, ప్రాకృతునట్లు నీవది యెఱుంగవు. ఈయాపదను పొంది యీఘోరము నెట్లు తరింపగలవోకదా.)

'నరదేవ, సాధో' అను రెండుపదములు ధర్మరాజు నుత్తమత్వమును దెల్పుచున్నవి. 'ఆనరదేవుడు పరరాష్ట్రమందేకర్మ గావింపగలవాడు, ఆసాధు వేకర్మ వెంట వర్తింపగలడు' అను రెండు దుర్ఘటముల నివి తెల్పుచున్నవి ధర్మరాజుడు మృదుస్వభావము గలవాడని నా డర్జునుడు. ఈపాదమందు ధర్మరాజుని మంచిమంచి గుణములన్నియు బేర్కొనబడినవి. అట్లుగా నర్జునుడు పేర్కొని పిదప 'రాజన్' అని సంబోధించి పలుకుట గొప్పకష్టమును వెల్లడించుచున్నది. 'ఆనీవు ఆపదాకృష్టుడవై యేమిచేయుదువు' అని నా డర్జునుడు. 'ఆపదాకృష్టః' అనునది ధర్మరాజు డెంతటిసంకటపరిస్థితికి లాగివేయబడుచున్నదియు దెలియజేయుచున్నది. అట్లుగా నాపదాకృష్టుడగు ధర్మరాజుడు నిక్క మే పనియు జేయంజాలడు. అట్టివాడు ధర్మరాజుడని వచించుచు

నర్జునుడు ధర్మరాజునితో 'నీవేమి చేయుదువు' అని పలికినాడు. 'ఏమియు జేయజాలనివా డయ్యో యెంతకష్ట మిదియెట్లో' యని యర్జునుడు పలికినాడని భావము. అంతటి మహాను భావునకు దుఃఖమే కూడదు. ఆపరిస్థితియందు మెలగుట యాతనికి దెలియనే తెలియదు. ఇచ్చట 'కించి ద్రాజా వేద యథా జనః' అనిగలదు. ధర్మరాజుడు రాజు, ఒక్కనికిగూడ సముచితముగాని దుఃఖ మారాజునకు దటస్థింపనే కూడదు కదా. 'ఇట్టి యాపదను బొంది యీఘోరము నెట్లుగా తరింపగలవు' అని యర్జునుడు పలికినాడు. 'ఘోరాం తరి ష్యసి' అనునది యాదారుణపరిస్థితినంతయు వ్యక్తీకరించు చున్నది. అర్జునుని గొప్పదుఃఖము నిది తెల్పుచున్నది. 'న దుఃఖ ముచితం కించిత్' అను దానిలోని 'కించిత్' అనున దెంతటి సుకుమారున, కేయాపద నెఱుంగని మహాను భావున, కెట్టియాపదకు నుచితుడుకాని ఘనున, కెంతటి ఘోరవిపత్తు వచ్చిపడినది—అని తెల్పుచున్నది. యుధి ష్ఠిరుడు 'శృణుధ్వం' అని ప్రారంభించినాడు. 'నేను సభాస్తా రుడ నయ్యెదను, జూదమాడుచు విరాటు ననుసరించెదను' అని తానుండు విధము నాతడు తెల్పెను.

ఇత్యేత ద్వో మయాఖ్యాతం విహరిష్యా మ్యహం యథా
వృకోదర విరాటే త్వం వత్స్యసే కేన హేతునా ౧-౨౮
పౌరోగవో బ్రువాణోఽహం వల్లవోనామ భారత
ఉపస్థాస్యామి రాజానం విరాట మితి మే మతిః. ౨-౧

(నేనుండబోవు తెఱంగు మీకెఱిగించితినికదా. వృకోదరుడా ! విరాట నగరమందు నీవేహేతువున నుండ గలవు అని యుధిష్ఠిరు డడిగెను. 'వంటలవాడనని పలికెదను, వల్లభుడను నామమున నుండెదను, విరాటరాజునొద్ద నిట్లుండ దలంచుచున్నాను. విపులమైన కర్మ గావించువాడ నగు దును. గజములు, వృషభములు, మల్లులతోడ పోట్లాడుచు విరాటునకు సంప్రీతి గావించెదను. మల్లులను జంపివేయను, మల్లయుద్ధమే వారితోడ గావించెదను.' అని భీమసేనుడు పలికెను.

యమగ్ని ర్బ్రాహ్మణో భూత్వా సమాగచ్ఛ న్నృపాల వరం
దిధిక్షుః ఖాండవం దావం దాశార్హసహితం పురా ౧౧
మహాబలం మహాబాహు మజితం కురునందనం
సోఽయం కింకర్మ కౌంతేయః కరిష్యతి ధనంజయః ౧౨
యోఽయ మాసాద్య తం దావం తర్పయామాస పావకం
విజిత్యైకరథేనైవ హత్వా పన్నగ రాక్షసాన్ ౧౩
వాసుకే స్సర్పరాజస్య స్వసారం హృతవాంశ్చ యః
శ్రేష్ఠో యః ప్రతియోధానాం సోఽర్జునః కిం కరిష్యతి. ౧౪
సూర్యః ప్రతపతాం శ్రేష్ఠో ద్విపదాం బ్రాహ్మణో వరః
ఆశీవిషశ్చ సర్పాణా మగ్ని స్తేజస్వినాం వరః ౧౫
ఆయుధానాం వరం వజ్రం కకుద్మీచ గవాం వరః
హ్రదానా ముదధిః శ్రేష్ఠః పర్జన్యో వర్షతాం వరః ౧౬

ధృతరాష్ట్రశ్చ నాగానాం హస్తిష్వైరావణో వరః
పుత్రః ప్రియాణా మధికో భార్యాచ సుహృదాం వరా
యథైతాని విశిష్టాని జాత్యాం జాత్యాం వృకోదర
ఏవం యువా గుడాకేశః శ్రేష్ఠ స్సర్వధనుష్మతామ్ ౧౮
సోఽయ మింద్రా దనవరో వాసుదేవా న్మహాద్యుతిః
గాండీవధన్వా బీభత్సు శ్శ్వేతాశ్వః కిం కరిష్యతి ౧౯
ఉషిత్వా పంచవర్షాణి సహస్రాక్షస్య వేశ్మని
అస్త్రయోగం సమాసాద్య స్వవీర్యా న్మానుషాద్భుతమ్
దివ్యా న్యస్త్రాణి చాప్తాని దేవరూపేణ భాస్వతా
యం మన్యే ద్వాదశం రుద్ర మాదిత్యానాం త్రయోదశమ్
వసూనాం నవమం మన్యే గ్రహాణాం దశమం తథా
యస్య బాహూ సమౌ దీర్ఘౌ జ్యాఘాతకఠినత్వచౌ ౨౨
దక్షిణే చైవ సవ్యేన గవా మివ వహః కృతః
హిమవా నివ శైలానాం సముద్రః సరితా మివ ౨౩
త్రిదశానాం యథా శక్రో వసూనా మివ హవ్యరాట్
మృగాణా మివ శార్దూలో గరుడః పతతా మివ ౨౪
వర స్సన్నహ్యమానానాం సోఽర్జునః కిం కరిష్యతి అర్జునః
ప్రతిజ్ఞాం షండకోఽస్మీతి కరిష్యామి మహీపతే ౨౫
జ్యాఘాతౌ హి మహాంతౌ మే సంవర్తుం నృప దుష్కరౌ
వలయై శ్ఛాదయిష్యామి బాహూ కిణకృతా విమౌ ౨౬

.... .... .... ....

పినద్ధః కంబుపాణిభ్యాం తృతీయాం ప్రకృతిం గతః ౨౭

.... .... .... ....

కథనాఖ్యాయికాశ్చైవ స్త్రీభావేన పునః పునః ౨౮

రమయిష్యే మహీపాల మన్యాం శ్చాంతఃపురే జనాన్
గీతం నృత్యం విచిత్రించ వాదిత్రిం వివిధం తథా ౨౯
శిక్షయిష్యా మ్యహం రాజన్ విరాటస్య పురస్త్రియః

... ... ... ....

యుధిష్ఠిరస్య గేహే వై ద్రౌపద్యాః పరిచారికా
ఉషితాఽస్మీతి వక్ష్యామి పృష్టో రాజ్ఞాచ పాండవ

... ... ... ...

విహరిష్యామి రాజేంద్ర విరాటభవనే సుఖమ్ 33
ఇత్యేవ ముక్త్వా పురుషప్రవీర
స్తథార్జునో ధర్మభృతాం వరిష్ఠః
వాక్యం తథాఽసౌ విరరామ భూయో
నృపోఽపరం భ్రాతర మాబభాషే 3౪

(ఖాండవవనమును దహింపగోరి యగ్నిహోత్రుడు బ్రాహ్మణుడై కృష్ణసహాయుడగు నెవ్వాని జేరవచ్చెనో యా మహాబలుడు, మహాబాహుడు అజితు డాకురనందనుడు కౌంతేయుడు, ధనంజయు డేమి గావింపగలడు. పన్నగ రాక్షసులను జంపి యేకరథుండై విజయమొంది పావకుని దృప్తునిం గావించియున్నాడు. సర్పరాజు వాసుకియొక్క చెల్లెలను హరించి తెచ్చెను. అట్టి ప్రతియోధులలో శ్రేష్ఠుం డగు నర్జునుం డేమిగావించును ... ... ... ... వృకోదరా! జాతి జాతియందును విశిష్టము లుండునటుల యువానుడగు గుడాకేశుడు సర్వధనుష్మంతులలో శ్రేష్ఠుడైయున్నాడు. అట్టి యీతడిందు్రనికంటె నవరుడుకాడు, వాసుదేవునివలన (కంటె) ప్రకాశించువాడు (వాసుదేవా న్మహాద్యుతిః) ఆ

గాండీవధన్వుడు, బీభత్సుడు, శ్వేతాశ్వు డేమిచేయగల వాడు. సహస్రాక్షుని వేశ్మమున నైదువత్సరము లుండి స్వ వీర్యమున మానుషాద్భుతగు నస్త్రయోగ మొందెను. దివ్యాస్త్రచాపములవలన దేవరూపవిభాసితుడై నాడు. ఎవ్వాని ద్వాదశరుద్రుడుగ, త్రయోదశాదిత్యుడుగ, నవమవసువుగ దశమగ్రహముగ దలంతునో యా యర్జును డేమిగావించునో అని ధర్మజుడు పలుకగా నర్జును డిట్లు పలికెను. 'మహీపతీ! షండకుడని ప్రతిజ్ఞ గావించువాడను. కిణకృత బాహువులను వలయాచ్ఛాదితముల గావించుకొనెదను, తృతీయప్రకృతి నొంది బృహన్నలయను నామమున నాటపాటలందు శిక్షకు డనై విరాటనగరమున నుండెదను, యుధిష్ఠిర గేహమందు ద్రౌపదీ పరిచారికనని పలికెదను. అర్జునుడిట్లు పలికి విరమిం పగా ధర్మజుడు నకులునితో నిట్లు పలికెను.)

మొదటియధ్యాయమున వృకోదరుని వ్యాపారమును ధర్మజు డడిగిన ట్లాఖరుశ్లోకము గలదు. రెండవయధ్యాయ మాఖరుశ్లోకమున ధర్మజుడు నకులునిగూర్చి పలికినాడని మాత్రమే గలదు. అడుగుటమాత్రము మూడవయధ్యా యము మొదటిశ్లోకములో గలదు. ఇందువలన రెండవ యధ్యాయమంతయు నర్జునవిషయముగా బ్రత్యేకముగు చున్నది. మఱియు భీమార్జునుల వ్యాపారమును దెల్పునది యగుచున్నది. వృకోదరుడు పౌరోగవుడుగా విరాటుని సమీపించెదనని పలుకుట, అర్జునుడు 'ప్రతిజ్ఞాం షండకో స్మీతి' అని పలుకుట విచిత్రముగా నున్నది. తమ్ములను

గూర్చి ప్రసంగించుటలో ధర్మరాజుడు విశేషముగా నర్జునుని గూర్చి పలికియున్నాడు. అప్పుడే యింద్రలోకమందు ఘన మర్యాదనొంది వచ్చినవాడు, త్రిలోకప్రఖ్యాతుడు నగు నర్జునుని గూర్చి యపుడు ధర్మరాజు డట్లు పలుకవలసి యుండి నది. భీమసేనుని విషయమై యిందు ధర్మరాజుడు కడుజాగ రూకుడై ప్రవర్తించినాడు. అర్జునప్రశంసాసందర్భమున 'యత్రైతాని విశిష్టాని జాత్యాం జాత్యాం వృకోదర। ఏవం యునా గుడాకేశః శ్రేష్ఠ స్సర్వధనుష్మతాం అనిపలికినాడు. 'వృకోదర' అను సంబోధనమిందుండుట గమనింప దగినది. వంశశ్రేష్ఠులగువారు-మఱియు వంశజ్యేష్ఠులగువారు-యుధిష్ఠిర భీమసేనులిద్దఱు నర్జునుని గూర్చి ప్రశంసించి విచారించిరను సమరసమగు నభిప్రాయ మిందువలన నేర్పడుచున్నది. అర్జు నుని ప్రశంసించుటయందు భీమసేనుని విషయమై ధర్మరాజు డెంతజాగరూకుడై యున్నదియు, లేక యుచితమాచరించి నదియు నిది సుస్పష్టము చేయుచున్నది. 'అర్జునా నీవేమి గావింతువు'అని కాక ధర్మరాజుడు'సోఽయం కిం కర్మకౌంతేయః కరిష్యతి ధనంజయః, సోఽర్జునః కిం కరిష్యతి' అని వచించు టయు గమనింపదగినది.

ధర్మరాజుడు నకులసహదేవు లుండు తెఱగు విచారిం పగా వారు తాముండు విధమును వివరించిరి. ధర్మరాజుడు పిమ్మట ద్రౌపదిగూర్చి యిట్లు పలికినాడు.

ఇయం హి నః ప్రియా భార్యా ప్రాణేభ్యోఽపిగరీయసీ
మాతేవ పరిపాల్యా చ పూజ్యా జ్యేష్ఠేవచ స్వసా 3-౧౮

(ఇది మనప్రియపత్ని, ప్రాణములకంటె గరీయు మైనది. ఈమె తల్లివలె పరిపాలింప దగినది, అక్కవలెనే పూజింపవలసినది.)

ద్రౌపదివిషయమై గౌరవబుద్ధిజూపి, విచారించి 'ఈమె యెట్లు మెలంగును' అని ధర్మజుడు తమ్ములనుగూర్చి పలికినాడు. ప్రథమపురుషలో నీవిషయ మున్నది. సైరంధ్రి జాతియందు బ్రత్యేకత గలదనియు, తాను సైరంధ్రిగా విరాటనగరమం దుండెదననియు ద్రౌపది పలికినది.

కళ్యాణం భాషసే కృష్ణే కులే జాతాసి భామిని
న పాప మభిజానాసి సాధ్వీ సాధువ్రతే స్థితా 3-౨౨
యథా న దుర్హృదః పాపా భవంతి సుఖినః పునః
కుర్యా స్తథా త్వం కళ్యాణి లక్షయేయు ర్న తే యథా

(సత్కులప్రసూతవు గాన మంచిమాట చెప్పితివి. పతివ్రతవు సన్మార్గమున వర్తించుదానవు, ఏపాప మెఱుంగవు, దుష్టులు మరల సుఖవంతులు గాకుండు తెఱంగున, నిన్ను వారెఱుంగ కుండునట్లు వర్తింపవలయును.)

సభాస్తారుడుగా గంకుడను నామమున ధర్మరాజు, వంటవాడుగా మల్లుడుగా వల్లవుడను నామమున భీముడు, నాట్యాచార్యుడుగా బృహన్నళ నామమున నర్జునుడు, అశ్వబంధుడుగా గ్రంథికినామమున నకులుడు, గోసంఖ్యాతగ తంతిపాలుండను నామమున సహదేవుడు, సైరంధ్రిగా ద్రౌపది విరాటనగరమున నుండుటకు పాండవులు నిశ్చయము గావించికొనిరి.

కర్తా న్యకార్యాని యుష్మాభి ర్యాని యాని కరిష్యథ
మను చాపి యథా బుద్ధి రుచితా విధినిశ్చయాత్ ౪౨

(మీరు చెప్పిన యాయాకార్యములు తగియున్నవి. విధినిశ్చయమున నాకును నిది తగువిధమే యని తోచినది.)

తప్పులు. భార్య పలికినదానికి తనయంగీకారమును దెల్పి ధర్మరాజు పరివారమునంతయు బంపివేయదలంచి యెవ రెవ రెచ్చటికి చేరుకొనవలయునో దాని నిర్ణయమును బలికినాడు. ఇం దన్నిటికంటె ముందుగా బురోహితుని విషయము, అగ్నిహోత్రిముల విషయము దెల్పుట ధర్మబద్ధముగా నున్నది. ఆసంవత్సరము గావింపవలసియున్న యగ్నిహోత్రాది వైదిక నిత్యకృత్యముల విషయమై ముందుగా దెల్పి పిమ్మట ధర్మరాజు సకలనిర్ణయములు గావించినాడు. అపుడు పురోహితుడగు ధౌమ్యు డిట్లు పలికినాడు.

విదితం వో యథా సర్వం లోకవృత్త మిదం తవ
విదితం చాపి వక్తవ్యం సుహృద్భి రనురాగతః
ఏష ధర్మశ్చ కామశ్చ అర్థశ్చైవ సనాతనః. ౪౫

(లోకవృత్తమెటింగిన మీకంతయు దెలిసియే యున్నది. అయినను సుహృదులు ప్రీతిం జేసి చెప్పవలసియే యున్నది. ఇది ధర్మము, కామము—సనాతనమైన త్రివర్గము.)

ఇదివఱకు పాండవులు ప్రభుస్థానములోనుండి త్రివర్గమును సాధించియుండిరి. ఇపుడు రాజసేవాధర్మములోనుండి యెట్లు త్రివర్గము ననుష్ఠింపవలసినదియు బురోహితుడు

ధౌమ్యుడు వివరించినాడు. రాజగృహవాస మతికష్టమైనదని తెల్పినాడు. అందున గౌలికించుకొనుటయేకాని కొలుచుట యెఱుంగని రాజకుమారుల కందున్న కష్టముల నెల్ల ధౌమ్యుడు దెలియజేసినాడు. రాజసేవాధర్మములు తెల్పి నందులకు యుధిష్ఠిరుడు కృతజ్ఞతను దెల్పినాడు.

అనుశిష్టాః స్మ భద్రంతే నైత ద్వక్తాఽస్తి కశ్చన
కుంతీ మృతే మాతరం నో విదురం వా మహామతిమ్.
తదే వానంతరం కార్యం తద్భవాన్ వక్తు మర్హతి
తారణాయాస్య దుఃఖస్య ప్రస్థానాయ జయాయచ ॥౩
ఏవముక్త స్తతో రాజ్ఞా ధౌమ్యోఽథ ద్విజసత్తమః
అకరో ద్విధివ త్సర్వం ప్రస్థానే య ద్విధీయతే ॥౪
తేషాం సమిధ్య తా నగ్నీన్ మంత్రవ చ్చ జుహావ సః
సమృద్ధి వృద్ధి లాభాయ పృథివీవిజయాయచ ॥౫
అగ్నీన్ ప్రదక్షిణీ కృత్య బ్రాహ్మణాం శ్చ తపోధనాన్
యాజ్ఞసేనీం పురస్కృత్య షడేవాథ ప్రవవ్రజుః ॥౬

(మీరుచిత మెఱిగించితిరి భద్రమగుగాక. మాతల్లి యగు కుంతియు, మహాబుద్ధిమంతుడగు విదురుడును, మీరును దక్క మాకిట్లు బోధించువారెవరు. ఈదుఃఖమునుండి దరిచేరుటకును, ప్రస్థానమునకును, జయమునకు నిపుడు గావింపవలసిన కార్యము మీరు గావింపుడు' అని యుధిష్ఠిరుడు పలుకగా ధౌమ్యుడగ్నిహోత్ర మాచరించి విధ్యుక్తముగ హోమ మొనరించి, ప్రస్థాన మంగళ మాచరించెను. సమృద్ధి వృద్ధి లాభముకొఱకును, పృథివీవిజయముకొఱకును నగ్నిహోత్రము

లకు, తపోధనులగు బ్రాహ్మణులకు ప్రదక్షిణ మాచరించి పాండవులు యాజ్ఞసేనిని ముందుంచుకొని దూరముగా బయలు వెడలిరి.)

పరమాస్తికులగు పాండవులు సునిహితమగు ధర్మము నాచరించి ప్రస్థానమంగళపూర్వకముగా బయలుదేరిరి. వేల కొలది పరివారముచే నిరంతరము సేవలు గొనుచుండిన రాజాధిరాజులగు పాండవు లిప్పుడు సత్యవచనమునకై (ప్రతిజ్ఞాపాలన మొనరించుటకు గాను) కష్టతరమగు నజ్ఞాతవాసమును చేయగోరి యొక్కడుగూడ వెంటలేకుండ ఘోరాటవుల బడి ప్రయాణ మొనరించిరి. కొండలు, వనములు, నదులు దాటుకొనుచు, క్రూరమృగములు సంచరించు త్రోవను బడి వానిని సంహరించి మార్గ మేర్పఱచుకొనుచు గడ్డములు, మీసములు పెంచి విచిత్రులై (మారు వేషములు ధరించి) ద్వైతవనమునుండి బయలుదేరిన పాండవు లనేక ఘోరాటవులను దాటి మత్స్యదేశమును జేరుకొనిరి. ద్రౌపది పథిశ్రమమును బొందగా యుధిష్ఠిరుడామెను మోచి తెమ్మని ధనంజయునితో చెప్పగా నాతడు గజేంద్రునిమాడ్కి ద్రౌపది నెత్తికొనివచ్చి నగరపరిసరమున దింపినాడు. ఇట్లుగా పాండవులు విరాటనగర పరిసర ప్రదేశమును చేరుకొనిరి. పాండవు లపుడు వారి యాయుధములను దాచుకొనవలసి వచ్చినది. నిర్మానుష్యమైన యాయడవియందు శ్మశానమునకు సమీపముగా భీమశాఖలు గల్గి ఎక్కుట కసాధ్యమైన శమీవృక్ష

మొకటి వారు చూచిరి. అది చోరరానిదై యుండుటగాంచి యచ్చటతమ ఆయుధములను పాండవులు దాచుకొనదలంచిరి.

యేన దేవా న్మనుష్యాంశ్చ సర్వాంశ్చైకరథోఽజయత్,
స్ఫీతాన్ జనపదాంశ్చాన్యానజయత్ కురుపుంగవః. ౧౮
తదుదారం మహాఘోషం సపత్నబలసూదనమ్,
అవజ్య మకరోత్ పార్థో గాండీవం సుభయంకరమ్. ౧౯

(దేనిచే నర్జును డేకరథుడై దేవతలను, మనుష్యులను జయించినాడో, స్ఫీతమైన జనపదములను జయించినాడో ఆయుదారము, మహాఘోషము, సపత్న బలసూదనము, భయంకరము నగు గాండీవముయొక్క నారి నర్జునుడు సడలించెను.)

మహాఘనమైన గాండీవమునారి నిట్లు సడలింపవలసి వచ్చుటయందు గల శోచనీయపరిస్థితి యిచ్చట వ్యక్తము చేయబడినది. కావుననే మొదటగా గాండీవవిషయమే చెప్పబడినది. పిమ్మటనే ధర్మజ భీమ నకుల సహదేవులు వారి వారి ధనస్సులను విజ్య మొనర్చుట చెప్పబడినది. ధర్మజు నాజ్ఞాప్రకారము నకులు డాయుధములమూటను శమీవృక్షమున గట్టెను. 'అశీతి శతవర్ష ప్రాయముగల మాత, యిట్లు గావించుట మా కులధర్మము' అని యచ్చోట నున్న గోపాలురకు వినబడునట్లుగా బలుకుచు పాండవులు నగరసమీపమునకు వచ్చిరి. "అశీతి శతవర్షేయం మాతాన ఇతి వాదినః" అని యిక్కడ గలదు. ఇందు 'మాతల్లి' అని కలదే కాని తల్లి చనిపోయినది అని కంఠతః లేకుండుట గమనింపదగినది,

ధనస్సుల నట్లు చెట్టునకు గట్టి వెడలుట పాండవులకు తల్లిని విడిచి వెళ్ళినంతటి కష్టమును గల్గించినదని యభిప్రాయము. పిమ్మట పాండవులు విరాటనగరమును ప్రవేశించిరి. జయుడు, జయంతుడు, విజయుడు, జయత్సేనుడు, జయద్బలుడు—అను సాంకేతికనామము లపుడు పాండవు లేర్పఱచుకొనిరి. ధర్మరాజు విరాటుకొలువుకూటమును జేరవచ్చినాడు.

## ధర్మజుని ప్రవేశము

నరాధిపో రాష్ట్రపతిం యశస్వినం
మహాయశాః కౌరవవంశవర్ధనః,
మహానుభావో నరరాజ సత్కృతో
దురాసద స్తీక్ష్ణవిషో యథోరగః. ౭-౨
బలేన రూపేణ నరర్షభో మహా
నపూర్వ రూపేణ యథాఽమర స్తథా,
మహాభ్రజాలై రివ సంవృతో రవి
ర్యథాఽనలో భస్మవృతశ్చ వీర్యవాన్. 3
త మాపతంతం ప్రసమీక్ష్య పాండవం
విరాటరాడిందు మివాభ్ర సంవృతమ్,
సభాగతం పూర్ణశశిప్రభాననం
మహానుభావం నచిరేణ దృష్టవాన్. ౪

నరాధిపుండును, మహాయశశ్శాలియు, కౌరవవంశవర్ధనుడును, మహానుభావుడును, నరరాజసత్కృతుడును, తీక్ష్ణవిషముగల సర్పమట్లు దురాసదుండును, బలము, రూపము—

వీనిచే మహాపురుషునట్లు మఱియు నపూర్వరూపముచే నమరునట్లు విలసిల్లుచున్న వాఁడును, మహాభ్రజాలసంవృతుఁడగు సూర్యునట్లు మఱియు భస్మావృతమగు నగ్నిహోత్రునట్లున్న వాఁడును, వీర్యవంతుఁడు నగు యుధిష్ఠిరుఁడు విరాట సభను ప్రవేశించెను. అభ్రసంవృతేందునట్లుండి యేతెంచునట్టి యాపాండవుని విరాటరాజు దిలకించెను. సభాగతుఁడైన, పూర్ణశశిప్రభాననుఁడైన యామహానుభావుని నచిరకాలముననే విరాటు డీక్షించినవాఁ డాయెను.)

మంత్రి ద్విజాన్ సూతముఖాన్ విశ స్తథా
యేచాపి కేచిత్ పరిత స్సమాసతే,
పప్రచ్ఛ కోఽయం ప్రథమం సమీయివాన్
నృపోపమోఽయం సమవేక్షతే సభామ్. ౫

న తు ద్విజోఽయం భవితా నరోత్తమః
పతిః పృథివ్యా ఇతి మే మనోగతమ్,
న చాస్య దాసో న రథో న కుంజర
స్సమీపతో భ్రాజతి చాయ మింద్రవత్. ౬
శరీరలింగై రుపసూచితో హ్యయం
మూర్ధాభిషిక్త స్త్వితి మే మనోగతమ్,
సమీపమాయాతి చ మే గతవ్యథో
యథా గజ స్తామరసీం మదోత్కటః. ౭

(మంత్రులు, ద్విజులు, సూతులు, వైశ్యులుమున్నగు సభాసదుల గనుంగొని విరాటుఁడు 'ఇతం డెవఁడో మనసభకు

వచ్చుచున్నవాడు, రాజు నట్లున్నవాడు, ద్విజుడు గానేరడు, నరోత్తముడై యుండును, పృథివికంతకు నధిపతియై యుండు నని నాకు దోచుచున్నది. ఈతని వెంబడి దాసుడుగాని, రథముగాని, కుంజరముగాని లేకుండినను సాక్షా దిందునివట్లు విరాజిల్లుచున్నాడు. ఈతని రూపరేఖావిలాసంబులు చూడ మూర్ధాభిషిక్తుడని తోచుచున్నది. మదగజము తామర కొలను చొచ్చునట్లు నిర్విచారుడై మనసభకు వచ్చు చున్నాడే అని విరాటుడు వితర్కించుచుండెను.)

నరుల కందఱకు నధిపతియగువాడు చిన్నరాష్ట్రపతిని గొల్వవచ్చినాడు. మహాయశశ్శాలి యశస్వియగువానిని గొల్వవచ్చినాడు. ఆమహాయశశ్శాలి, కౌరవవంశవర్ధనుడు, మహానుభావుడు, నరరాజ సత్కృతుడు. అట్టి మహాను భావుడు నరరాజును (రాజమాత్రుని) గొల్వవచ్చినాడు. బలము, రూపముచేత తీక్ష్ణవిషముగల సర్పమువలెనే దురా సదు డాతడు, మఱియు నపూర్వరూపముచేత దేవతవంటి వాడు. ఆతని యావేషము మహాభ్రజాలములచేత సంవృత మగు సూర్యు నట్లున్నది. యుధిష్ఠిరుని కంకవేష మట్లున్నదని యభిప్రాయము. ఆవేషము భస్మావృతమగు ననలమువలెనే యుండెను. ఇట్లయ్యు నాతనియందు గాంతిపుంజ మొప్పియే యుండెను. అపుడు విరాటరాజు సభాగతుడై యుండెను. ఆ నిండు సభను ధర్మరాజు ప్రవేశించెను. ఆకాశమున నభ్రసం వృతుడగు జందునివలెనే శోభను గల్గించుచు ధర్మజుడు విరాటసభను ప్రవేశించెను. యుధిష్ఠిరుడు ప్రవేశింపగానే

చంద్రుడుదయించినట్టుల శోభాయమానమైన దా సభ. ఆతడు ద్వారమున నున్నపు డాకాశమున జంద్రు డుద యించు రీతి దోచినది. సభను ప్రవేశించి యాతడు పూర్ణ శశిప్రభాసనుడుగ వెలుగొందినాడు. అట్టి మహానుభావుని విరాటరాజు తటుక్కున చూచినాడు. విరాటునిదృష్టి తటా లున నటువైపే ఆకర్షింపబడినదై యబ్బుర మందినదని భావము. అపుడు విరాటుడు మంత్రులు, ద్విజులు మొద లగువారితో 'ఇతం దేవడో కనుగొనుడు' అని పలుకుచునే 'ఇతడు నృపోపముడు సభ నట్లుగా దిలకించుచున్నాడు' అని నాడు. ధర్మజుని చూపు ప్రభుండు సభను వీక్షించినట్లుగా నుండినదని భావము. 'ఇతండు ద్విజుండు గానేరడు. నరోత్త ముడగు పృథ్వీపతి యగును' అని విరాటు డనినాడు. ఇట్లని విరాటుని మనము నిశ్చయించినది. 'పృథ్వీ కంతకు సార్వభౌ ము డగునట్టి యీతడు దాసుడు, రథము, గజము లేక వచ్చు చున్నాడు' అని విరాటు డబ్బురమంది పలికినాడు. ఇక్కడ 'దాసః, రథః, కుంజరః' అని యేకవచనములు ప్రయోగింప బడుట గమనింపదగినది. 'ఒక్క దాసుడు, రథము, కుంజరము లేకపోయినను నీతడు మిక్కిలిగా శోభించుచున్నాడు' అనుచు విరాటుడు సభలో నావిశేషము నిట్లు వివరించినాడు. 'అయి నను నితం డింద్రునివలెనే శోభించుచున్నాడు' అనివిరాటు డనినాడు. (న చాస్య దాసో న రథో న కుంజర స్సమీప తో భ్రాజతి చాయ మింద్రవత్) విరాటుడు మఱియు నిట్లని నాడు. శరీరలక్షణములు చూచిన నితడు మూర్ధాభిషిక్తుడని

నా మనోగతమైనది. మదపుటేనుగు తామరకొలనులో బ్రవేశించునటుల గతవ్యథుడై యీతడు మనకొలువు బ్రవేశించుచున్నాడే' విరాటు డాశ్చర్య మొందినవాడై సభలో నిట్లు పలికినాడు.

వితర్కయంతం తు నరర్షభ స్తథా
యుధిష్ఠిరోఽభ్యేత్య విరాట మబ్రవీత్,
సమ్రా డ్విజానా త్వివహ జీవనార్థినం
వినష్ట సర్వస్వ ముపాగతం ద్విజమ్. ౨-౮

(ఇట్లు విరాటుడు వితర్కించుచుండగనే యుధిష్ఠిరుడు సమీపమున కేతెంచి 'సమ్రాట్! సమస్తము పోగొట్టుకొని జీవనార్థిగా వచ్చిన ద్విజునిగా దెలియుము' అని పలికెను.)

రాజుల నందఱను దనచరణయుగ్మము గొల్చునట్లుగా రాజసూయ మొనరించిన మహానుభావు డిపు డొక సామంతుని జేరి యతనిని 'సమ్రాట్' అని సంబోధింపవలసి వచ్చినది. 'జీవనార్థినం వినష్ట సర్వస్వ ముపాగతం' అని పలుకవలసివచ్చినది. ఇంతటి విషమపరిస్థితికి బాల్పడియు ధర్మజుడు సేవాధర్మమును బురస్కరించుకొని తదుచితమగు పలుకులు పలికినాడు. సమస్త భూమండలరాజ్యము దేనికై పరిత్యజించినాడో యాధర్మమునకై పరిస్థితికి దగినటుల నుచితవచనము పలికినాడు. రాజసింహుడగు ధర్మజ డొక రాజమాత్రుని జేరి కొలువు నపేక్షించినాడు, కంకుడుగా బ్రవేశించినాడు. కంకునందు విరాటున కెక్కువ యాదర మేర్పడినది. ఆత డిటుల పలికినాడు.

హన్యా మవశ్యం యది తేఽప్రియం చరే
త్ప్రవ్రాజయేయం విషయా ద్ద్విజాం స్తథా,
శృణ్వంతు మే జానపదా స్సమాగతాః
కంకో యథాఽహం విషయే ప్రభు స్తథా. ౭-౧౮

(నీ కప్రియము గావించువానికి మరణదండన విధిం చెదను. వారు ద్విజు లగుచో విషయమునుండి పంపివేయుదును. జానపదులు నామాట వినవలసినది. కంకు డీ విషయమందు నావలెనే ప్రభుండని యెఱుంగుడు. విరాటుడు సభ యందిట్లుగా బలికెను.)

విరాటు డిట్లు బలికి 'నీవు నాకు సఖుడవు' అని ధర్మజునిగూర్చి పలికినాడు. తనకువలెనే సకలభోగము లాతనికి గల్గించినాడు. 'మానగళులలో నతి స్వేచ్ఛమై లోపలను వెలుపలను నీవు సంచరింపవచ్చును. నీ కెందును నడ్డంకిలేదు. అని విరాటుడు పలికినాడు. 'కృతంచ తే ద్వార మపావృతం మయా' (అన్ని ద్వారములు నీకు తెరవబడినవి) అని విరాటుడు ధర్మజునితో బలుకుచు నింకను నుత్సాహమును బ్రకటించుచు 'నీమాట ప్రకారము నిన్నాశ్రయించువారికి కూడ వృత్తి కల్పించెదను. నిస్సంశయము' అనినాడు. ఇట్లుగా విరాటునివలన నాదరాభిమానములను బొంది యుధిష్ఠిరుడు విరాటనగరమున గంకుడుగా నజ్ఞాతవాస మ్మొనరించుచుండెను. ఆతని నెవ్వ రెఱుంగ లేరైరి.

## భీమనిప్రవేశము.

స సూదరూపః పరమేణ వర్చసా
రవిర్యథా లోక మిమం ప్రకాశయన్,
సుకృష్ణవాసా గిరిరాజసారవాం
స్తం మత్స్యరాజం సముపేత్య తస్థివాన్.
తం ప్రేక్ష్య రాజాస మివాన్తికాగతం
తతోఽబ్రవీజ్జానపదాన్ సమాగతాన్,

సింహోన్నతాంసోఽయ మతీవరూపవాన్
ప్రదృశ్యతే కోను నరర్షభో యువా.
అదృష్టపూర్వః పురుషో రవిర్యథా
వితర్కయన్నాస్య లభామి నిశ్చయమ్,
తథాస్య చిత్తం హ్యపి సంవితర్కయ
న్నరర్షభస్యాస్య న యామి తత్త్వతః.
దృష్ట్వైవ చైనం న విచారయామ్యహం
గంధర్వరాజో యది వా పురందరః,
జానీత కోఽయం మమ దర్శనే స్థితో
యదీప్సితం తల్లభతాం చ మా చిరమ్. ౫

(భీముడు సూదరూపమున విరాటనగరము ప్రవేశించెను. ఆతడు పరమవర్చస్సుచే సూర్యుడు లోకమునువలెనే ప్రకాశింపజేయు చుండెను. నల్లనిబట్టలు కట్టుకొనియున్న గిరిరాజసారుడు భీమసేనుడట్లు మత్స్యరాజును సమీపించెను. తనయొద్దకు వచ్చియున్న భీమసేనునిగాంచి జానపదులతో

'ఇతడు సింహోన్నతాంసుడు, అతీవరూపవంతుడు, కాలములోనున్న నితండు నరర్షభుండగును. ఈత డదృష్టపూర్వుడు, సూర్యునివంటివాడు. ఈనరర్షభునిగూర్చి వితర్కించియు నేమియు నిశ్చయింపజాలకున్నాను. చూచియు విచారింపలేకున్నాను. ఇతడు గంధర్వరాజో లేక పురందరుడో నిశ్చయింపరాకున్నది. ఇతడు నన్నుజూడ నేమియపేక్షించుచున్నది తెలిసికొనుం డతం డపేక్షించినదివేగము పొందును గాక.)

సూదరూపమున నున్నను భీముడు సూర్యుడు లోకమునుబ్రకాశింపజేయునటుల నున్నాడు. నల్లనిబట్ట కట్టుకున్న భీముడు గిరిరాజసారుడుగ ద్యోతమగుచున్నాడు. 'సుకృష్ణవాసా గిరిరాజ సారవాన్' అను పాదము మొదలు ప్రతి పాదము సాభిప్రాయమగు పదములతో నిండియున్నది. 'పరిదృశ్యతే, వితర్కయన్, సంవితర్కయన్, న విచారయామి' అను పదములాయా పాదభావములను చక్కగా బోధించుచున్నవి.

సింహోన్నతాంసోఽయ మతీవరూపవాన్ పరిదృశ్యతే
కోను నరర్షభో యువా.
అదృష్టపూర్వః పురుషో రవిర్యథా వితర్కయ న్నాస్య
లభామి నిశ్చయమ్
తథాస్య చిత్తం హ్యపి సంవితర్కయ న్నరర్షభస్యాస్య
న యామి తత్త్వతః

దృష్ట్వైవ చైనం నః విచారయామ్యహం గంధర్వరాజో
యదివా పురందరః॥

భీముడు వంటవాడుగా నుందుననియు, మల్లయుద్ధమందు నేర్పు గలదనియు, క్రూరమృగములతో పోట్లాడ గలననియు దెల్పినాడు. 'అట్లుగా నుండుట నీకు తగదు, అయినను నీయిష్టమెట్లో యట్లే కావచ్చును' అని విరాటుడు పలికినాడు. ఇట్లుగా విరాటుని గొల్వవచ్చిన భీముడు మహానసగృహమును ప్రవేశించెను.

ధర్మజుడు ప్రవేశించినపుడు పరిషత్తులోనున్న మంత్రులు, ద్విజులు మొదలగువారిని విరాటుడు ప్రశ్నించినట్లు గలదు. భీముడు ప్రవేశించినపుడు సమాగతులగు జానపదుల నడిగినట్లు గలదు. ఇందువలన విరాటుడు ధర్మజునకు గంకుడుగా నాశ్రయమొసంగుట సభలో జరిగినదనియు, సభ చాలించి వచ్చుచున్న సమయమున భీముడు విరాటునకు గనబడినాడనియు దెల్లమగుచున్నది. ఆస్థానమందలి పెద్దలందఱు సభ చాలింపబడి వెడలిపోయిరనియు, కంకుడును తనకు నిర్దేశింపబడిన బసకు వెడలిపోయినాడనియు నభిప్రాయము. కావుననే భీముడు ప్రవేశించినపుడు విరాటుడు జానపదులనే యడిగినట్లు గలదు. ధర్మజునకు విరాటుడు స్వాగతమిచ్చినాడు. భీమునియొద్దకు శీఘ్రగాములగు నరులను బంపినాడు.

న చాస్య దాసో న రథో న కుంజర స్సమీపతో భ్రాజతి
చాయ మిందవత్.

దృష్ట్వైవ చైనం న విచారయామ్యహం గంధర్వరాజో
యదివా పురందరః.

ఈ రెండు పాదములు ధర్మజ భీములనుగూర్చి క్రమముగా చెప్పబడి యున్నవి. ఇందుకూడ ధర్మజుని యందెక్కువ భావము ధ్వనించుచున్నది.

## ద్రౌపదిప్రవేశము

తతః కేశాన్ సముత్‌క్షిప్య వేల్లితాగ్రాననిందితాన్,
కృష్ణాన్ సూక్ష్మాన్ మృదూన్ దీర్ఘాన్ సముద్గ్రథ్య
శుచిస్మితా. ౧-౧

జుగూహే దక్షిణే పార్శ్వే మృదూనసితలోచనా,
వాసశ్చ పరిధాయైకం కృష్ణా సుమలినం మహత్. ౨
కృత్వా వేషంచ సైరంధ్ర్యాః స్తతో వ్యచరదార్తవత్,
తాం నరాః పరిధావంతః స్త్రియశ్చ సముపాద్రవన్. ౩
అపృచ్ఛంశ్చైవ తాం దృష్ట్వా కా త్వం కించ చికీర్షసి. ౪

(అంతట నల్లని కటాక్షములు గలదియు, శుచిస్మితయునగు ద్రౌపది చుట్టుకొనిన కొనలు గలవియు, ననిందితములును, మృదువులును, పొడవును, నల్లనివియునగు శిరోజములను కుడిప్రక్కకు మీటునట్లు దోపి, నల్లని మాసిన యొంటిబట్టను గట్టుకొని సైరంధ్రీరూపము ధరించి యార్తయుగునదగుచు ద్రౌపది విరాటనగరమందు దిరుగుచుండెను.

పురుషులు పరుగు పరుగున వచ్చిరి, స్త్రీలు గుమిగూడిరి, నీ వెవరు? ఏపని చేయుదువు' అని వారందఱు ద్రౌపది నడిగిరి.)

ఇందు పురుషులనుగూర్చి 'పరిధావంతః' అనియు, స్త్రీలనుగూర్చి 'సముపాద్రవన్' అనియు జెప్పబడినది. ఇది స్త్రీ పురుషుల స్వభావమును వ్యక్తము చేయుచున్నది.

'నీ వెవరు, ఏమి పని చేయుదువు' అని పురజను లడుగగా 'నేను సైరంధ్రిని, నన్ను పోషించువారికి పనులు గావించెదను' అని ద్రౌపది పలికినది. ఆమె రూపము, వేషము, మాటలపొందు చూచి యామూగినప్రజ లన్న హేతువుగా వచ్చినదాసి యామెయని విశ్వసింపలేకుండిరి.

పరమసమ్మతురాలగు సుధేష్ణ ప్రాసాదమునుండి ద్రౌపదిని జూచి తనయొద్దకు బిలిపించుకొని యడుగగా దాసిగా నుందునను భావముననే ద్రౌపదిపలికినది. 'నీ వెవరు, నీవెట్లును దాసి కానేరవు' అని సుధేష్ణ ద్రౌపదినిజూచి పలికినది, 'దేవతాదులలో నొకర్తవై యుందువు' అని మరల పలికినది, ఇంకను 'దేవతాశ్రేష్ఠురాలవై యుందువు' అని పలికినది, 'విఖ్యాతులగు దేవతాశ్రేష్ఠులభార్యలందొకర్తవై యుందువు' అనియు పలికినది. ద్రౌపది 'నేనిం దెవర్తెను కాను. సైరంధ్రిని, నాకు జడలు వేయుట, నలుగునూరుట, పువ్వులు ముడుచుట వచ్చును' అని పలికినది.

ఆరాధయంసత్యభామాం కృష్ణస్య మహిషీంప్రియామ్.౮-౨౦
కృష్ణాం చ భార్యాం పాండూనాం కురూణా మేకసుందరీమ్,

తత్ర తత్ర చరామ్యేవం లభమానా సుభోజనమ్. ౨౧
వాసాంసి యావంతి లభే తావత్తావదరమే తథా.
మాలినీత్యేవ మే నామ స్వయం దేవీ చకార సా. ౨౨
సాహ మద్యాగతా దేవి సుధేష్ణే త్వన్నివేశనమ్. ౨౩

('కృష్ణునకు మహిషియు, ప్రియురాలును నగు సత్యభామ నారాధించి యున్నాను. కురువంశజాతులగు పాండవులకు నేకసుందరియైన యిల్లాలు ద్రౌపది (నారాధించితిని.) అచ్చటచ్చట సుభోజన మొందుచు ప్రవర్తించి యుంటిని. వస్త్రము లెన్ని లభించిన నన్నిటినభిలషించెదను. 'మాలిని' అని స్వయ మా దేవియే నామముంచినది. ఆ నేను దేవి! యిపుడు నీగృహమునకు వచ్చియున్నాను.' అని ద్రౌపది సుధేష్ణతో బలికినది)

కృష్ణునకు మహిషియు ప్రియురాలు నైనది సత్యభామయనిపలికి ద్రౌపది 'సత్యభామ నారాధించితిని' అనిఘనముగా బలికినది. 'ఆరాధయం' అనుమాట ఘనముగా నున్నది. పిమ్మట ద్రౌపది విషయమై ప్రసంగించుచు 'కురూణా మేక సుందరీం' అని పలికినది. కురువంశము వారందఱిలోను ఏకసుందరియే కాక పాండవు లందఱకు నేకసుందరి ద్రౌపది యని యిందు సామంతము ధ్వనించుచున్నది. సత్యభామ యొద్ద 'ప్రియాం' అనుమాట ద్రౌపదియొద్ద 'ఏకసుందరీం' అనుమాట ద్రౌపది వచించినది. ఇది తత్కాల సంఘటనమున కెంతయేని సందర్భించి యున్నది. గంధర్వులకు సైరంధ్రి యంతటి ప్రియురాలనియు, గంధర్వుల కొక్క-

ర్త్రియే సుందరి యనియు ముందు ప్రసంగమున కనువర్తించు నట్టి ప్రసంగము నిట్లుగా ద్రౌపది యారంభించినది. పతివ్రతాశిరోమణి, జగదేకసుందరిగా ద్యోతమగు ద్రౌపది చాలా యుచితమగు ప్రారంభమును గావించినది. 'తత్ర తత్ర' అని ద్రౌపది పలికినది. ఆయాఘనప్రదేశమందలి యునికి నీమాట వివరించుచున్నది. 'అట్టి ఘనప్రదేశము లందు జరించుచు మృష్టాన్నములనారగించితిని' (లభమానా సుభోజనం) అని ద్రౌపది వచించుట గంభీరముగా నున్నది. వ్యక్తిత్వమందున్న సహజగాంభీర్యము నీమాట సూచించునది యగుచున్నది. వస్త్రవిషయకమగు ప్రసంగమును ద్రౌపది గావించినది. ఇది స్త్రీస్వభావమున కనువర్తించు మాట యగుచు దాసీస్వభావమున కనువర్తించునదియై యున్నది. 'ఆనేను నీవద్ద కిప్పుడు వచ్చితిని' (సాహ మద్యాగతా దేవి సుధేష్ణే త్వన్నివేశనం) అని తనయందున్న (సైరంధ్రియందలి) గొప్పతనము నిట్లుగా ద్రౌపది వ్యక్త మొనరించినది. ఇది యుత్తరప్రసంగమం దుపయుక్తమగు మాటయై యున్నది. ఇట్టి ప్రసంగమున ద్రౌపది సుధేష్ణ నత్యుత్తమస్థానమందు (సత్యభామకు ద్రౌపదికి నీడగువిధముగా) నిల్పునది యగుచు నంతటి గౌరవస్థాన మామె సైరంధ్రికి కల్గింపగలదను విషయమును పేర్కొనినట్లయినది. సుధేష్ణ యిట్లు పలికినది.

మూర్ధ్ని త్వాం వాసయేయం వై సంశయో మే న విద్యతే,

న చే దిచ్ఛతి రాజా త్వాం గచ్ఛే త్సర్వేణ చేతసా.౨3

(మూర్ధయందు నిన్ను బెట్టుకొందును. ! సంశయము లేదు. రాజు సర్వచేతస్కుడై నిన్నిచ్ఛయింపడేని—అని సుధేష్ణ పలికినది.)

సైరంధ్రి నింట నుంచుకొనుట యొకవిషయము, రాజు సైరంధ్రిని భార్త్రిగా వరించుననున దింకొకవిషయము—ఈ శ్లోకమం దీరెండు విషయములు గలవు. సైరంధ్రి నింట నుంచుకొనుటయందే సుధేష్ణ కెక్కువ మక్కువ గలదని యీశ్లోకము తెల్పుచున్నది. కావుననే యీ శ్లోకము 'మూర్ధ్ని త్వాం వాసయేయం వై' అని ప్రారంభమైనది. తన కాసందర్భములో నట్టి శంక గల్గుట యొకలోపమే యని సుధేష్ణ పలికినదని యీశ్లోకాభిప్రాయ మగుచున్నది. నిందు మనమున విరాటుడు సైరంధ్రిని జేపట్టునేమో యని సుధేష్ణ సంశయము. అది తీర్పరానివేదనయేయగు నైనను సైరంధ్రి నింటనుంచుకొనవలయునను నభిలాష సుధేష్ణకు మిక్కుట ముగా నేర్పడియున్నదనియు నీశ్లోకాభిప్రాయ మగుచున్నది. సంశయనివృత్త్యర్థ మామె యిట్లు పలుకువ దగుచున్నది. అంతియకాని సైరంధ్రిని, విరాటుని శంకించికాని, అట్టి పరి స్థితి తటస్థించునని కాని యామె యభిప్రాయము కాదు. సైరంధ్రిని జూచినచో మాత్రము రాజామెకు సర్వచేతస్కుడై వశ్యమగునా యనునంతటి యమానుష సౌందర్యముగా

నా సైరంధ్రి యున్నదని యభిప్రాయము. సుధేష్ణ యీభావ
ముతోనే యుత్తరప్రసంగ మిట్లు గావించినది.

స్త్రియో రాజకులే యాశ్చ యాశ్చేమా మమ వేశ్మని,
ప్రసక్తా స్త్వాం నిరీక్షంతే పుమాంసం కం న మోహయేః
వృక్షాం శ్చావస్థితాన్ పశ్య య ఇమే మమ వేశ్మని
తేఽపి త్వాం సన్నమంతీవ పుమాంసం కం న మోహయేః.
రాజా విరాట స్సుశ్రోణి దృష్ట్వా వపు రమానుషమ్,
విహాయ మాం వరారోహే గచ్ఛే త్సర్వేణ చేతసా. ౨౬
యం హి త్వ మనవద్యాంగి తరళాయతలోచనే
ప్రసక్త మభివీక్షేధా స్స కామవశగో భవేత్. ౨౭
యశ్చ త్వాం సతతం పశ్యేత్ పురుష శ్చారు హాసిని!
ఏవం సర్వానవద్యాంగి! స చానంగవశో భవేత్॥ ౨౮

(రాజకులమందున్న యీస్త్రీలు ప్రసక్తలై నిన్ను
నిరీక్షించుచున్నారు. ఏపురుషుని నీవు మోహింపజేయవు!
నాయింటనున్న యీవృక్షములు నీదరి చేరునవివలె నున్నవి,
ఏపురుషుని నీవు మోహింపజేయవు? రాజు అమానుషమగు
నీచాయను జూచి నన్నువిడిచి నిండుమనమున నిన్ను జేరును.
అనవద్యాంగి! తరళాయతలోచన! ప్రసక్తమై యెవని నభివీ
క్షించెదవో వాడు కామవశుడగును. ఏపురుషుడు నిన్ను
సతతముచూచునో, చారుహాసిని! సర్వానవంద్యాగి! వాడ
నంగ వశుండగును.)

అమానుషసౌందర్యరాశియగు సైరంధ్రి నింట జేర్చుట
యందు దటస్థింపదగు సంశయమును సుధేష్ణ యీమాట

లందు వివరించినది. సైరంధ్రి యొకమాఱు పురుషునిచూచిన యాపురుషుడు కామవశుడు కాగలడని పలుకుచు సుధేష్ణ పిమ్మట పురుషు డామెను సంతతము దిలకించుటయందు దటస్థించు విషయమును సూచించినది. 'అనవద్యాంగి, తర శాయతలోచనే' అని మొదట పలికిన సుధేష్ణ యాపిమ్మట 'చారుహాసిని, సర్వానవద్యాంగి' అని సైరంధ్రినిగూర్చి పేర్కొనినది. ఈసంబోధన లాయా శ్లోకభావములకు నొప్పి యున్నవి. ఆయనవద్యాంగి, యాతరళాయతలోచన వీక్షించుట యనునది మొదటి విషయము. ఆచారుహాసినిని, యా సర్వానవద్యాంగిని పురుషుడు సతతము చూచుట యనునది పిమ్మటి విషయము. మొదటివిషయమే చిక్కైనది, యింక తరువాయివిషయము మఱియు చిక్కైనదని యభిప్రాయము. అట్టిదాని నింట నుంచుకొనుట తన యునికికే ముప్పుగల్గింప వచ్చు,నింకను మృత్యుకారణముకూడ కావచ్చును. సుధేష్ణ యిట్లు పలుకుటచూచి ద్రౌపది యిట్లు పలికినది.

నాస్మి లభ్యా విరాటేన న చాన్యేన కదాచన,
గంధర్వాః పతయో మహ్యం యువానఃపంచభామిని. 31.
పుత్రా గంధర్వరాజస్య మహాసత్వస్య కస్యచిత్,
రక్షంతి తే చ మాం నిత్యం దుఃఖాచారా తథాహ్యహమ్.
యో మే న దద్యా దుచ్ఛిష్టం నచ పాదౌ ప్రధావయేత్.
ప్రీయేరం స్తేన వాసేన గంధర్వాః పతయో మమ. 33
యో హి మాం పురుషో గృధ్యేద్యథాన్యాః ప్రాకృ
తాః స్త్రియః,

కామేవ నివసే ద్యాత్రిం ప్రవిశ్య చ పరాంతనుమ్. 38
నచాప్యహం చాలయితుం శక్యా కేనచి దంగనే 39
దుఃఖశీలా హి గంధర్వా స్తేచ మే బలవత్ప్రియాః,
ప్రచ్ఛన్నాశ్చాపి రక్షంతి తే మాం నిత్యం శుచిస్మితే.

(నేను విరాటునిచేతగాని, యన్యునిచేతగాని లభ్య మగుదానగాను. మహాసత్త్వుడైన యొకగంధర్వరాజపుత్రులు, యువకులు, గంధర్వు లయిదుగురు పతులు నిత్యము నన్ను రక్షించువా రయినను దుఃఖాచారు యగుచున్నాను. అట్టి దానను నేనని తెలియుము. ఎవరు నాకుచ్ఛిష్టము నీయరో, కాళ్ళు కడుగమనరో వారియొద్ద నుండుటవలన నాగంధర్వ పతులు ప్రీతినొందెదరు. ఎవడు నన్ను ఇతరసాధారణస్త్రీల వలె కామించునో యారాత్రియే వాడు పరంతనువు నొందువాడు కాగలడు.)

సైరంధ్రి నెట్లయిన ఇంట నుంచుకొనుట కుబలాట మొందియున్న సుధేష్ణ లోనిభావమును గ్రహించి ద్రౌపది మేల్మిమాట నిటుల జలికినది. తాను విరాటుని చేతగాని, యన్యునిచేతగాని, లభ్యమగుదాన గానని ద్రౌపది పలికి నది. విరాటుడు నన్ను వశ్యము చేసుకొనలేడని పలుకు టలో విరాటునందు దోషము స్ఫురించును. పరమసమ్మతు రాలగు సుధేష్ణతో పరమోత్కృష్టురాలగు ద్రౌపది యిట్లు పలుకదు. అందుచేత నామాట విరాటునిపైకి పోనీయక తన యందు మాత్రమే వర్తించునట్లు 'నాస్మిలభ్యా' (నేను లభ్యమగుదాన గాను) అని పలికినది. విరాటవిషయకమగు

మాట యిట్లుపలికి వెంటనే 'నచాన్యేన కదాచన' (అన్యునిచేతగూడ నెట్లును లభ్యమగుదాన గాను) అని ద్రౌపది పలుకుట బహుగంభీరముగాను, నుత్తరకథాసూచకముగాను నేర్పడినది. పెద్దబలవంతుడు. బలగముగలవాడగు కీచకుని విషయ మిందు ప్రతిఫలించుచున్నది. 'కదాచన' అనుపదము కీచకోపకీచకుల సంరంభమునంతయు ధ్వనింపజేయుచున్నది. ఈభావిపరిస్థితికనువర్తించునట్టిమాటయే దైవికముగా-నీసందర్భముగా- సాభిప్రాయముగా ద్రౌపదినోట వెలువడినది. సుధేష్ణనోట గూడ సాభిప్రాయమగుమాట లిట్టి సందర్భములో పలుకబడినవి.

అధ్యారోహే ద్యథా వృక్షాన్ వధాయై వాత్మనో నరః,
రాజవేశ్మని తే సుభ్రు రోహితం స్యాత్తథా మమ. ౨౭
యథాచ కర్కటీ గర్భ మాదత్తే మృత్యు మాత్మనః,
తథావిధ మహం మన్యే వాసం తవ శుచిస్మితే. ౩౦

ఆత్మవధార్థముగా వృక్షారోహణ మొనరించునట్లు కర్కటీగర్భమట్లు సైరంధ్రిని రాజగృహమును జేర్చుట మృత్యుకారణము కాగలదని సుధేష్ణనోట విచిత్రముగా మాటవచ్చినది. గంధర్వరాజపుత్రులయిదుగురు యువకులు నన్ను నిత్యము రక్షించుచుందురని పలుకుచు 'దుఃఖాచారాతథాప్యహం' అని ద్రౌపది చిత్రమగుమాట వచించినది. ఈ మాటలసందర్భమెంతటి భావమునో కల్గించుచున్నది. ఉచ్ఛిష్టమును బెట్టక, పాదములు కడుగమనకుండ

చూచువారి యుండనుండుట కా గంధర్వపతులు ప్రీతులగుదు రని ద్రౌపది గంభీరముగా బేర్కొనినది. నే నుచ్ఛిష్టము గుడువను, కాళ్లు పట్టను అని వచించుట యోగ్యమగు పలుకు గా నేరదు. ద్రౌపది తనయందు తనపతులయం దున్న యుదారపరిస్థితినిట్లు వివరించి విచిత్రముగా దన్నల్ప విషయ ముగా గాంచిన తటస్థించు భయస్థితిని మఱియుగంభీరముగా బేర్కొనినది. 'ఇతరప్రాకృత స్త్రీలట్లు నన్నిచ్ఛయించిన పురుషు డారాత్రికాలమందు పరంతనువు నొందువాడగును' అని యామె పలికినది. ఇందు 'పురుషః, యథాన్యాః ప్రాకృతాః స్త్రియః' అను మాటలు చాలాజాగ్రత్తగా ప్రయోగింపబడినవి. తనయందల్పబుద్ధి నొందువాడింక నాతనువునందుండజాలడు, వేఱు తనువునొందువాడగు ననుచు గంధర్వుల ఘనరక్షను సమర్థముగా ద్రౌపది పలికినది. మఱియు నసవస్థితి కాదంచు మఱియు గంభీరముగా 'న చా ప్యహం చాలయితుం శక్యా కేనచిదంగనే' (ఎవ్వారిచేతను గూడ చలింపజేయ శక్యమగుదానగాను) అని పలికినది. గంధర్వుల గంభీరహృదయ విశేషమునే ప్రసంగించుచు ద్రౌపది వారిని గూర్చి 'దుఃఖశీలాహిగంధర్వాస్తేచ మే బలవత్ప్రియాః' అని పలికినది. బలవంతులు ప్రియులు అను మాటకు పటిష్ఠముగా 'బలవత్ప్రియాః' అని వచించినది. అట్టివారు తనన్ననునిత్యము రక్షించువారంచు (ప్రచ్ఛన్నా శ్చాపి రక్షంతి తే మాం నిత్యం శుచి.స్మితే)పలికినది. రాత్రి కాలమందు రహస్యవిధిని గంధర్వపతులు తన్ను గాపాడు

వారేయని స్పష్టముగా పలికినది. 'సుచిస్మితే' అను చివరను న్న సంబోధనము ప్రసంగమునకు సాధు పరిస్థితిని సాధించుచున్నది.

ఏవం త్వాం వాసయిష్యామి యథాత్వం నందనీచ్ఛసి.
న చ పాదౌ న చోచ్ఛిష్టం ప్రక్ష్యసి త్వం కథంచన ౩౭

(నీ విచ్ఛయించినట్లే నిన్నుండనిచ్చెదను, పాదములు కడుగమనను, ఉచ్ఛిష్టమును బెట్టను. అని సుధేష్ణపలికెను.)

ద్రౌపదిమాటయందు 'కదాచన' అనియు, సుధేష్ణ మాటయందు కథంచన, అనియు పదములుండుట గమనింప దగినది. 'వాసయిష్యామి, నందిని' అనుమాట లిక్కడ సుధేష్ణపట్ల,నుచితముగా నున్నవి. ఇట్లుగా విరాటుని భార్యచే నోదార్పబడి పతిధర్మవతియగు ద్రౌపదీసతి విరాటనగర మందు వసించెను. ఆమె విషయమై నిజ మెవ్వారును నెఱుంగలేనివారైరి.

## సహదేవుని ప్రవేశము

సహదేవోఽపి గోపానాం కృత్వా వేష మనుత్తమమ్,
భాషాం చైషాం సమాస్థాయ విరాటం సముపాయయౌ.
గోష్ఠమాసాద్య తిష్ఠంతం భవనస్య సమీపతః
రాజాఽథదృష్ట్వా పురుషాన్ ప్రాహిణోజ్జాతవిస్మయః ౨

(సహదేవుడు గోపవేషము ధరించి వారివలెనే మాట్లాడుచు భవన సమీపములోనున్న గోష్ఠాగారమునందుండగా విరాటుడుచూచి విస్మయమొంది మనుజులను బంపి యాతనిని

బిలిపించెను. తంత్రిపాలుడను పేరుతో సహదేవుడు గోసంఖ్యాతగా విరాటుని కొలువును ప్రవేశించెను.

## అర్జునుని ప్రవేశము

బహూంశ్చదీర్ఘాన్ పరివికీర్య మూర్ధజా
న్మహాభుజో వారణతుల్య విక్రమః,
గతేన భూమిం పరికంపయం స్తదా
విరాటమాసాద్య సభాసమీపతః ౧౧-౨

తం ప్రేక్ష్య రాజోపగతం సభాతలే
వ్యాజాత్ పరిచ్ఛన్న మరిప్రమాథినమ్,
విరాజమానం పరమేణ వర్చసా
సుతం మహేంద్రస్య గజేంద్రవిక్రమమ్. 3

సర్వా నపృచ్ఛచ్చ సభానుచారిణః
కుతోఽయ మాయాతి పురా న మే శ్రుతః,
న చైన మూచు ర్విదితం తదా నరా
స్సవిస్మయం వాక్య మిదం నృపోఽబ్రవీత్ . ४

నిండయినవి, దీర్ఘమైనవియగు మూర్ధజములనామహాభుజుడు, వారణతుల్యవిక్రము డర్జునుడు విరియవిడిచి గమనమున భూమిని గంపింపజేయుచు సభాసమీపమందు విరాటుని సంధించెను. పరమవర్చోవిరాజమానుడు, గజేంద్ర విక్రము డరిప్రమాథియగు మహేంద్రసుతు డిట్లు వ్యాజమున బరిచ్ఛన్నవేషుడై సభాతలమును జేరగా

విరాటుడు సభానుచారులనెల్లర నాతని గూర్చి ప్రశ్నించెను. వారు మాఱుపలుకకుండుట చూచి విరాటుడు విస్మయుడగుచు నిట్లనెను. 'చక్కగా నలంకరించుకొని నీవు నాకుమారునట్లుండగలవు, నాకు సాటివాడవగుదువు. నేను వృద్ధుడనైతి, నీమత్స్యదేశమును నీవే పాలింపుము. నీవంటివారు క్లీబరూపులెట్లును గాజాలరని నాతలంపు' అని విరాటుడు పలుకగా నర్జునుడిట్లు బదులుపలికెను.

గాయామి నృత్యామ్యథ వాదయామి
భద్రోఽస్మి నృత్యే కుశలోఽస్మి గీతే,
త్వముత్తరాయై పరిదత్స్వ మాం స్వయం
భవామి దేవ్యా నరదేవ నర్తకః. ౮

ఇదం తు రూపం మమ యేన కిం తవ
ప్రకీర్తయిత్వా భృశశోకవర్ధనమ్,
బృహన్నలాం మాం నరదేవ విద్ధి
సుతం సుతాం వా పితృమాతృవర్జితామ్. ౯

బృహన్నలాం తామభివీక్ష్య మత్స్యరాట్
కలాసు నృత్యేషు తథైవ వాదితే,
సంమంత్ర్య రాజా వివిధైః స్వమంత్రిభిః
పరీక్ష్య చైనం ప్రమదాభి రాశు వై. ౧౦

అపుంస్త్వ మప్యస్య నిశమ్య చ స్థిరం
తతః కుమారీపుర ముత్ససర్జ తామ్ ౧౧

(నేను గానముచేయుదును, నృత్యమొనర్తును, వాయింపగలను. నాకు నృత్యగీతములందు కుశలత్వము గలదు. ఉత్తర కాటపాటలకు నేర్పెదను. నరదేవ! నేను నర్తకుడుగా నీయొద్దనుందును. ఈ నారూపమును గూర్చి నీకు దెల్పి యేమి ప్రయోజనము గలదు. ఈతనువు భృశ శోక వర్ధనమైనది. నన్ను బృహన్నలయని తెలియుము. పితృమాతృవర్జితమైన కొడుకో, కూతురో యని తెలియుము. ఇట్లని యర్జునుడు పలికెను. విరాటు డాతని గీతాదికుశలత్వ మును బరీక్షించి, మంత్రులతో సంప్రదించి, ప్రమదలచే బరీక్షచేయించి, యతని నపుంసకత్వమును దృఢముగా నెఱింగి యాపిమ్మట యాబృహన్నల నుత్తరయొద్దకుబంపెను.

సహదేవుడు గోపవేషమున జక్కగా నమరియున్నాడు. వారినలెనే మాటలుగూడ నలవరించికొనినాడు అర్జునుడు పరీక్షకాగిన నపుంసకు డయినాడు. కాగా నలుగురే మగ వారప్పుడు విరాటుని కొలువునుగూర్చి వచ్చినవా రగు చున్నారు. మఱియు నానలుగురిలో నొకడు గోపకుడుగా గానవచ్చుచున్నాడు. అజ్ఞాతవాసమున బాండవులు తల దాచుకొనుట కివి యమోఘహేతువ్రలుగా బరిణమించినవి. వారి నెవరు ననుమానించుటకు రాని విశేష ముందువలన దృఢమైనది. అర్జునుడు తృతీయప్రకృతి నాశ్రయించిన పలుకు 'సుతం సుతాం వా పితృమాతృ వర్జితాం' అని పలు కుట చిత్రముగా నున్నది.

6

## నకులుని ప్రవేశము.

అథాపరోఽదృశ్యత పాండవః ప్రభు
ర్విరాటరాజం తరసా సమేయివాన్,
తమాపతంతం దదృశే పృథగ్జనో
విముక్తమభ్రాదివ సూర్యమండలమ్. ౧౨-౧
స వై హయానైక్షత తాంస్తతస్తత
స్సమీక్షమాణం స దదర్శ మత్స్యరాట్,
తతోఽబ్రవీత్తాననుగాన్నరేశ్వరః
కుతోఽయమాయాతి నరోఽమరప్రభః. ౨
అయం హయానీక్షతి మామకాన్ దృఢం
ధ్రువం హయజ్ఞో భవితా విచక్షణః,
ప్రవేశ్యతామేష సమీపమాశు మే
విభాతి వీరో హి యథామరస్తథా. 3

(నకులుడు విరాటుని సమీపించెను. పృథగ్జను లాతని నభ్రవిముక్త సూర్యమండలమట్లు తిలకించిరి. గుఱ్ఱములను జూచుచుండిన నకులుని విరాటుడు గనుంగొని యనుచరులతో 'అమరప్రభుం డీతం డెవ్వడో, నాగుఱ్ఱముల నీక్షించుచున్నవాడు. నిశ్చయ ముతండు విచక్షణుండగు హయజ్ఞుండు గావలయును. అమరునట్లున్న యీతనిని వేగ నా సమీపమునకు గొనితెండు' అని పలికెను. అశ్వబంధుడుగా నకులుడు విరాటు కొలువుకూటమ్మం దుండెను. విరాట్పురాజ్ఞు

గుఱ్ఱములను, గుఱ్ఱపువాండ్రను, సారథుల నాతని యధీనమం దుంచెను.)

ఏవం హి మత్స్యే న్యవసంత పాండవా
యథా ప్రతిజ్ఞాభి రమోఘ దర్శనాః,
అజ్ఞాతచర్యాం వ్యచరన్ సమాహితా
స్సముద్రనేమీ పతయోఽతి దుఃఖితాః. ౧౩

(ఇవ్విధంబున నాపంచపాండవు లమోఘదర్శనులు, సముద్రనేమీపతులునై నవా రతిదుఃఖితులగుచు సమాహితులై యజ్ఞాతచర్య మత్స్యనగరమందు గావించుచుండిరి.)

ఈశ్లోకమందు 'అజ్ఞాతచర్యాం' అనుమాటకు పిమ్మట 'సమాహితాః' అని యుండుటయు, 'సముద్రనేమీపతయః' అనుమాటతో జేరి 'అతిదుఃఖితాః' అని యుండుటయు భావయుక్తముగానున్నది. పాండవులు సమాహితులై యజ్ఞాత వాసము గావించుచుండిరనియు, నాజగత్సార్వభౌములత్యంతము దుఃఖితులగుచుండిరనియు నిందువలన వ్యక్తమగుచున్నది. పాండవుల యజ్ఞాతవాసదీక్ష నిది వ్యక్తీకరించుచున్నది. మఱియు వారపుడెంతటి విషమావస్థకు పాలగుచుండిరది వ్యక్తీకరించుచున్నది.

## సమయపాలనము

తృణబిందుప్రసాదాచ్చ ధర్మస్యచ మహాత్మనః,
అజ్ఞాతవాసమేవం తు విరాటనగరేఽవసన్. ౧౩-౩

యుధిష్ఠిరస్సభాస్తారో మత్స్యానా మభవ త్ప్రియః,
తథైవ చ విరాటస్య సపుత్రస్య విశాంపతేః. ౪
స చాక్షహృదయజ్ఞ స్తం క్రీడయామాస పాండవః,
అక్షవత్యాం యథాకామం సూత్రబద్ధానివ ద్విజాన్. ౫
అజ్ఞాతం చ విరాటస్య విజిత్య వసు ధర్మరాట్,
భ్రాతృభ్యః పురుషవ్యాఘ్రో యథార్హం సంప్రయచ్ఛతి.
భీమసేనోపి మాంసాని భక్ష్యాణి వివిధాని చ,
అతిసృష్టాని మత్స్యేన విక్రీణీతే యుధిష్ఠిరే. ౭
వాసాంసి పరిజీర్ణాని లబ్ధా న్యంతఃపురేఽర్జునః,
విక్రీణానశ్చ సర్వేభ్యః పాండవేభ్యః ప్రయచ్ఛతి. ౮
సహదేవోపి గోపానాం వేషమాస్థాయ పాండవః
దధిక్షీరం ఘృతం చైవ పాండవేభ్యః ప్రయచ్ఛతి ౯
నకులోఽపి ధనం లబ్ధ్వా కృతే కర్మాణి వాజినాం,
తుష్టే తస్మిన్నరపతౌ పాండవేభ్యః ప్రయచ్ఛతి. ౧౦
కృష్ణాతు సర్వాన్ భ్రాతౄం స్తాన్నిరీక్షంతీ తపస్వినీ,
యథాపున రవిజ్ఞాతా తథా చరతి భామినీ. ౧౧

(తృణబిందుమహాముని యనుగ్రహంబునను, ధర్మదేవతావరంబునను పాండవులిట్లుగా విరాటనగరమందజ్ఞాతవాసము గావించుచుండిరి. యుధిష్ఠిరుడు సభాస్తారుడుగనుండి మాత్స్యులకు ప్రీతిపాత్రుడై యుండెను. సపుత్రుడగు విరాటునకు నట్లే ప్రీతిపాత్రుడై యుండెను. సూత్రబద్ధద్విజములట్లుగా నక్షహృదయజ్ఞుడై యుధిష్ఠిరుడందఱను లోబఱచు

కొనుచు సంపాదించిన ధనమును,రహస్యముగా దమ్ములకొసం గుచుండెను. భీమసేనుండును విరాటునిచే నతిగా వండింప జేయబడిన వివిధములగు మాంసాహారములను, భక్ష్యము లను నమ్మిన నెపముగా యుధిష్ఠిరున కొసంగుచుండెను. అర్జునుడంతఃపురమున లభించిన పరిజీర్ణమైన వస్త్రముల నమ్మిన నెపమున బాండవులకొసంగు చుండెను. సహదేవుండును గోపవేషమునుబొంది పెరుగు పాలు ఘృతము పాండవుల కొసంగుచుండెను. నకులుడును వాజికర్మయందు విరాటుడు సంతసించి యొసంగిన ధనమును పాండవులకొసంగు,చుండెను. తపస్వినియగు ద్రౌపది యాయన్నదమ్ముల నందఱను నిరీ క్షించుచు నేరికిని దెలియరాకుండ వర్తించుచుండెను.)

ఇచ్చట పాండవులను గూర్చి చెప్పబడిన వరుసను గుర్తింప .వలసి యున్నది. పాండవులేవరుసలో విరాటునకు గానవచ్చినది కొలువునొందినది యిది తెల్పుచున్నది. సభలో ధర్మజుడు, సభనుచాలించి వచ్చిన సమయములో భీముడు, సభాసమీపములో (సభాతల సమీప ప్రాంతమందు) నర్జునుడు, భవనసమీపమందున్న గోశాలలో సహదేవుడు, నశ్వశాలలో నకులుడు విరాటునకు గానవచ్చిరని యిందు వలన దెల్లమగుచున్నది. పాండవులయిదుగు రొకేమాటు విరాటనగరమును బ్రవేశించి యాయా స్థలములందు నిలిచి యుండిరనియు, విరాటుడే సభను జాలించి క్రమముగా నాయా ప్రదేశములకు వచ్చి భీమాదులను జూచెననియు నభి

ప్రాయము. ఒక పాండవు డున్నచోట నింకొకపాండవు డుండ లేదని యభిప్రాయము. ఇందెంతయేని యుచితత్వ మున్నది. భవనమునకుదూరముగా నశ్వశాల యున్నందున నందలికంటె సొంతముగ నకులుడు విరాటునకు గానవచ్చినాడని యభిప్రాయము. తక్కిన పాండవులను విరాటుడే చూచి నట్లుండుటయు నకులుని పృథగ్జనులుముందు, పిమ్మట విరాటుడు చూచి నట్లుండుటయు, నిందులకొక నిదర్శనమైయున్నది. ద్రౌపదీ భీము లుభయులును తుల్యకాలమున విరాటునికొలువును జేరి నారని తెలియవలయును. ద్రౌపదీభీములను గూర్చి సుదేష్ణ 'అస్మిన్ రాజకులే చోభౌ తుల్యకాల నివాసినౌ'(౧౯-౧౧) అని పలికినమాట లీలగా నిందుకొకని దర్శనమైయున్నది.

విరాటుడు సభనుదీర్చియుండగా నానిండుసభకు ధర్మ జుడు వచ్చెను. అపుడాతని గూర్చి విరాటుడు మంత్రిలు మున్నగు వారలతో వితర్కించుచుండగా ధర్మజుడు విరాటునిసమీపించి ప్రసంగించి యాతనియాశ్రయము నొందెను. భీమప్రవేశమున విరాటుడు భీమునిగూర్చి జానపదులను ప్రశ్నించెను. ఆతని నెఱింగి రంచనుచు మనుజులను విరాటుడు భీమునియొద్దకు బంపెను. భీముడు విరాటుని సమీపించి తన విషయ మెఱిగించి యాతని యాశ్రయమొందెను. సభాతల మందు డా సభాసమీపస్థులమందర్జునుడు విరాటునకు గనబడెను. విరాటుడు సభానుచారులనందఱ నాతని గూర్చి ప్రశ్నించెను. వారేమియు బలుకలేదు. అపుడు విరాటుడు విస్మయమొంది

యుండగా నర్జునుడు తన విషయమాతని కెఱిగించి యాతని యాశ్రయ మొందెను. అర్జునుని పరీక్షింప వలసి వచ్చినందున విరాటుడు తన మంత్రులతో నాలోచించి ప్రమదలచే నాతని బరీక్షింపజేసి యపుంస్త్వమును నిశ్చయించి యాపిమ్మట నాతనికాశ్రయ మొసంగెను. సభనుజాలించి వచ్చుచున్న విరాటుని మంత్రులనుసరించి వచ్చుచున్నారని యిచట గ్రహింపవచ్చును. విరాటు డర్జునుని యొద్ద కెవ్వరిని బంపలేదు. ఆతనిగాంచి విస్మయగోచరుడై యుండెను. అర్జునునే తీవ్రగా బ్రశంసించుచు విరాటుడు పలుకరించెను. గోపవేషమును, వారి భాషను (యాసభాషను) నలవరించికొని రాజభవన సమీపమున గోష్ఠాగారమున గాన వచ్చిన సహదేవుని యొద్దకు విరాటుడుమనుజులను బంపెను. సహదేవుడు తన విషయము విరాటున కెఱిగించి యాతని యాశ్రయమొందెను పిమ్మట విరాటుడశ్వశాల కేతెంచెను. అపుడు నకులుని ముందుగా బృథగ్జనులు గాంచిరి. పిమ్మట విరాటుడు గాంచెను. వెంటనున్నవారిని (అనుగులను) విరాటుడు నకులునిగూర్చి యడిగి తనయొద్దకు బ్రవేశపెట్టుమని చెప్పెను. నకులుడు జయశబ్ద పూర్వకముగా విరాటునితోడ సంభాషించి యాతని యాశ్రయ మొందెను. విరాటుడు పాండవులయిదుగురను సముద్రనేమీపతులుగా బలుకరించి వారి కాశ్రయమొసంగెను. ధర్మజ భీముల నింద్రసములుగా బ్రశంసించి పలికెను. ధర్మజుని కేవల మింద్రుని సాటిగా బ్రశంసించెను. అర్జునుడు తప్ప తక్కిన పాండవులు వాసు

పాండవుల కొలువునుండి విరాటునియొద్దకు వచ్చినట్లు దెల్పి నారు. అర్జునుడు గోహరణసమయమున దాను పాండవసారథి నని ప్రకటించినాడు గాని విరాటనగరప్రవేశ సందర్భమున దన పూర్వపు నునికిని గూర్చి యేమియు బలుకలేదు.

ధార్తరాష్ట్రశంకగల్గి పాండవులొకరినొకరు గనిపెట్టి తిరుగుచు, ద్రౌపదిని గనిబెట్టుచు గర్భధృతులట్లు మత్స్య నగరమందజ్ఞాత చర్య గావించుచుండిరి. పాండవులిట్లు ప్రవర్తించుచుండగా నాల్గవ నెలయందు విరాటనగరమున గొప్ప బ్రహ్మోత్సవము జరిగెను. దానికి పలుతావులనుండి మల్లులనేకులు వచ్చి రంగస్థలము నలంకరించిరి. అందు బ్రఖ్యాత విక్రముడగు జీమూతుడనువాడు మల్లుల నెల్లర సవాలుచేయుచుండగా నందఱు మల్లులు హతచేతస్కులై విమనస్కులైరి. అది చూచి విరాటుడు సూదునితో నామల్లునకు బోట్లాట పెట్టించెను. ఆ మల్లయుద్ధమందు భీముడా మల్లుని లాగిపట్టి పైకెత్తి గిరవాటు వేయుటను గాంచి మల్లులు, మాత్స్యులు పరము విస్మయమొందిరి. భీముడప్పుడా జీమూతుని నూఱుమాఱులు త్రిప్పి గతసత్త్వుడు నచేతనుడైన వానిని నేల బడవైచి నుగ్గుగావించెను. ఆయద్భుతమును దిలకించి విరాటుడు బంధుయుక్తుడై పరమ విస్మయమొంది భీమునకు గొప్ప పారితోషిక మొసంగెను. ఇట్లుగా బలువురు మల్లులను, బలశాలురను భీముడు నొంచుచు మల్లయుద్ధనైపుణ్యమును బ్రకటించుచు విరాటునకు

ప్రీతిని గల్గించుచుండెను. ఆతని కింక సాటియగు బలశాలి లేనందున విరాటుడు వ్యాఘ్రములు, సింహములు, కుంజరములతో భీమునకు పోట్లాట పెట్టించుచు వినోదించుచుండెను. (౧౩-౪౧) ఈ సంఘటన మంతఃపుర కాంతల వినోదమున కేర్పడి క్రమముగా నది కీచకమృతికి దారితీయునదిగా నైనది.

పున రంతఃపురగతః స్త్రీణాం మధ్యే వృకోదరః,
యోధ్యతే స విరాటేన సింహైర్మత్తైర్మహాబలైః. ౧౩-౪౨
బీభత్సురపి గీతేన స్వనృత్యేన చ పాండవః,
విరాటం తోషయామాస సర్వాశ్చాంతఃపురస్త్రియః.
అశ్వైర్వినీతైర్జవనై స్తత్ర తత్ర సమాగతైః,
తోషయామాస రాజానం నకులో నృపసత్తమమ్. ౪౪
తస్మై ప్రదేయం ప్రాయచ్ఛత్ ప్రీతో రాజా ధనం బహు,
వినీతాన్ వృషభాన్ దృష్ట్వా సహదేవస్య చాభిభో,
ధనం దదౌ బహువిధం విరాటః పురుషర్షభః ౪౬
ద్రౌపదీ ప్రేక్ష్య తాన్ సర్వాన్ క్లిశ్యమానా న్మహారథాన్
నాతిప్రీతమనా రాజ న్నిశ్వాసపరమాఽభవత్. ౪౭

(విరాటుని నంతఃపుర స్త్రీలయొక్క వినోదము కొఱకు వృకోదరుడు మత్తమహాసింహములతో పోట్లాడుచుండెను. గీతమున, స్వనృత్యమున బీభత్సుడు విరాటుని నంతఃపురస్త్రీలను సంతోషింపజేయుచుండెను. అక్కడక్కడ నుండి తెచ్చిన గుఱ్ఱములను మచ్చికపఱచుకొనుచు నకులుడు

విరాటునకు సంతోషము గల్గించుచుండెను. దానికి (బీతుడై విరాటుడు నకులునకు బహుధన మొసగుచుండెను. సహదేవుని యెదుట నిశితమై యొప్పియున్న, వృషభములను జూచి విరాటుడు గొప్ప ధన మాతని కొసంగుచుండెను. క్లిశ్యమానులగు చుండిన మహారథుల బాండవులను జూచుచు ద్రౌపది నాతిప్రీతమనస్కురాలై, నిశ్వాస పరమురాలై యుండెను.)

సమయపాలన పర్వమందలి యీ ౧౩ అధ్యాయ మాద్యంతములందు పాండవుల క్రమము (వరుస) గమనింప దగినది. పాండవులొకరినొక రెట్లు కనిపెట్టుకొనుచు వర్తించు చున్నారో యది మొదటి వరుసయందు గలదు. పాండవులు విరాటునెట్లనువర్తించి మెలంగుచుండినది రెండవ వరుస యందు గలదు. ఆయన్నదమ్ములను జూచుచు ద్రౌపది యజ్ఞాతయై సంచరించుచున్నదని మొదటి వరుసలోను, నా మహారథులు క్లేశమొందు చుండుటను జూచుచు ద్రౌపది నాతిప్రీతమనస్కురాలై నిశ్వాసపరమురాలై యున్నదని రెండవ వరుసలోను దెల్పబడినది. అజ్ఞాతవాస మొనర్చుటే ద్రౌపదికి కష్టమైనది. సుఖార్హులగు మహారథులాభర్తలు క్లేశముల ననుభవించుచుండుటను గాంచినందున నామెదుఃఖ మపార మైనది. అయినను పాపము దాసిగా నన్నివేళలందు మెలకువతో దాస్యము చేయవలసి వచ్చుచున్నది, ఆయుత్తమ గృహిణికి, పృథ్వీరాజ్ఞికి, పాండవ పట్టమహిషికి గొప్పకష్టమే తటస్థించినది. కీచక సంరంభము దుర్భరమైనది.

ఏవం తే న్యవసం స్తత్ర ప్రచ్ఛన్నాః పురుషర్షభాః,
కర్మాణి తస్య కుర్వాణా విరాటనృపతే స్తదా. ౪౮

ఇట్లుగా విరాటునకు బనులు గావించుచు పాండవులు ప్రచ్ఛన్నులై విరాటనగరమున నుండిరి.

—0—

# కీచకవధ

వసమానేషు పార్థేషు మత్స్యస్య నగరే తదా,
మహారథేషు ఛన్నేషు మాసా దశ సమాయయుః ౧౪-౧

మహారథులగు పాండవులు మాఱువేషంబుల విరాట నగరంబున నజ్ఞాత వాసము గావించుచుండగా బదినెలలు గడచెను. పరిచారార్హురాలగు ద్రౌపది సుధేష్ణయింటిలో నామెను, నంతఃపురస్త్రీలను సంతోషింపజేయుచు నీకాలమును గడపెను. అజ్ఞాతవాసవత్సరము గడచిపోవు నాసమయమున విరాటునిసేనాపతియగు గీచకుడు ద్రౌపదిని జూచెను.

తాం దృష్ట్వా దేవగర్భాభాం చరంతీం దేవతా మివ,
కీచకః కామయామాస కామబాణప్రపీడితః ౫

సతు కామాగ్నిసంతప్తః సుధేష్ణా మభిగమ్య వై,
ప్రహసన్నివ సేనానీ రిదం వచన మబ్రవీత్. ౬

నేయం మయా జాతు పురేహ దృష్టా
రాజ్ఞో విరాటస్య నివేశనే శుభా,

రూపేణ చోన్మాదయతీవ మాం భృశం
గంధేన జాతా మదిరేవ భామినీ. ౭

కా దేవరూపా హృదయంగమా శుభా
హ్యాచక్ష్వ మే కస్య కుతో౽త్ర శోభనే
చిత్తంహి నిర్మథ్య కరోతి మాం వశే
న చాన్య దత్రౌషధ మస్తి మే మతమ్. ౮

అహో తవేయం పరిచారికా శుభా
ప్రత్యగ్రరూపా ప్రతిభాతి మా మియం,
అయుక్తరూపంహి కరోతి కర్మ తే
ప్రశాస్తు మాం యచ్చ మమాస్తి కించన. ౯

ప్రభూతనాగాశ్వ రథం సభాజనం
సమృద్ధియుక్తం బహుపానభోజనం,
మనోహరం కాంచనచిత్రభూషణం
గృహం మహ చ్ఛోభయతా మియం మమ. ౧౦

(దేవగర్భాభయగు దేవతవలె సంచరించు నామెను జూచి కీచకుడు కామబాణప్రపీడితుడై కామించెను. వాడు కామాగ్నిసంతప్తుడై సుధేష్ణదరికి వచ్చి ముసిముసినవ్వులు నవ్వుచు నిటులబలికెను. శుభమైన దీని నిదివఱకు విరాటు నింటిలో నేను చూడలేదు. సుగంధయుక్తమైన మద్యమును బోలె రూపముచే నిది నాకెంతయు నున్మాదమును గల్గించు చున్నది. ఈదేవరూపురాలు హృదయంగమముగా నున్నది. శుభమైన దిది యెవరు. శోభనవంతురాలా! యిది యెవని సంబంధము గలది, ఎక్కడి దిది, చెప్పుము. నాచిత్తమును

మథించి నన్ను వశ్యముచేసుకొనుచున్నది. దీని కింకొక్క మందుగలదని నాకు దోచదు. అహో యీనీ పరిచారిక, యీ శోభనాంగి, ప్రత్యగ్రరూపము గల్గినది. అయుక్తరూప మైనట్టి పని చేయుచున్నది. నాసర్వస్వమును నన్నును నిది శాసింపవచ్చును. సకలభోగములు, సకలపానములు, సకల సంపదలతో గూడిన మనోహరమైన నాగృహంబు నిది యలంకరించునుగాక - వెలిగించునుగాక)

అక్కతో దనయభిలాషను దెల్పి కీచకుడు మదిరము, మందు లేకుండుటను- రెండిందు పలికినాడు. సురనిమిత్తము సైరంధ్రి వానిగృహమునకు వచ్చుటయందే కీచకుని చావున్నదని యిందు ధ్వనించుచున్నది. సైరంధ్రిని గాంచినది మొదలు తనయంతఃపురమున కామెను రప్పించుకొనవలెనని పలుప్రయత్నములు వాడు గావించినాడు. అనేకదినము లిట్లు ప్రయత్నించి యది సాధ్యపడనందున నర్తనశాలకువచ్చి వాడు వధనొందినాడు.

తత స్సుధేష్ణా మనుమంత్ర్య కీచక
స్తత స్సమభ్యేత్య నరాధిపాత్మజాం,
ఉవాచ కృష్ణా మభిసాంత్వయం స్తదా
మృగేంద్రకన్యా మివ జంబుకో వనే. ౧౧

కీచకుడు సుధేష్ణతో జెప్పి నరాధిపాత్మజను సమీపించి యామెతో దువ్వుమాటలు పలుకజొచ్చెను. మృగేంద్రకన్యను నక్క సమీపించినట్లు కీచకుడు ద్రౌపదియొద్దకు వచ్చి యిట్లు పలికెను.

కా త్వం కన్యాఽసి కల్యాణి కుతో వా త్వం వరాననే,
ప్రాప్తా విరాటనగరం తత్త్వ మాచక్ష్వ శోభనే. ౧౨
రూప మగ్ర్యం తథా కాంతి స్సౌకుమార్య మనుత్తమం.
కాంత్యా విభాతి వక్త్రం తే శశాంక ఇవ నిర్మలమ్ ౧౩
నేత్రే సువిపులే సుభ్రు పద్మపత్రనిభే శుభే,
వాక్యం తే చారుసర్వాంగి పరపుష్టరుతోపమమ్. ౧౪
ఏవంరూపా మయా నారీ కాచి దన్యా మహీతలే,
న దృష్టపూర్వా సుశ్రోణి యాదృశీ త్వ మనిందితే. ౧౫
లక్ష్మీః పద్మాలయా కాత్వ మథ భూతి స్సుమధ్యమే,
హ్రీః శ్రీః కీర్తి రథో కాంతి రాసాం కా త్వం వరాననే.

(కల్యాణీ! నీ వెవరిదానవు. వరాననా! యెందునుండి విరాటనగరమునకు వచ్చితివి. శోభనాంగీ! నిజము పలుకుము. రూపమతిగా నగ్ర్యమైనది, కాంతియు నట్లేయున్నది, యనుత్తమమైన సౌకుమార్య మున్నది, శశాంకునివలె నిర్మలమై కాంతితో నీమోము వికసించియున్నది. చక్కని గనుబొమలు గలదానా! నీకండ్లు మిక్కిలి విరివినొంది, వికసించిన తామరపూవు రేకులంబోలి యున్నవి. చారుసర్వాంగీ! నీమాట పరపుష్టరుతోపమానమై యున్నది. ఈమహీతలమం దిట్టిరూపముగల స్త్రీని యోసుశ్రోణీ! యనిందితురాలా! నేనిదివఱకుజూడలేదు. పద్మాలయయగు లక్ష్మివో భూతివో, హ్రీ శ్రీ కీర్తి కాంతులలో నొక్కతవో యెవ తైవో వరాననా! పలుకుము.)

'నీపతి యెవడు, నీ వెవరిదానవు' అని స్పష్టముగా కీచకుడు పలుకకుండుటయందు వాని దుష్టహృదయము వ్యక్తమగుచున్నది. ఈచిన్నశ్లోకములో 'కల్యాణి, వరాననే, శోభనే' అను మూడుసంబోధనలున్నవి సైరంధ్రియందు కీచకునకున్న కామబలమును అవి తెల్పుచున్నవి రూపమును కాంతిని, సౌకుమార్యమును ప్రశంసించి మహీతలమందు దిట్టి స్త్రీ లేదని పలుకుచు సైరంధ్రిని దేవతాస్త్రీలలో నొకర్తెగా కీచకుడు పేర్కొనినాడు.

అతీవరూపిణీ కిం త్వ మనంగాంగవిహారిణీ,
అతీవభ్రాజసే సుభ్రు ప్రభే వేందో రనుత్తమా. ౧౭
అపి చేక్షణపక్ష్మాణాం స్మితం జ్యోత్స్నోపమం శుభం,
దివ్యాంశురశ్మిభి ర్వృత్తం దివ్యకాంతిమనోరమమ్. ౧౮
నిరీక్ష్య చంద్రవక్త్రం తే లక్ష్మ్యా నుపమయా యుతం,
కృత్స్నే జగతి కో నేహ కామస్య వశగోఽభవత్. ౧౯
హారాలంకారయోగ్యౌ తే స్తనౌ చోభౌ సుశోభనౌ,
సుజాతౌ సహితౌ లక్ష్మ్యా పీనౌ వృత్తౌ నిరంతరౌ. ౨౦
కుట్మలాంబురుహాకారౌ తవ సుభ్రూ పయోధరౌ,
కామప్రతోదా వివ మాం తుదత శ్చారుహాసిని. ౨౧
వలీవిభంగచతురం స్తనభారవినామితం,
కరాగ్రసంమితం మధ్యం తవేదం తనుమధ్యమే. ౨౨
దృష్ట్వైవ చారుజఘనం సరిత్పులినసన్నిభం,
కామవ్యాధిరసాధ్యో మా మప్యాక్రామతి భామినీ. ౨౩

జజ్వాల చాగ్నిమదనో దావాగ్నిరివ నిర్దయః,
త్వత్సంగమాతిసంకల్పవివృద్ధో మాం దహత్యయమ్.
ఆత్మప్రదానవర్షేణ సంగమాంభోధరేణ చ,
శమయస్వ వరారోహే జ్వలంతం మన్మథాఽనలమ్. ౨౫
మచ్చిత్తోన్మాదనకరా మన్మథస్య శరోత్కరాః,
త్వత్సంగమేన శమితా స్త్రీవా శ్శశినిభాననే. ౨౬
మధ్యం విదార్య హృదయ మిదం నిర్దయవేగితాః,
ప్రవిష్టా హ్యసితాపాంగి ప్రచండా శ్చండదారుణాః. ౨౭
అత్యున్మాదసమారంభాః ప్రీత్యున్మాదకరా మమ,
ఆత్మప్రదానసంభోగై ర్మా ముద్ధర్తు మిహార్హసి. ౨౮
చిత్రమాల్యాంబరధరా సర్వాభరణభూషితా,
కామం ప్రకామం సేవ త్వం మయా సహ విలాసిని. ౨౯
నార్హసీహాఽసుఖం వస్తుం సుఖార్హా సుఖవర్జితా,
ప్రాప్తుం స్వనుత్తమం సౌఖ్యం మత్త స్త్వం మత్త
గామిని. ౩౦

స్వాదూ న్యమృతకల్పాని పేయాని వివిధానిచ,
పిబమానామ నోజ్ఞాని రమమాణా యథాసుఖమ్. ౩౧
భోగోపచారాన్ వివిధాన్ సౌభాగ్యం చాప్యనుత్తమం,
పానం పిబ మహాభాగే భోగై శ్చానుత్తమై శ్సుఖై ః౩౨
ఇదం హి రూపం ప్రథమం నవం వయో
నిరర్థకం కేవల మద్య భామిని,
అధార్యమాణా స్రగివోత్తమా శుభా
న శోభసే సుందరి శోభనా సతీ. ౩౩

త్యజామి దారా న్మమ యే పురాతనా
భవంతు దాస్య స్తవ చారుహాసిని,
అహంచ తే సుందరి దాసవత్ స్థిత
స్సదా భవిష్యే వశగో వరాననే! 38

(అనంగాంగవిహారిణీ! నీ వెవ రతీవరూపము గల్గి యున్నావు, మంచికనుబొమలు గలదానా! చంద్రునందలి మేల్మిప్రభవలెనే మిక్కిలిగా వెలుగొందుచున్నావు. ఇంచుక విరిసిన కనురెప్పలు వెండ్రుకలతోఁగూడిన కేర్గంటిచూడ్కులతో నొప్పియున్నవి. శోభనొందిన పండువెన్నెలవంటి చిరునగవుగలది, దివ్యాంశురశ్మలతో నిండినది, దివ్యకాంతి మనోరమమైనది యగు నీ చంద్రవక్త్రమును సోయగమున ననుపమానమైనదానిని జూచినవా డీజగమంతటిలోన నెవ్వాడు కామవశము నొందకుండ గలడు. సుశోభనములగు నీ స్తనములు హారాలంకారయోగ్యమైనవి, సుజాతములు సహితములు (లక్ష్య) పీనములు, నిరంతరములు, కుట్మలాంబురుహాకారములు నగు నీపయోధరములు సుభ్రూ! చారుహాసినీ! కామప్రదోహములట్లు నన్ను మిగుల వేధించుచున్నవి. వళీత్రిభంగచతురము స్తనభారవినామితము, కరాగ్రసంమితమ్మైన సుమధ్యమా! నీనడు మున్నది. సరిత్పులిన సన్నిభమగు నీ చారుజఘనమును చూడగనే భామినీ! కామవ్యాధిరసము నన్నాక్రమించుచున్నది. దావాగ్నియట్లు నిర్దయయగు నీమదనాగ్నిజ్వాల నన్ను త్వత్సంగమాతిసంకల్ప

వివృద్ధమై దహించుచున్నది. జ్వలించు నీమన్మథాగ్నిని నాత్మప్రదానవర్షమున, సంగమాంభోధరమున శమింప జేయుము. మచ్చిత్తోన్మాదనకరములగు నీ తీవ్రమైన మన్మథ శరోత్కరములు శశినిభాననా! త్వత్సంగమమున శమించును గాక. నిర్దయవేగములై, ప్రచండములు, చండదారుణములు నగు నీమన్మథశరోత్కరములో యసితాపాంగీ! నాహృదయ మధ్యమును విదారమోనరించి ప్రవేశించినవి. ఇవి అత్యు న్మాదసమారంభములు, ప్రీత్యున్మాదకరములు నాకగు చున్నవి. ఆత్మప్రదానసంభోగములచేత నన్నుద్ధరింప దగు దువు. చిత్రమాల్యాంబరములు ధరించుచు, సర్వాభరణ భూషితురాలవై కామప్రకామముగా నాతోడ నో విలాసినీ! యన్నియు సేవింపుము. అసుఖముగ నీ విట్లుండదగవు. సుఖార్హురాలవు, నీవిట్లు సుఖవర్జితముగా నుండదగవు. మత్త గామినీ! నన్నుబొంది నీ వనుత్తమమగు సౌఖ్యము నొంద దగుదువు. స్వాదువులు సమృతకల్పములునగు వివిధములైన పేయములను-మనోజ్ఞమైన యాపేయముల ననుభవించుచు యథాసుఖముగా రమించుదాన వగుము. వివిధభోగోప చారములను, సౌభాగ్యమునొందుము. ఉత్తమశుభభోగము లిట్లుపొంది పానమును సేవింపుము. ఈనీరూప మైననేమి, ప్రథమ-వయావనమైన నేమి, శోభనమైనవయ్యు నధార్య మాణమగు పుష్పకచ్ఛమట్లు భామినీ! సుందరీ! శోభనా! నిరర్థకమే యగుచున్నవి. పురాతనుల్లగు నాభార్యలను త్యజిం

చెదను. చారుహాసినీ! వారు నీకు దాసీజనము కానిమ్ము. నేను సుందరీ! వరాననా! దాసునయ్యి సదా నీవశమం దుండు వాడను.)

కీచకుడు సైరంధ్రిని బ్రశంసించుచు నామెరూపమును, కాంతిని, ఈక్షణ పక్షమును, మందహాసయుక్తమగు వక్త్రమును, పయోధరములను, తనుమధ్యమును, చారుజఘనమును వర్ణించుచు దనయభిలాషను వెల్లడించెను. ఆత్మప్రదానమును, సంగమమును నపేక్షించెను. మఱియు నీ రెంటిని జతచేసి 'ఆత్మప్రదానసంభోగై ర్మా ముద్ధర్తుమిహార్హసి' అని పలికెను. కీచకుడు వక్త్రనేత్రముల సూక్ష్మములకు బరుగులిడి మాట్లాడినాడు. ౧౯ శ్లోకమందు కీచకుడు సైరంధ్రిని జగన్మోహినియని పలికినట్లుగలదు. ఈశ్లోకమందు ముఖచంద్రుడని కాక 'చంద్రవక్త్రం' అనియుండుట గమనింపదగినది. ఇది ముఖమునందమును దెల్పుచు కీచకుని వక్రబుద్ధిని సమర్థించుచున్నది. అట్లే 'తే స్తనౌ చోభౌ తవ సుభ్రూ పయోధరౌ' అని రెండు పర్యాయములుగా నుండుటయు కీచకుని కామోద్రేకమును తెల్పుచున్నవి. వర్ణాతపాక్రాంతునవైన కీచకు డిటువంటి విపరీతములు పలుకజొచ్చినాడు. సైరంధ్రియందలి వాంఛచే హృదయవిదారణమగుచున్నదని కీచకు డీసందర్భములో బలికినమాట వానిచేటును వ్యక్తీకరించుచున్నది. సుధేష్ణయు ద్రౌపదిని వర్ణించి ప్రశంసించినది. ఆ వర్ణనయందు ద్రౌపదియొక్క సల్లక్షణములు వ్యక్తమగుచున్నవి.

నోచ్చ్రగుల్ఫా సంహతోరు స్త్రిగంభీరా షడున్నతా,
రక్తా పంచసు రక్తేషు హంసగద్గదభాషిణీ. ౯-౧౧
సుకేశీ సుస్తనీ శ్యామా పీనశ్రోణిపయోధరా,
తేన తేనైవ సంపన్నా కాశ్మీరీవ తురంగమీ. ౧౨
అరాళపక్ష్మనయనా బింబోష్ఠీ తనుమధ్యమా,
కంబుగ్రీవా గూఢశిరాః పూర్ణచంద్రనిభాననా. ౧౩
శారదోత్పలపత్రాక్ష్యా శారదోత్పలగంధయా,
శారదోత్పలసేవిన్యా రూపేణ సదృశీ శ్రియా. ౧౪
కా త్వం బ్రూహి యథా భద్రే నాసి దాసీ కథంచన,
యక్షీ వా యది వా దేవీ గంధర్వీ యది వాప్సరాః. ౧౫
దేవకన్యా భుజంగీ వా నగరస్యాఽథ దేవతా,
విద్యాధరీ కిన్నరీ వా యది వా రోహిణీ స్వయమ్. ౧౬
అలంబుసా మిశ్రకేశీ పుండరీకాఽథ మాలినీ.
ఇంద్రాణీ వారుణీ వా త్వం త్వష్టు ర్ధాతుః ప్రజాపతేః. ౧౭
దేవ్యో దేవేషు విఖ్యాతా స్తాసాం త్వం కతమా శుభే. ౧౮

సైరంధ్రిని వర్ణించి పలుకుటలో సుధేష్ణ వర్ణించుట యందు సాత్వికము, కీచకవర్ణనమందు తామసికము గలదు. వ్యక్తియొకటేయైనను వారివారి మనోభావముల ననుసరించి గ్రహింపునందలి తేడా యిందు నిరూపింప బడినది. సైరంధ్రిని వర్ణించుచు సుధేష్ణ యామెను దేవోత్తమస్త్రీగ భావించినది. కీచకుని నీచత్వ మిచట వ్యక్తమగుచున్నది.

ద్రౌపదీ—

అప్రార్థనీయా మిహ మాం సూతపుత్రాఽభిమన్యసే,
విహీనవర్ణాం సైరంధ్రీం బీభత్సాం కేశకారిణీమ్ ౧౮-౩౫
పరదారాఽస్మి భద్రం తే న యుక్తం తవ సాంప్రతం,
దయితాః ప్రాణినాం దారా ధర్మం సమనుచింతయ. ౩౬
పరదారే న తే బుద్ధిర్జాతు కార్యా కథంచన,
వివర్జనం హ్యకార్యాణా మేతత్సుపురుషవ్రతమ్ ౩౭
మిథ్యాఽభిగృధ్నోహి నరః పాపాత్మా మోహమాస్థితః,
అయశః ప్రాప్నుయా ద్ఘోరం మహద్వా ప్రాప్నుయా
ద్భయమ్. ౩౮

(అప్రార్థనీయురాలను, నన్ను సూతపుత్రుడా యపే క్షించుచున్నావు. విహీనవర్ణను, సైరంధ్రిని, బీభత్సను, కేశకారిణిని పరదారనైన నన్నుగోరుట యుక్తముకాదు. ప్రాణులకు భార్య లిష్టు లను ధర్మమును స్మరింపుము. పరదారలందు నీవెపుడును బుద్ధినిడరాదు, అకార్యములను విసర్జించుటే యుత్తమమైన పురుషవ్రతము. కోరరానిదానిని గోరు పాపాత్ముడైన నరుడు మోహావిష్టుడై యపకీర్తి నొందును, గొప్పభయము నొందును.)

ఇందు మొదటిశ్లోకము పూర్వార్థము ద్రౌపదీ పరము గను, నుత్తరార్థము సైరంధ్రీపరముగను సమన్వయమగుట గమనింపదగినది. సౌందర్యము విషయమై కీచకుడు పలికినాడు గాన నప్రార్థనీయురాలను విహీనవర్ణను సైరంధ్రిని బీభత్సను కేశకారిణిని యని ద్రౌపది పలికినది. సంభోగము నపేక్షించిన

దానికి పరదారను పలికినది. దారలను త్యజించెదనని పలికిన దానికి భార్య యవశ్యము రక్షణీయురాలని యకార్యమును విసర్జించుటే పురుష వ్రతమనియు నట్లుగాకుండిన అయశము గల్గునవియు ద్రౌపది పలికినది.

ఏవ ముక్తస్తు సైరంధ్ర్యా కీచకః కామమోహితః,
జానన్నపి సుమహద్బుద్ధిః పరదారాఽభిమర్శనే. 39
దోషాన్ బహూన్ ప్రాణహరాన్ సర్వలోక విగర్హితాన్,
ప్రోవా చేదం సుదుర్బుద్ధిః ద్రౌపదీ మజితేంద్రియః. 40

(సైరంధ్రిచే నిట్లు పలుకబడిన కామమోహితుడైన కీచకుడు పరదారాభిమర్శనమందు సర్వలోకవిగర్హితము, ప్రాణహరమునగు బహుదోషములు గలవని యెఱింగినవా డయ్యు నజితేంద్రియుడు దుర్బుద్ధిగాన ద్రౌపదితో నిట్లనెను.)

ద్రౌపది విరాటనగరమందు సైరంధ్రిగా నున్నది. కీచకు డామాటలను సైరంధ్రిమాటలుగా వినుటయైనది ఆమె నపేక్షించియున్న కీచకుని యంతమిచ్చోట పర్యవసాన మగుచున్నది.

ఏవ ముక్తస్తు సైరంధ్ర్యా కీచకః
ప్రోవా చేదం సుదుర్బుద్ధిః ద్రౌపదీ మజితేంద్రియః

ఇట్లుగా ద్రౌపదినిగూర్చి సైరంధ్రి, ద్రౌపది-అని రెండు పేళ్ళు జతచేయబడినవి. 'ద్రౌపదీం ప్రోవాచ' అనుమాట గాంభీర్యార్థమును సృష్టించుచున్నది. సైరంధ్రి గంధర్వ

ప్రియపత్ని. ద్రౌపది పాండవ పట్టమహిషి. అల్పమతిని జూచువానిని తన గంధర్వపతులచే జయించు ననుమతిని సైరంధ్రి పొందియున్నది. లోకవిశ్రుతుడై బహుమరాగ్గ్రుడై యున్న కీచకుడిపుడా గంధర్వప్రియపత్ని సైరంధ్రియందు దగుచుగల్గి సర్వలోక విగర్హితమైన పరిస్థితియందు బడు చున్నాడు. పరదారాభిమర్శనమందు ప్రాణహారములగు బహుదోషములు గలవని తెలిసినవాడయ్యు నజితేంద్రియు డగు కీచకు డిట్లు పలికెను.

'సుమద్బుద్ధిః ద్రౌపదీ మజితేంద్రియః' అని యిచ్చట గలదు. బహుమరాగ్గ్రుడు నజితేంద్రియుడగు వానివలన నేర్పడుచున్న ద్రౌపదికష్టమునిది సూచించుచున్నది.

నాహ్వా స్త్వేవం వరారోహే ప్రత్యాఖ్యాతుం వరాననే,
మాం మన్మథసమావిష్టం త్వత్కృతే చారుహాసిని. ౪౧

(వరారోహా! నీవిట్లు పలుకవలదు. వరాననా! తిరస్కరింపకుము. చారుహాసినీ! నీనిమిత్తము మన్మథసమావిష్టుడనైన నన్ను తిరస్కరింపకుము)

ఈచిన్నశ్లోకమందు వరారోహే వరాననే చారుహాసినీ అను మూడుమాట లున్నవి. ఇవి వాని కామబలమును వెల్లడించుచున్నవి. తనమాటలకు సైరంధ్రి సుముఖ మగుట లేదు, ప్రతికూలవచనములు పలికినది. కీచకుడామె కాశగొల్ప దలంచి 'అమూల్యావకాశమున్న జారవిడుచు

కొందువు' అని కీచకుడు, తనవైభవమును, లోకవిఖ్యాతిని, భోగసాధనసంపత్తిని బలుకుచున్నాడు.

ప్రత్యాఖ్యాయచ మాం భీరు వశగం ప్రియవాదినం,
నూనం త్వ మసితాపాంగి పశ్చాత్తాపం కరిష్యసి. ౪౨
అహంహి సుభ్రు రాజ్యస్య కృత్స్నస్యాస్య సుమధ్యమే,
ప్రభుర్వాసయితాచైవ వీర్యే చాప్రతిమః క్షితౌ. ౪౩
పృథివ్యాం మత్సమో నాస్తి కశ్చి దన్యః పుమా నిహ,
రూపయౌవనసౌభాగ్యై ర్భోగై శ్చానుత్తమై శ్శుభైః.
సర్వకామసమృద్ధేషు భోగే ష్వనుపమేష్విహ,
భోక్తవ్యేషుచ కల్యాణి కస్మా ద్దాస్యే రతా హ్యసి. ౪౪
మయా దత్త మిదం రాజ్యం స్వామి న్యసి శుభాననే,
భజస్వ మాం వరారోహే భుఙ్క్ష్వభోగా ననుత్తమాన్.
ఏవ ముక్తాతు సా సాధ్వీ కీచకే నాశుభం వచః,
కీచకం ప్రత్యువాచేదం గర్హయం త్యస్య తద్వచః, ౪౭

(ఓ భీరూ నీకు వశుడనై ప్రియములు పలుకుచున్న నన్ను దిరస్కరించి నిశ్చయము నీవు పశ్చాత్తాప మొందగలవు. చక్కనికనుబొమలు గలదానా! సన్నని నడుముగలదానా! నేనే యీరాజ్యమునకంతకు ప్రభువును. నేనుచెప్పినట్లు రాజ్యమంతయు నడచును. పుడమిలో నప్రతిమానమగు వీర్యము గలవాడను. రూపయౌవన సౌభాగ్యములచేతను, ననుత్తమమైన శుభభోగములచేతను నాకు సమానుండగు పురుషుం డొక్కరుం డిప్పుడమియందు లేడు. సర్వకామ

సమృద్ధమగు ననుపమానభోగములుండగా వానినన్నింటిని భోగింపక దాస్యరతి గలదానవగుదు వేమి. ఓశుభాననా! నేనొసంగిన రాజ్యమునకు రాజ్ఞివై నన్నుగూడి యనుపమాన భోగముల ననుభవింపుము. ఇట్లుగా గీచకుడశుభమును బలుకగా నాసాధ్వి గర్హించుచు గీచకున కిట్లు బదులు పలికెను.

తన్ను మిక్కిలిగా బ్రశంసించుకొనుచు నాశగొల్పు మాటలిట్లు కీచకుడు పలుకగా నాసాధ్వి యిట్లు బదులు పల్కు చున్నది. సుధేష్ణ తనరూపసౌందర్యములను ప్రశంసించి దేవతాస్త్రీగ దన్ను బేర్కొనగా దాను సైరంధ్రినని సత్య భామయొద్ద, ద్రౌపదియొద్ద మెలంగితినని ద్రౌపది పలికినది. అమానుషమగు వర్చస్సును గాంచి విరాటునిగూర్చిన శంకను సుధేష్ణపలుకగా నపుడు తనపతులు గంధర్వులని, వారు సదా తన్ను ప్రచ్ఛన్నముగా గాపాడుచుందురని ద్రౌపది పలికినది. కీచకుడు తన రూపసౌందర్యములను పేర్కొని దేవతాస్త్రీగా భావించి తన్నపేక్షించి పలుకగా వాని కాతలంపు తగదని ద్రౌపది హితము పలికినది. ఈమాటలు ద్రౌపదివని వ్యాసుడు మకుట మిచ్చినాడు. తన్ను కీచకుడు ప్రాకృతస్త్రీగా దలంచి నాశగొల్పుమాటలు సగర్వముగబలుకగా నామె గంధర్వ పతుల రక్షణనుగూర్చి పలుకుచున్నది. ఈమాటలు సైరంధ్రి వని వ్యాసుడు మకుట మిచ్చినాడు, 'సైరంధ్ర్యువాచ' అని యిచ్చుటగలదు.

సైరంధ్రి

మా సూతపుత్ర ముహ్యస్వ మాఽద్య త్యక్ష్యసి జీవితం,
జానీహి పంచభి ర్ఘోరై ర్నిత్యం మా మభిరక్షితామ్. ౨౯
న చాప్యహం త్వయా లభ్యా గంధర్వాః పతయో మమ,
తే త్వాం నిహన్యుః కుపితా స్సాధ్వలం మా వ్యనీనశః.
అశక్యరూపం పురుషై రధ్వానం గంతు మిచ్ఛసి
యథా నిశ్చేతనో బాలః కూలస్థః కూల ముత్తరమ్. ౩౦
తర్తు మిచ్ఛతి మందాత్మా తథా త్వం కర్తు మిచ్ఛసి. ౩౧
అంతర్మహీం వా యది వోర్ధ్వ ముత్పతే
స్సముద్రపారం యది వా ప్రధావసి,
తథాపి తేభ్యో న విమోక్షు మర్హసి
ప్రమాథినో దేవసుతా హి ఖేచరాః. ౩౨
త్వం కాళరాత్రి మివ కశ్చి దాతురః
కిం మాం దృఢం ప్రార్థయసేఽద్య కీచక,
కిం మాతురంకే శయితో యథా శిశు
శ్చంద్రం జిఘృక్షు రివ మన్యసే హి మామ్. ౩౩
తేషాం ప్రియాం ప్రార్థయతో న తే భువి
గత్వా దివం వా శరణం భవిష్యతి,
న వర్తతే కీచక తే దృశా శుభం
యా తేన సంజీవన మర్థయేత. ౩౪
ప్రత్యాఖ్యాతో రాజపుత్ర్యా సుదేష్ణాం కీచకోఽబ్రవీత్
అమర్యాదేన కామేన ఘోరేణాఽభిపరిప్లుతః. ౧-౩౧

(సూతపుత్రి)డా మోహమొందకుము. నీజీవితమును బాపికొనకుము. ఘోరమైనవా రయిదుగురచే నిత్యము రక్షింపబడుచున్నదానననియెఱుంగుము. నేను నీచేలభ్యమగుదానను గాను. నాగంధర్వపతులు కోపించి నిన్ను తుదముట్టించెదరు. వారిని రేపి వారిచేత చావకుము. పురుషులు పోరాని తెరువున బోదలంచుచున్నావు. నిశ్చేతనుడగు బాలుడు గట్టున గూర్చుండి యవతలియొడ్డును చేరదలంచినట్లు మందాత్ముడట్లుగా నీవు చేయదలంచుచున్నావు. భూగర్భమునకు బోయినను, నాకమున కెగిరినను, సముద్రపారమునకు బాఱినను నట్లయ్యును వారివలన విడువబడవు. వారు ప్రమాథులు, దేవసుతులు, ఖేచరులు. నీవు కాళరాత్రినివలె నాతురుడవై యేల నన్ను దృఢముగ బ్రార్థించుచున్నావు. కీచకా యేల నోయి తల్లియొడిలో శయనించియున్నశిశువు చంద్రుని బట్టగోరునటుల నన్నుగూర్చి తలంపుగల్గి యున్నావా. వారికి ప్రియాంగనను నన్ను గాంక్షించినచో నీకు భువియందును, దివమందును శరణము గలుగనేరదు. జీవితము గాపాడుకొనగోరుదువేని యీబుద్ధితగదు. (౧౮—౪౯—౫౮)

రాజపుత్రిచే దిరస్కృతుడైన కీచకుడు సుదేష్ణతో నిట్లనెను. ఘోరమైనట్టి మర్యాదమీఱినకామమున మానింగినవాడై కీచకు డిట్లనెను. (౧౫—౧)

౧ నన్ను నిరాకరించి పశ్చాత్తాపమొందెదవని కీచకుడు పలికినదానికి సైరంధ్రి నేనులభ్యమగుదాన గానని సమాధానము చెప్పినది. ౨ విరాటరాజ్యములో నాకెదురాడు

వారులేరని కీచకుడు పలికినదానికి సైరంధ్రి మూడులోకము లందును గంధర్వులనుండి నన్నురక్షించువారు లేరని పలికినది. 3 పృథివిలో నాకు సమానుడులేడని కీచకుడు పలికిన దానికి సైరంధ్రి నాపతులు లోకాంతరసంచారులని పలికినది. సైరంధ్రి యిట్లు ధిక్కరించి పలుకగా గీచకుడు వెంటనే సుధేష్ణయొద్దకు మరలవచ్చి సైరంధ్రిని దనయింటికి బంపుమని పలికినట్లుగా నిచ్చట చప్పన గనబడును.

'ప్రత్యాఖ్యాతో రాజపుత్ర్యా సుధేష్ణాం కీచకో౽బ్రవీత్' అని చిత్రముగా నిచ్చట గలదు. నిదానముగా నీ శ్లోకమును గమనింప వలసియున్నది. కీచకుడు ద్రౌపదిని జూడగనే కామబాణప్రపీడితుడై యామెను కామించి వెంటనే యక్కయొద్దకు వచ్చి నిర్లజ్జగా పచ్చిగా ప్రసంగించినాడు. అక్కయొద్దనుండి ద్రౌపదియొద్దకువచ్చి కీచకుడు తనకోరికను మెండుగా దెల్పెను. ద్రౌపదిగా నిది తగదంచు యామె కీచకునితో బలికినది. ఆమెను దాసిగా దలంచి యా సైరంధ్రితో గీచకు డాశగొలుపుమాటలు విశేషించి పలికినాడు. సైరంధ్రిగా నామె గంధర్వపతులరక్షను బలికి కీచకుని ధిక్కరించి తిరస్కరించినది. కీచకుడు ద్రౌపదియొద్ద నుండి వెడలిపోయినాడు.

ప్రతిదిన మిట్లుగా నామెను గీచకుడు బాధింపదొడగినాడు. ఈయభిప్రాయ మిచట గుర్తింపవలసియున్నది.

తేషాం ప్రియాం ప్రార్థయతో న తే భువి
గత్వా దివం వా శరణం భవిష్యతి॥

న వర్తతే కీచక తే దృశా శుభం
యూ తేన సంజీవన మర్థయేత ౧౪-౫౪
ప్రత్యాఖ్యాతో రాజపుత్ర్యా సుదేష్ణాం కీచకోఽబ్రవీత్
అమర్యాదేన కామేన ఘోరేణాభిపరిప్లుతః ౧౫-౧

మొదటిశ్లోకము ౧౪ అధ్యాయమం దాఖరుశ్లోకము. రెండవశ్లోకము ౧౫ అధ్యాయము మొదటిశ్లోకము. దీనిని బట్టియే మధ్యనడచిన గ్రంథము చాలాగలదని గ్రహింప వలసియున్నది.

దీని వివరణము :

కీచకుడు పరాభవించిన రాత్రికాలములో ద్రౌపది భీమునియొద్దకు బోయి తనకష్టమును దెల్పుటలో నీవిషయ మిట్లుగా గలదు.

యోఽయం రాజ్ఞో విరాటస్య కీచకో నామ భారత
సేనానీః పురుషవ్యాఘ్ర స్యాలః పరమదుర్మతిః ౧౮-౭
స మాం సైరంధ్రివేషేణ వసంతీం రాజవేశ్మని
నిత్య మేవాహ దుష్టాత్మా భార్యా మమ భవేతి వై ౮

(విరాటునకు సేనానియు, బావమఱదియు నగు పరమ దుర్మతి కీచకుడను దుష్టాత్ముడు సైరంధ్రివేషమున రాజ గృహమందు వసించుచున్న నన్ను నిత్యము నాభార్యవు కమ్మని అనుచు బలుకుచున్నాడు. అనునిత్యము వాడామె నిట్లుగా బాధింప జొచ్చినాడు.)

పాండవులు విరాటనగరమున పదినెల లజ్ఞాతవాసము వించిరి. పదునొకండవ నెలలో గీచకుడు ద్రౌపదిని

జూచుట తటస్థించినది. అది మొదలు ప్రతినిత్యము కీచకుడు ద్రౌపదియొద్దకు వచ్చి నాకుభార్యవు కమ్మంచు బాధింప జొచ్చినాడు. కొన్నిరోజు లిట్లుగా గడచినవి. కీచకుడప్పుడు మర్యాదమీరిన కామముగల్గి ఘోరపరిస్థితియందు మునింగి సుధేష్ణతో నిట్లు పలికెను.

యథా కైకేయి సైరంధ్రీ సమేయాత్త ద్విధీయతాం,
యే నోపాయేన సైరంధ్రీ భజేన్మాం గజగామినీ
తాం సుధేష్ణే పరీప్సస్వ మోహాత్ ప్రాణాన్
ప్రహాసిషమ్. ౧౫-౨

(కైకేయి! సైరంధ్రి నన్నెట్లు చేరునో, నన్నెట్లు పొందునో యాయుపాయమును చూడుమిపుడు. సుధేష్ణా! యట్లు గావింపుము, లేనిచో మోహమున నాప్రాణములు పోవును- అని కీచకుడు సుధేష్ణతో బలికెను.)

'నేనెట్లుగా సైరంధ్రిని బొందగలను' అని కీచకుడు పలుకలేదు. 'యే నోపాయేన సైరంధ్రీ భజేన్మాం గజగామినీ' అని కీచకు డనినాడు. సైరంధ్రీ భజేన్మాం గజ రప్పించి భార్యగా జేసుకొనవలెనని కీచకుడు నెలరోజులు ప్రయత్నించినాడు. గ్రంథమం దీవిషయ మిట్లు ధ్వనింప జేయబడినది.

తదర్థ మభిజల్పంత్యాః కృష్ణాయాః కీచకేన హ
దివసార్థం సమభవ న్మాసే నైవ సమం నృప. ౨౨-౧౯

(జనమేజయా! భీమసేనుడు చెప్పిన ప్రకారము ద్రౌపది కీచకునితో సంకేత మేర్పఱచిన పిమ్మటనున్న దివసార్ధము (మిగిలియున్న దివసార్ధము) కీచకున కొకనెలతో సమముగా నుండినది- అని వైశంపాయనుడు చెప్పెను. 'నృప' అను సంబోధనమున బారరు డీరదలిని వానమును గమనింపదగునను విశేషము వ్యక్తమగుచున్నది.)

సంకేతముప్రకారము కీచకుడు నర్తనశాలకు వచ్చి పలికినమాటయు నిట్లే యున్నది.

ప్రాపితం తే మయా విత్తం బహురూప మనంతకమ్,
త్వత్కృతే ధనరత్నాఢ్యం దాసీశత పరిచ్ఛదం,
రూపలావణ్యయుక్తాభి ర్యువతీభి రలంకృతమ్. ౨౬
గృహం చాంతఃపురం సుభ్రు క్రీడారతి విరాజితం,
తత్సర్వం త్వాం సముద్దిశ్య సహసాహ ముపాగతః.
అకస్మా న్మాం ప్రశంసంతి సదా గృహగతాః స్త్రియః,
సువాసా దర్శనీయశ్చ నాన్యోఽస్తి త్వాదృశః పుమాన్.

(నీనిమిత్తము బహురూపము అనంతమునైన విత్తమును గొని వచ్చితిని. నీనిమిత్తమున నేనెట్టిపని చేసితినో చూడుము. ధనరత్నాఢ్యము, దాసీశత పరిచ్ఛదము నగు నాగృహ మంతఃపురము రూపలావణ్యయుక్తలగు యువతులచే నలంకృతమైనది. మఱియు మంచికనుబొమలు కల దానా! క్రీడారతివిరాజితమైనది. అట్టి దానినంతయు .... (నిదిగో! .... నిన్నుద్దేశించి వేగముగా నేనువచ్చితిని. నిర్నిమిత్తముగ గృహాగతలైన స్త్రీలు నన్నుబ్రశంసించుచుందురు.

'సువేషుండవు, దర్శనీయుడవు, నీవంటి విలాసపురుషుడు మఱిలేడు' అని వారు పొగడుచుందురు.)

'కీచకు నంతఃపురము సమస్తభోగసాధనములతో నిండి నది. క్రీడకు రతికి నంతటికి శోభించి విరాజిల్లునది. దాని నంతయు (విడిచి) నీకై యిక్కడికి వచ్చితిని' అని వానియు ద్దేశమైనను 'విడిచివచ్చితిని' అని కంఠతః వాడు పలుకడు. 'వచ్చితిని' (సహసాహ మిహాగతః) అనిమాత్రమే వాడు పలికినాడు. తుదిసమయములోగూడ కీచకున కామె నంతః పురమునకు గొనిపోవలెనను అభిలాష మెండుగగలదనియిందు వలన ధ్వనించుచున్నది. 'అకస్మాన్మాం ప్రశంసంతి సదా గృహగతాః స్త్రియః' అనునదికూడ దీనినేవివరించుచున్నది. భార్యలని వాడనక గృహగతులగు స్త్రీలని వాడుపలుకుటలో నీయభిప్రాయము ధ్వనించుచున్నది.

నెలరోజులు కీచకుడిట్లు సైరంధ్రిని దనయంతఃపుర మునకు గొనిపోవలెనని ప్రయత్నములు చేసి విఫలుడై మర్యాద మీఱిన కామమున కీచకుడు ఘోర పరిస్థియందు బడుచున్నాడు. ద్రౌపదిచే నిట్లు తిరస్కరింప బడుచుండిన కీచకుడు కడకు ఘోరములో బడుచున్నాడు, తుదముట్టువా డగుచున్నాడు.

ఈసందర్భములో సుధేష్ణనుగూర్చి కీచకుడు 'కైకేయి' అని సంబోధించుట గమనింపదగినది. (౧౫-౭) మఱియు ద్రౌపది సుధేష్ణయొద్దకు వచ్చుసందర్భములో గూడ కేకేయీ శబ్దమే గలదు.

విరాటస్యతు కైకేయీ భార్యా పరమసమ్మతా
ఆలోకయంతీ దదృశే ప్రాసాదా ద్ద్రుపదాత్మజామ్ ౬-౬
రామాయణ భారతములందు కైకేయీ పాత్రలిట్టివని యభిప్రాయము.
తస్య సా బహుశః శ్రుత్వా వాచం విలపత స్తదా
విరాటమహిషీ దేవీ కృపాం చక్రే మనస్వినీ. ౧౫-౩
స్వమంత్ర మభిసంధాయ తస్యార్థ మనుచింత్యచ
ఉద్వేగం చైవ కృష్ణాయా స్సుదేష్ణా సూత మబ్రవీత్.౪
(విలపించుచు బహువిధముల బ్రార్థించు కీచకుని మాట విని మనస్వినియగు విరాటమహిషి సుదేష్ణాదేవి కృప దలంచెను. స్వమంత్రము నభిసంధించి, కీచకార్థమును జింతించి, ద్రౌపద్యుద్వేగమును గమనించి సుదేష్ణ సూతునితో నిట్లనెను.)
ద్రౌపది విరాటునికొలువును జేరినది మొదలు పరిస్థితి యెట్లుమారుచువచ్చినది యిచ్చట గమనింపవలసియున్నది.
మూర్ధ్ని త్వాం వాసయే యం వై సంశయో మే న విద్యతే
'నిన్ను నెత్తిమీద పెట్టుకొనియెద నాకే సంశయము లేదిచో' అని సుదేష్ణ ద్రౌపదితో బలికినది.
నాస్మి లభ్యా విరాటేన న చాన్యేన కదాచన

* సువూక్ష్మముగు పరిశీలనము గావించిన రామాయణ భారతములందు సన్నిహితములగు పెక్కువిశేషములు పాత్రలందు వర్ణనలందుగూడ పొడగట్టగలవు. ఈవిరాటపర్వమందే మఱికొన్నివిశేషము లిట్టివి గలవు.

'నేను విరాటునిచేతనుగాని, అన్యునిచేతనుగాని లభ్యము కాదగినదానను గాను, నన్ను గంధర్వపతులు సదా రక్షించుచుందురు' అని ద్రౌపది బదులుపల్కినది. నిస్సంశయముగా నపుడు సుధేష్ణ ద్రౌపదిని (సైరంధ్రిగా) నింట ప్రవేశపెట్టు కొనినది. అజ్ఞాతవాసము నాలుగు నెలలు గడచినపిమ్మట విరాటనగరమందు బ్రహ్మోత్సవము జరిగెను. అపుడు జీమూతుడను మల్లునితో భీముడు మల్లయుద్ధము చేయవలసి వచ్చెను.

♦ భీమునకిది యిష్టము లేకపోయినను దుఃఖముననే యంగీకరించి మల్లయుద్ధము గావించెను. అది మొదలు భీముడు మల్లులతో మల్లయుద్ధము చేయవలసిన పరిస్థితి గల్గినది.

ఏవం స సుబహూన్ మల్లాన్ పురుషాంశ్చ మహాబలాన్
వినిఘ్నన్ మత్స్యరాజస్య ప్రీతి మాహర దుత్తమామ్.
యదాఽస్య తుల్యః పురుషో న కశ్చిత్తత్ర విద్యతే
తతో వ్యాఘ్రైశ్చ సింహైశ్చ ద్విరదైశ్చాప్యయోధయత్.

(అది మొదలుగా ననేకమల్లులతో భీముడు పోట్లాడుచు మత్స్యరాజునకు గొప్పప్రీతిని గల్గించెను. భీమునితో బోట్లాడగలవాడు లేనందున నాతడు వ్యాఘ్రములు, సింహములు, గజములతో బోట్లాడవలసిన పరిస్థితి యేర్పడెను.)

---

♦ చోద్యమాన స్తదా భీమో దుఃఖేనైవాకరో న్మతిం
నహి శక్నోతి వివృతే ప్రత్యాఖ్యాతుం నరాధిపమ్. ౧౩-౨౧

కీ చ క వ ధ మోదు సంఖ్య..

తేది.....................

అంతఃపుర స్త్రీల వినోదార్థ మిర్పడిన యీ విష యము చిక్కు పరిస్థితిని గల్గినది. భీమునకు కీచకపరాభవ విష యము దెల్పునపుడు ద్రౌపది యీపరిస్థితి నిట్లుగా వ్యక్తీక రించినది.

యదా మహాసనే సిద్ధే విరాట ముపతిష్ఠసే
బ్రువాణో వల్లవ సూద స్తదా సీదతి మే మనః ౧౯.౪

యదా ప్రహృష్టస్సమ్రాట్ త్వాం సంయోధయతి కుంజరైః
హాసం త్యంతఃపురే నార్యో మమ తూద్విజతే మనః. ౫
శార్దూలై ర్మహిషై స్సింహై రగారే యోధ్యసే యదా
కైకేయ్యాః ప్రేక్షమాణాయాస్తదా మేకశ్మలోఽభవత్.
తత ఉత్థాయ కైకేయీ సర్వా స్తాః ప్రత్యభాషత
ప్రేష్యాస్సముత్థితాశ్చాపి కైకేయీం తాః స్త్రియోఽ
బ్రువన్. ౭

ప్రేక్ష్య మా మనవద్యాంగీం కశ్మలోపహతా మివ
స్నేహాత్ సంవాసజా ద్ధర్మాత్ సూద మేషానుచిన్తి తా.
యోధ్యమానం మహావీర్యై రియం సమనుశోచతి
కళ్యాణరూపా సైరంధ్రీ వల్లవశ్చాపి సుందరః.
స్త్రీణాం చిత్తంచ దుర్జ్ఞేయం యుక్తరూపౌచ మే మతౌ.
సైరంధ్రీ ప్రియసంవాసా న్నిత్యం కరుణవాదినీ. ౧౦
అస్మిన్ రాజకులే చోభౌ తుల్యకాలనివాసినౌ
ఇతి బ్రువాణా వాక్యాని సా మాం నిత్యమతర్జయత్. ౧౧
క్రుధ్యంతీ మాంచ సంప్రేక్ష్య సమశంకత మాం త్వయి

తస్యాం తథా। బ్రువంత్యాంతు దుఃఖం మాం మహా
దావిశత్. ౧౨

(భారత వంటశాలలో విరాటునెదుట నేను వల్లవుడను, సూదుడనని నీవు చెప్పినప్పుడు నామనసు దిగులొందుచున్నది. విరాటుడు ప్రహృష్టుడై కుంజరములతో నీకు పోట్లాట పెట్టినపు డంతఃపురస్త్రీలు గొల్లుమని నవ్వుచుందురు. నాకైన మన మెరియుచుండును. శార్దూలములు మహిషములు సింహములు — వీనితో నీకు రంగస్థలమందు కైకేయి (సుధేష్ణ) యొక్క వేడుకకుగాను పోట్లాటపెట్టుచుండునపుడు నామనసు కశ్మలమగుచుండెను. కశ్మలోపహతమైన నన్నుజూచి సుధేష్ణ వేగిరంబలేచి యందఱుచెలులతోడ నన్నుగూర్చి చెప్పజొచ్చినది. పరిచారకులెల్లను లేచి యామెతో గుసగుసలాడుచుండిరి. స్నేహము చేతనో, కూడియున్నందు వనో మహావీర్యసత్వములతో బోరాడునపు డాసూదునిజూచి సైరంధ్రి వ్యథనొందుచున్నది. కళ్యాణరూపముగలది సైరంధ్రి, వల్లవుడును సుందరుడు, స్త్రీలచిత్తమో దుర్జ్ఞేయమైనది, వీరుభయులు యుక్తరూపము గలవారని నేను తలంచుచున్నాను. సైరంధ్రి ప్రియసంవాసముచేత నిత్యము కరుణగా మాటాడుచున్నది. ఈరాజకులమందు వీరుభయులు తుల్యకాలాగతులేను. ఇట్టిమాటలాడుచు నామె నన్నుగూర్చి నిత్యము తర్జనభర్జనము చేయుచున్నది. కోపించి నన్నుజూచి నీయందు నన్ను శంకించినది! ఆమె యట్లను చుండగా నాకు గొప్పదుఃఖ మావేశించినది.)

నొాల్గవ నెలలో బ్రిహ్మోత్సవ సందర్భమున బ్రారంభ మైన మల్లయుద్ధ విషయ మిట్లుగా జిక్కు-పరిస్థితిని గల్గినది. అనేకులు మల్లులతో భీముడు పోట్లాడవలసివచ్చినది. వల్లవునకు దుల్యమగు మల్లుడు లేనందున మృగములతోడ నా భీముడు పోట్లాడవలసి వచ్చినది. మనిషిమృగములతో బోట్లాడుట వినోదవిషయమై యంతఃపురకాంతలు గొల్లుమనినవ్వ జొచ్చిరి. ద్రాపది కిది వినోదముకాదు. జగన్మాన్యుడగు తనభర్త మృగములతో మృగమట్లు పోట్లాడుట యామెకు మిక్కిలికష్ట మనిపించినది. ఈకష్టమామెకు సహింపరానిదై నందున నాద్రాపది యంతఃపురస్త్రీలకందఱకు వ్యక్తము కాజొచ్చినది. సుధేష్ణాదు లిందువిషయమై సైరంధ్రిని శంకించి పలుమాటలాడుటయేకాక యామెను సుధేష్ణ శంకింప జొచ్చినది. తుల్యకాలమున వారుభయులు విరాటకొలువును జేసినందున నంతకుమునుపు వారికి సంబంధ మున్నదనియు సుధేష్ణాదులు శంకింపజొచ్చిరని యభిప్రాయము, వారి పూర్వసంబంధ మట్లు విరాటనగరమున దప్పుగా గనబడ జొచ్చినది. వంటవానితోడ సైరంధ్రికి సంబంధమున్నదను శంక యిందువలన సుధేష్ణ కేర్పడినది. సైరంధ్రి పతివ్రత నను చూచుచున్న పరమసమ్మతురాలగు సుధేష్ణ పెద్దసంకట ములో బడినది. * విరాటుడు సైరంధ్రి తీసిననలుగునే విని యోగించువా డయినాడు. మఱొకటి విరాటున కిష్ట

* నాన్యమపిష్టంపిా మత్స్యస్య చందనం కిల రోచతే. ౨౦-౨౪

మగుట లేదు. ♦ దీనితో సైరంధ్రి విరాటునకు నిత్యము సేవచేయుపరిచారికగా నేర్పడినది. విరాటునెదుట నిలిచి యుండుట యను సైరంధ్రి యునికి సుధేష్ణకు కిట్టనిపరిస్థితిగా నేర్పడినది. మఱియు నాసైరంధ్రిని తనయంతఃపురమునుండి పంపివేయుటకు దానివిషయముగూడ నాసుధేష్ణ కేర్పడినది. వల్లవవిషయమందున్నది సంశయమే, మఱెందున సైరంధ్రి యందు పిసరంతయు లోపము గానరాలేదు. ఇందువలన నాసుధేష్ణ కేమిచేయుటకు రాలేదు.

ఇట్లుండగా కీచకుడు సైరంధ్రిని జూచినాడు, ప్రతి నిత్య మామెను తనకు భార్యవుగమ్మని వేధింపజొచ్చినాడు, పలుదినము లిట్లునడచుచుండినను సైరంధ్రిని గాపాడువారుగా గంధర్వపతులు గానరాలేదు. అందువలన సైరంధ్రి కసలు గంధర్వపతులంటు యున్నారాయను విషయముగూడ (సంశయముగూడ) తటస్థించినది. దానితో సుధేష్ణకు విరాటునిగూర్చిన తలంపేర్పడినది. ఈవిషయముగూడ ద్రౌపది యారాత్రికాలమందు భీమున కిట్లు తెల్పినది.

మామేహ భీమ కైకేయ్యా రూపాభిభవశంకయా
నిత్య ముద్విజతే రాజా కథం నేయా దిమా మితి. ౨౧-౨౦
తస్యాః విదిత్వా తం భావం స్వయం చానృతదర్శనః,
కీచకోఽయం సుదుష్టాత్మా సదా ప్రార్థయతే హి మామ్,

♦ సా ద్యాగస్త్రితో విరాటస్య భీతా తిష్ఠామి కింకరీ. ౨౦-౩.

(భీమసేనా! కైకేయి నాయందలి రూపాభిభవశంక గల్గి రాజు (విరాటుడు) దీని నెట్లు చేరకుండువని నిత్య మిట్లు నన్నుగూర్చిన శంక (బెంగ) నొందియున్నది. సంకట పరిస్థితి యిట్లామె కేర్పడినది. ఆమెయొక్క యీయభి ప్రాయము నన్నృతదర్శనుకు, దుష్టాత్ముడునగు కీచకుడు స్వయ మోలింగినవాడై సదా నన్నుప్రార్థింప దొడంగినాడు.)

కీచకు డిట్లు కామించి బాధించుచున్నను సైరంధ్రిని బలాత్కరించినచో నపుడేమగునో యని తెలియను కదా. బలాత్కరించిననే వాడు పరాంతనువునొందునని సైరంధ్రి మాటగా వర్థమైన సుధేష్ణ గొప్పసంకటములో బడిపోయినది. పరిస్థితియిట్లుండగా నిపు డమాంతమువచ్చి కీచకుడు సైరం ధ్రినిగూర్చుము' అని సుధేష్ణ నడిగివేసినాడు.

౧ స్వమంత్ర మభిసంధాయ కైకేయియొక్క తలంపు

౨ తస్యార్థ మనుచింత్యచ కీచకుడు సైరంధ్రి నపేక్షించి యుండుట

3 ఉద్యోగం చైవ కృష్ణాయాః ద్రౌపదియొక్క యుద్యోగము ఈమూటిని దలంచి కైకేయి సైరంధ్రిని సూతునింటికి (కీచకునింటికి) బంపదలంచినది,

౧ మిగులబలవంతుడగు కీచకునంతఃపురమును జేరు నదిగా సైరంధ్రియగుచో సుధేష్ణకింక బెంగయుండదు. కీచకుడింక సైరంధ్రిని పైకిరానీయడని యభిప్రాయము— ఇది కైకేయి తన్నుగూర్చి తలంచినట్టి విషయము.

౨ కీచకుడు సైరంధ్రి నపేక్షించియున్నాడు— ఇది కీచకుని గూర్చి తలంచిన విషయము.

౩ ద్రౌపదియొక్క యుద్యోగవిషయము. ఈవిషయము ద్రౌపదిపైననే యాధారపడియున్నదని యభిప్రాయము. సైరంధ్రియుద్యోగమనికాక ద్రౌపదియుద్యోగమని యుండుట గమనింపదగినది. మొదట నామె పలికినమాట గంధర్వపతులరక్షణ గానరానందున దబ్బరగా సూచితమగుచున్నది. కీచకుడపేక్షించి 'సైరంధ్రినిగూర్పుమని' పలుకుటవలన నీ చిక్కు తటస్థించినది. అందువలన నింతవఱకు నుచితముగా నుపేక్షించియున్న కైకేయి, యిప్పుడు సైరంధ్రిపైననే కార్యభారమును మోపివేయుచున్నది. 'కులటయగుచో కీచకునకు వశమైపోవును' అట్లుకానిచో నామె రక్షణభార మామెయందే యాధారమైయున్నది'అని కైకేయి తలంపైయున్నది.

విరాటుడు సైరంధ్రిని జేరకుండునట్టి తీరు కల్గింప నాలోచించుచున్నకైకేయికిదితగుసమయముగా నేర్పడినది. కైకేయి తలంపీవిధముగా నేర్పడినది. సంశయము కలుగ నంతవరకు సైరంధ్రి నామె నత్తిని పెట్టుకొనినది, సంశయ మేర్పడగా క్రిందకుదింపవలసివచ్చినదని యభిప్రాయము. 'మూర్ధ్ని త్వాంవాసయే యంవై సంశయో మే న విద్యతే, న చే దిచ్ఛతి రాజా త్వాం గచ్ఛే త్సర్వేణ చేతసా' (౯-౨౩) అని సుదేష్ణ మొదటిలో బలికినమాట యీపట్టున కెంతయో సందర్భించి యున్నది. కైకేయి యిట్లు తలపోసి గీచకునితో నిట్లు పలికినది.

పర్వాణి త్వాం సముద్దిశ్య సురా మన్నంచ కారయ
తత్రైనాం ప్రేషయిష్యామి సురాహారీం తవాంతికమ్ ౧౫.౫
తత్ర సంప్రేషితా మేనాం విజనే నిరవగ్రహే
సాంత్వయేథా యథా కామం సాంత్వ్యమానా రమే ద్యది.
(పర్వదినమున సురను, అన్నమును జేయింపుము. నాడు సురాహారిగా నీసమీపమునకు సైరంధ్రిని బంపెదను. విజనంబును, నిర్బంధరహితంబునైన నీగృహమందు సైరంధ్రి నంగీకరింప జేసికొనుము.)

గౌరవపాత్రముగానున్న సైరంధ్రిని వెంటనే కీచకు నింటికి బంపుటకు వలనుపడదు కావున రాబోవు పర్వదినము వఱకును సుధేష్ణ వేచియుండవలసివచ్చినది. 'పర్వదినమున రాజార్హమగు సురనిమిత్తము నీయింటికి సైరంధ్రిని బంపెదను' అని సుధేష్ణ దెల్పినది. (సురా మాహారయామాస రాజార్హాం సుపరిష్కృతాం ౧౫–౭) 'రమేద్యది' అనునది సైరంధ్రియొక్క ఘనతరమగు బ్రవర్తనమును వ్యక్తీకరించు చున్నది. కీచకు డట్లాపర్వమునాడు భక్ష్యభోజ్యముల నన్నియు గావించెను.

తస్మిన్ కృతే తదా దేవీ కీచకే నోపమంత్రితా
సుధేష్ణా ప్రేషయామాస సైరంధ్రీం కీచకాలయమ్. ౯
సుధేష్ణా—
ఉత్తిష్ఠ గచ్ఛ సైరంధ్రి కీచకస్య నివేశనం
పాన మానయ కళ్యాణి పిపాసా మాం ప్రబాధతే. ౧౦

సైరంధ్రి—

న గచ్ఛేయ మహం తస్య రాజపుత్రి నివేశనం
త్వమేవ రాజ్ఞి జానాసి యథా స నిరపత్రపః. ౧౧
న చాహ మనవద్యాంగి తవ వేశ్మని భామిని
కామవృత్తా భవిష్యామి పతీనాం వ్యభిచారిణీ. ౧౨
త్వం చైవ దేవిజానాసి యథా స సమయః కృతః
ప్రవిశంత్యా మయా పూర్వం తవ వేశ్మని భామిని. ౧౩
కీచకస్తు సుకేశాంతే మూఢో మదనదర్పితః
సోవమంస్యతి మాం దృష్ట్వా న యాస్యే తత్ర శోభనే. ౧౪
సంతి బహ్వ్యస్తవ ప్రేష్యా రాజపుత్రి వశానుగాః
అన్యాం ప్రేషయ భద్రం తే సహి మా మవమంస్యతే. ౧౫

(కీచకునిచేత నుపమంత్రితురాలైన సుధేష్ణ సైరంధ్రిని గీచకునింటికి బంపనెంచి యిట్లనియెను. 'లే, వెళ్లు కీచకునింటికి, సురను దెచ్చియిమ్ము, దప్పి నన్ను మిగుల బాధించుచున్నది.' ఇట్లుపలికిన సుధేష్ణకు సైరంధ్రి యిట్లు బదులు పలికినది. 'రాజపుత్రి' నేను వానిగృహమునకు బోను. ఓరాజ్ఞి వాడెట్లు లజ్జవిడిచి ప్రవర్తించుచున్నదియు నీవెఱుంగుదువుకదా. అనవద్యాంగి! నేను నీయింటపతులవిషయమై వ్యభిచరించుచు కామవృత్తి గల్గియుండుదాన గాను. నేను ప్రవేశించినపుడే పూర్వమెట్టిసమయ మొనర్చియున్నదియు నోదేవి! నీ వెఱింగి యున్నావు. కీచకుడు మూఢుడై మదనదర్పితుడై యున్నాడు కదా. నన్నుజూచి వాడవమానపఱచును. శోభనవంతు

రాలా! నే నక్కడకు బోను. నీకెందరో వశవర్తులగు దాసీలు గలరు. ఇందు కింకొకరిని బంపుము. వన్ను వాడు భంగపఱచును. అనిపలికినది.)

'లే వెళ్లు' అని యాత్రముగా నాజ్ఞారూపముగా సుధేష్ణ బలికినది. సుధేష్ణ సైరంధ్రిని వల్లవునివిషయమై శంకించి గద్దించిమాటాడినది. అస్లియ్యును తనమొదటిమాట నిలుపుకొనట కెట్టియాటంకము లేనిపరిస్థితియందే యున్న సైరంధ్రి కీచకుని దుష్టత్వమును పేర్కొని వాని గృహమునకు బోవుదాననుగానని నిస్సంకోచముగా బలికినది. మఱియు వేఱొకతెను కీచకునింటికి బంపుమనియు బలికినది. ధర్మార్థ యుక్తమగు వచనములు సైరంధ్రియు కైకేయియు బలికిరని ఫలితార్థము. సైరంధ్రి యిట్లుపలుకగా సుధేష్ణ యిట్లు పలికినది.

నైవం త్వాం జాతు హింస్యాత్స ఇతస్సంప్రేషితామయా
ఇత్యుక్త్వా ప్రదదౌ పాత్రం సపిధానం హిరణ్మయమ్. ౧౭
సా శంకమానా రుదతీ దైవం శరణ మీయుషీ
ప్రాతిష్ఠత సురాహారీ కీచకస్య నివేశనమ్. ౧౮

('నాచే బంపబడిన నిన్ను వాడేమియు హింసింపడు.' ఇట్లు పలికి కైకేయి సపిధానహిరణ్యపాత్రిను సైరంధ్రి కిచ్చినది. ఆమె శంకించుచు, రోదన మొనర్చుచు, దైవమునే శరణమని విశ్వసించి సురాహారిగా గీచకునింటికి బయలు వెడలినది.)

ఆజ్ఞారూపముగా బలికి కైకేయి వెంటనే సైరంధ్రి చేతికి బంగారుపాత్ర నిచ్చివేసినది. ♦ ఉత్తముల మాటలు దైవమందుగూడ పట్టుయుండగలదు. గంధర్వులు నన్ను రక్షించెదరని యామె మాటయై యున్నది. అందువలననే యామె యాకొలువు విడిచిపోవుటకు తలంపక దైవముపైన భారమువేసి కీచకునింటికి బోవుటకు నిశ్చయించినది. గంధర్వప్రాధాన్యమైనమాట యిట్లు పలికినది.

సైరంధ్రి—

యథాహ మన్యం భర్తృభ్యో నాభిజానామి కించన
తేన సత్యేన మాం ప్రాప్తాం మాకుర్యాత్కీచకో వశే. ౧౮

వైశంపాయనః—

*ఉపాతిష్ఠత సా సూర్యం ముహూర్త మబలా తతః.
స తస్యా స్తనుమధ్యాయా స్సర్వం సూర్యోఽవబుద్ధవాన్ ౧౯

---

♦ అర్జునుడు సన్యాసివేషమున ద్వారకానగరమునకుబోయి సుభద్రను గొనితెచ్చినట్లు కొన్నిభారతప్రతులందు గలదు. అది సరికాదు. తీర్థయాత్ర కావించుచున్న యర్జునుడు మామూలుగా ద్వారకకుబోయి గాంధర్వవిధిగా సుభద్రను దెచ్చినట్లు తెలియవలయును. భారతమం దిట్లే యున్నది.

* బ్రాహ్మణపోషణకై ధర్మజుడు సూర్యునిగూర్చి తపముగావించెను. అపుడు సూర్యుడు ప్రత్యక్షమై యిట్లు పలికెను.

యత్తేఽభిలషితం కించి త్త్వం సర్వ మవాప్స్యసి
అహ మన్నం ప్రదాస్యామి సప్తపంచచ తే సమాః అర॥౪-౭౧
గృహాణ పిఠరం తామ్రం మయా దత్తం నరాధిప
యావ ద్వర్త్స్యతి పాంచాలీ పాత్రేణానేన సువ్రత ౭౨

అంతర్హితం తత స్తస్యా రక్షో రక్షార్థ మాదిశత్.
త చ్చైనాం నాజహా త్తత్ర సర్వావస్థా స్వనిందితామ్.౧౯

(నేను భర్తలకంటె నన్య మెఱుంగనిదాననేని యీ సత్యముచేవచ్చిన నన్ను కీచకుడు వశ్యము చేసికొనకుండుగాక యనిపలికి యీమె ముహూర్తకాలము సూర్యుని స్మరించెను. ఆమె విషయమంతయు దెలిసికొనిన సూర్యు డామెను రక్షించుటకుగాను నంతర్హితుడగురాక్షసు నొక్కని బంపెను. వాడును అనిందితురాలగు నామెను సర్వావస్థలందును విడువకుండ నుండెను.

ఈమాటలు, సూర్యనమస్కారమంతయు సైరంధ్రి చర్యలేను. అచ్చోట నందఱకు సైరంధ్రీగాంభీర్యమే యపుడు వ్యక్తము కావలసియున్నది. సైరంధ్రి పరిస్థితినంతయు గుర్తించిన సూర్యుడు సైరంధ్రిని గాపాడుటకుగాను నంతర్హితుడగు రక్కసు నొక్కని బంపెను. ద్రౌపదీరక్షణార్థముగా నీరక్కసుడు నియోగింపబడలేదని యిచ్చట గుర్తింపవలసియున్నది.

---

ఫలమూలామిషం శాకం సంస్కృతం య న్మహానసే
చతుర్విధం తదన్నాద్య మక్షయ్యం తే భవిష్యతి. ౬౩
ఇత శ్చతుర్దశే వర్షే భూయో రాజ్య మవాప్స్యసి
వైశంపాయనః-
ఏవ ముక్త్వాతు భగవాం స్తత్రైవాంతరధీయత ౬౪

వనవాసము పదిరెండు వత్సరములు. సూర్యానుగ్రహమున ద్రౌపది బ్రాహ్మణారాధనము ! గావించియున్నది. ఆమె యిపుడు సూర్యుని ముహూర్తకాలము స్మరించి కీచకునింటికి వెళ్లుచున్నది.

తాం మృగీ మివ సంత్రస్తాం దృష్ట్వా కృష్ణాం సమీపగాం
ఉదతిష్ఠ న్ముదా సూతో నావం లబ్ధ్వేవ పారగః ౨౧

(ఆడలేడివలెనే సంత్రస్తయై సమీపమునకు వచ్చి యున్న ద్రౌపదిని జూచి సూతు డొడ్డును చేరువాడు నావను పొందినట్లుగా నిలబడి మోదయుక్తుడాయెను.)

పరిచారికాధర్మము ననుసరించి సైరంధ్రి దైవముపై భారమువేసి కీచకునింటికి పోయినది. ఈయాపదను పాండవులాదినే యూహించినారుగాన ద్రౌపది 'నాస్మి లభ్యా విరాటేన న చాన్యేన కదాచన' అని సుధేష్ణతో బలికియున్నది. కీచకునకు వశ్యముకానట్టి కార్యమును సాధించు ప్రయత్నమందే వారు మెలంగువా రగుచున్నారు.

తాం మృగీ మివ సంత్రస్తాం దృష్ట్వా కృష్ణాం సమీపగాం అని యాశ్లోకమందు జిత్రముగా జెప్పబడినది. 'కృష్ణాం' అనుమాట సాభిప్రాయమైనది. ద్రౌపదికి బెదరు గలుగుటనుగూర్చి యిచ్చట జాగ్రత్తగా రచింపబడినది. వారు కీచకవధ నాదినే నిశ్చయించుకొనియున్న వారగుట నిట్లుగా నిచ్చట లిఖింపబడినదని గమనింపదగును. కీచకునివలన నాపద గల్గునను బెదరుకాదని పర్యవసానము. ఇచ్చట కీచకునిగూర్చి యొడ్డునబడుట నావనుచేరుట యనురెండు విషయములు గలవు. 'నావం లబ్ధ్వేవ' అనునది కీచకున నారెంటను తటస్థించవని సొగసుగా సూచించుచున్నది.

స్వాగతం తే సుకేశాంతే సువ్యుష్టా రజనీ మమ
స్వామినీ త్వ మనుప్రాప్తా ప్రకురుష్వ మమ ప్రియమ్. ౧౬-౨౧

('సుకేశిని! (సుకేశాంతే) నీకు స్వాగతము. ఈరేయి నాకు పండుగదినము. నన్నేలుకొను స్వామినివి వచ్చితివి. పరిపూర్ణముగ బ్రియమొనరింపుము. బంగారపు మాలలు, కుండలము లనేకపట్టణములనుండి తేబడినవి. సిద్ధమై పర్వ బడియున్నవి. సుశోభనమైన మణిరత్నము, వస్త్రములు, పట్టుబట్టలు, అజినములు సిద్ధముగానున్నవి. నీనిమిత్తముగా సిద్ధము చేసియుంచిన దివ్యమైన శయనము గలదు, రమ్ము. నాతోడ మాధవీమధువును సేవింపుము.' ఇట్లు కీచకుడు పలికెను.)

సుధేష్ణాంతఃపురమందు గీచకుడు సైరంధ్రితో తానే స్వయము విరాటరాజ్యమునకు రాజునంచు పలికినాడు. తన వంటి విలాసపురుషుడు భువిని మరిలేడంచు పలికినాడు. తన యంతఃపురమునకు వచ్చియున్న ద్రౌపదినిజూచి కీచకుడు ఘనమైన భోగసంపద గల దనుభవింపుమంచు బలికినాడు. ఆశగొలుపు విషయముగా సుధేష్ణాంతఃపురమందు, నాశదీరువిషయముగా దనయంతఃపురమందు గీచకు డామెను జూచి పలికినాడు.

ద్రౌపదీ—

అపైషీ (ద్రాజపుత్రీ) మాం సురాహారీం తవాంతికం
పాన మాహర మే క్షిప్రం పిపాసా మయి చాబ్రవీత్. ౮

(సురను దేవలసినదని రాజపుత్రి నీదగ్గరకు నన్ను బంపినది. 'వేగ సురను దెమ్ము, దాహము' అని నాతో నామె చెప్పినది—ద్రౌపది కీచకునితో నిట్లు పలికినది.)

కీచకవధను జరిగించి విరాటరాజ్యము నిష్కంటకము గావింపనున్న నాయిక ద్రౌపది కైకేయి పనుపును కీచకునకు దెల్పినది. ఇందలి 'క్షిప్రం' అనుమాట సుధేష్ణయొక్క తొందరను వ్యక్తీకరించునదివోలె నున్నది. 'పిపాసా మయి చాబ్రవీత్' ఈమాటలు సుధేష్ణయొక్క పిపాసావిషయమును, నందున్న కపటమునుగూడ ముక్తసరిగ సాధించుచున్నవి. పలుదినములుగా వాంఛించియున్న, కామనిపీడితుడైన కీచకుడు నిరాతంకముగ నామెయింట జేరినదని సంభ్రమమొంది క్షణమైనతడయ లేనివా డయినాడు.

అన్యాం భద్రే నయిష్యంతి రాజపుత్ర్యాః ప్రతిశ్రుతం
ఇత్యేనాం దక్షిణే పాణౌ సూతపుత్రః పరామృశత్. ౫౧
ద్రౌపదీ—
* యథైవాహం నాభిచరే కదాచిత్
పతీన్మదా ద్వై మనసాభిజాతు

* సైంధవుడు ద్రౌపదిని గొనిపోవు సందర్భమునగూడ నిట్టి శ్లోకములు గలవు.

యథా చాహం నాతిచరే కథంచి
త్పతీన్మహార్హా న్మనసాపి జాతు,
తే నాద్య సత్యేన వశీకృతం త్వాం
ద్రష్టాస్మి పార్థైః పరికృష్యమాణమ్ ఆర ౨౬౭-౨౧
న సంభ్రమం గంతు మహంహి శక్ష్యే
త్వయా నృశంసేన వికృష్యమాణా,

తేనై వ సత్యేన వశీకృతం త్వాం
ద్రష్టాస్మి పాప పరికృష్యమాణమ్. ౬
స తా మభి ప్రేక్ష్య విశాలనేత్రాం
జిఘృక్షమాణః పరిభ ర్త్సయంతీం,
జగ్రాహ తా ముత్తరవస్త్రదేశే
స కీచక స్తాం సహసా క్షిపంతీమ్. ౭

సమాగతాహం హి కురుప్రవీరైః
పున ర్వనం కామ్యక మాగతాస్మి. ౧౨
సా తా నను ప్రేక్ష్య విశాలనేత్రా
జిఘృక్షమాణా నచ భర్త్సయంతీ,
ప్రోవాచ మా మాస్పృశతేతి భీతా
ధౌమ్యం ప్రచుక్రోశ పురోహితం సా. ౧౩
జగ్రాహ తా ముత్తరవస్త్రదేశే
జయద్రథ స్తం సమవాక్షిప త్సా,
తయా సమాక్షిప్తతనుః స పాపః
పపాత శాఖీవ నికృత్తమూలః. ౧౪
ప్రగృహ్యమాణాతు మహాజవేన
ముహు ర్వినిశ్వస్యచ రాజపుత్రీ
సా కృష్యమాణా రథ మారురోహ
ధౌమ్యస్య పాదా వభివాద్య కృష్ణా. ౧౫

| సైంధవుడు | కీచకుడు |
|---|---|
| నాతిచరే కథంచిత్ | నాతిచరే కదాచిత్ |
| పతీ న్మహార్హాన్ | పతీ న్మదార్హ్యా |
| పార్థైః | పార్థ |

ప్రగృహ్యమాణాతు మహాజవేన
ముహు ర్వినిశ్వస్యచ రాజపుత్రీ,
చిక్షేప తం గాఢ మమృష్యమాణా
ప్రవేపమానాఽతిరుషా శుభాంగీ. ౮
తయా సమాక్షి ప్తతను స్సపాపః
పపాత శాఖీవ నికృత్తమూలః ౯
సా గృహీతా విధున్వానా భూమా వాక్షిప్య కీచకం
సభాం శరణ మాగచ్ఛ ద్యత్ర రాజా యుధిష్ఠిరః ౧౧

---

పైరెండు సంఘటనములందు బదములలో నిట్టిసామ్యగలదు. సైంధవుడు బలాత్కరించినపుడు ద్రౌపది సంభ్రమమొందెను. సైంధవునితో 'కామ్యకవనమునకు వచ్చియున్నాను' అని పలికినది.

| సైంధవుడు | కీచకుడు |
| --- | --- |
| ద్రౌపది సైరంధ్రిని జూచి 'నన్ను తాకకుము' అనిపలికి ధౌమ్యునిగూర్చి యాక్రోశించి పలికెను. | తన్ను నిందించుచున్న ద్రౌపదిని జూచి కీచకు డామెపైటకొంగు పట్టిలాగెను. |
| సైంధవుడు ద్రౌపదిచే సమాక్షిప్త తనుఁడైనాడు. | కీచకుడు ద్రౌపదిచే సమాక్షిప్తతను డగుటయే కాదు. పెద్దపాటు పడినాడు. (చిక్షేప తం గాఢమమృష్యమాణా ప్రవేపమానాఽతిరుషా శుభాంగీ. తయా సమాక్షిప్తతనుః) |
| ప్రగృహ్యమాణయు, కృష్యమాణయు నైన ద్రౌపది ధౌమ్యరథము నప్పు డెక్కిపోయెను. | కీచకునిచే ప్రగృహ్యమాణయై, బలవంతముగా వానినినెట్టి భూమిపై బడవేసి రాజైనయుధిష్ఠిరు డున్న సభకు శరణార్థియై ద్రౌపది వచ్చెను. |

('రాజపుత్రి చెప్పినది వేయిమాటలు చేసెదరు' ఇట్లనుచు సూతపుత్రుడామెకుడిచేతిని బట్టికొనెను. అపుడు ద్రౌపది యిట్లు పలికెను. 'ఎట్లుగా నేను మదమునగాని, మనసునగాని యెప్పుడును పతులను నతిక్రమించి నడువలేనో యీసత్యముచే తనే పాపుడ! నన్ను పట్టజూచు నిన్ను వశీకృతమగునటుల జూచెదను. నేను నీకు వశపడుదాననగాను. నీవే నాపాల బడుదువు. ఇట్లు పరిభర్త్సనమొనరించు నా విశాలనేత్రిని జూచి వాడు పట్టదమకించెను. నిందించుచున్నయామె యుత్తరవస్త్రదేశమందు (పైటకొంగును) పట్టుకొనెను. కడువడిని బట్టుకొనబడినదై మఱియు నిట్టూర్పు విడిచి యా రాజపుత్రి వానిని గాఢముగా నెగజిమ్మి యోర్వనిదై గడ గడలాడుచు నతికోపమొందిన దా శుభాంగి. ఆమెచే నెగ జిమ్మబడిన యాపాపాత్ముడు మూలముదెగిన శాఖవలెనే పడిపోయెను. ఆమె పట్టుకొనబడి విదలించుకొని భూమిపై కీచకునిబడవేసి సభకు శరణకై వచ్చెను. ఎక్కడ రాజు యుధిష్ఠిరు డున్నాడో యచ్చటకు వచ్చెను )

ద్రౌపది సమీపమునకు రాగా గీచకుడు చప్పునలేచి నాడు, స్వాగతమనినాడు. పండువమన్నాడు. ఏలుకొను స్వామినివన్నాడు, ఆశగొల్పినాడు, పక్కచూపినాడు, చేయిపట్టినాడు, పైటపట్టుకొనినాడు. ఇట్లుగా గీచకుడు తమక మున తొందరపాటు నొందినాడు. ద్రౌపది తన సత్యప్రవర్త నను పలుకుచు గీచకుని నిందించి తిరస్కరించినది. వానిని

భూమిపై బడవేసి రాజైనయుధిష్ఠిరు డున్న సభకు శరణార్థియై వచ్చినది. సత్యప్రవర్తనవిషయమందు ద్రౌపది సైరంధ్రిగాను, ద్రౌపదిగాను రెండుపర్యాయములుగా పాతివ్రత్య బలము నిట్లు పేర్కొనినది.

## సైరంధ్రివచనము

యథాహ మన్యం భర్తృభ్యో నాభిజానామి కించన
తేన సత్యేన మాం ప్రాప్తాం మా కుర్యా త్కీచకో వశే.

## ద్రౌపదివచనము

* యథైవాహం నాభిచరే కదాచిత్
పతీ న్మదాద్వై మనసాపి జాతు,
తేనైవ సత్యేన వశీకృతం త్వాం
ద్రష్టాస్మి పాప పరికృష్యమాణమ్. ౧౬-౨౬

---

* ద్రౌపది సైంధవునితో 'తే నాద్య సత్యేన వశీకృతం త్వా ద్రష్టాస్మి పార్థైః' అనిపలికినది. కీచకునితో 'తేనైవ సత్యేన వశీకృతం త్వాం ద్రష్టాస్మి పాప!' అని పలికినది.

ద్రౌపదీచారిత్ర్యగాంభీర్యము ఘనమైనది. జూదమునాడు తన్ను దాసిగా జేయదలంచిన కౌరవులకు వశ్యముగాక ద్రౌపది వారినే వశ్యము చేసికొనినది. (అవశులను గావించి మించినది.) ద్రౌపదివేసిన ప్రశ్నకు సమాధాన మీయజాలక కౌరవసభ తికమకయాయెను. రాజ్ఞీ వస్త్రమును తీయించి దాసీవస్త్రమును ద్రౌపదిచే కట్టింపవలెనను కౌరవుల ప్రయత్న మంతయు వమ్మాయెను. కౌరవు లామెకు దాసీవేషము వేయించలేక పోయిరి. దుశ్శాసను డెన్ని వలువలను దీసినను ద్రౌపదిమేన రాజలాంఛనములగు వలువలే నిలుచుచువచ్చినది.

సైరంధ్రియొక్క మాటయందు గీచకుడు వశ్యము చేసికొనజాలడని కలదు. ద్రౌపదియొక్క మాటయందు గీచకుడవశుడగునని కలదు. కీచకపరాభవపూర్వకాత్మరక్షణము గావించికొని యుధిష్ఠిరుడున్న రాజసభకు ద్రౌపది

---

తద్రూప మపరం వస్త్రం ప్రాదురాసీ దనేకశః
నానారాగవిరాగాణి వసనా న్యథవై ప్రభో
ప్రాదుర్భవంతి శతశో ధర్మస్య పరిపాలనాత్. సభా ౬౭-౪౫,౪౬

ధర్మపరిపాలనమున ద్రౌపదిమేన రాజలాంఛనమే నిలిచినందున ద్యూతమంతయు వమ్మైనది. శకుని గెలిచికొనిన పణములన్నియు తిరకాసుగా నైనవి. వస్త్రముతీసినను ద్రౌపది వివస్త్రకాదని ద్రౌపదీ భర్త తెలుంగుదురు. కావుననే దుశ్శాసనుడు ద్రౌపదివస్త్రము లాగినపుడు పాండవులుపేక్షించియుండిరి. ద్రౌపదియొక్క జన్మసందర్భ మట్టిది. ద్రౌపది యగ్నిహోత్రమునుండి నిత్యయౌవనముగా సవస్త్రయై యున్నదని, జన్మప్రభృతి సవస్త్ర పావకాత్మజ ద్రౌపది యని గ్రహింపదగును.

ఉత్తస్థౌ పావకాత్తస్మా త్కుమారో దేవసన్నిభః
జ్వాలావర్ణో ఘోరరూపః కిరీటీ వర్మచోత్తమమ్. ఆది ౧౬౭-౪౦
బిభ్ర త్సఖడ్గ స్సశరో ధనుష్మా న్వినదన్ ముహుః
సోఽధ్యారోహ ద్రథవరం తేన చ ప్రయయౌ తదా. ౪౧

... ... ... ...

రాజ్ఞశ్శోకాపహోజాత ఏష ద్రోణవధాయవై
ఇత్యువాచ మహాద్భూత మదృశ్యం ఖేచరం తదా. ౪౪
కుమారీ చాపి పాంచాలీ వేదిమధ్యా త్సముత్థితా
సుభగా దర్శనీయాంగీ స్వసితాయతలోచనా. ౪౫
శ్యామా పద్మపలాశాక్షీ నీలకుంచితమూర్ధజా
తామ్రతుంగనఖీ సుభ్రూ శ్చారుపీనపయోధరా. ౪౬

శరణార్థియై వచ్చెను. విరాటసభ కట్లుపోవుచున్న ద్రౌపదిని వెన్నాడి కీచకు డామె జుత్తుపట్టి పడవేసెను. ద్రౌపదిచే పాటునొందియు నామెను బలాత్కారముగా జయద్రథుడు తనరథమెక్కించికొనినట్లు కీచకు డామెనువెంటాడి పరాభవ మొనరించెను. వేటనిమిత్తము వెడలియున్న పాండవులు జయద్రథుని సంరంభమును తెలిసి వానిని శిక్షించి ద్రౌపదిని విడిపించిరి అజ్ఞాతవాసమందున్న పాండవు లిపుడు (సభాముఖ

---

మానుషం విగ్రహం కృత్వా సాక్షా దమరవర్ణినీ
నీలోత్పలసమో గంధో యస్యాః క్రోశాత్ ప్రధావతి. ४६
యా బిభర్తి పరం రూపం యస్యా నాస్త్యుపమా భువి
దేవదానవయక్షాణా మీప్సితాం దేవవర్ణినీమ్. ४७
తాం చాపి జాతాం సుశ్రోణీం వాగువా చాశరీరిణీ
సర్వయోషిద్వరా కృష్ణా నినీషుః క్షత్రియాన్ క్షయమ్. ४८
సురకార్య మియం కాలే కరిష్యతి సుమధ్యమా
యస్యా హేతోః కౌరవాణాం మహ దుత్పత్స్యతే భయమ్ ५०

'కుమారః కుమారీ' అనుమాటలు ధృష్టద్యుమ్న ద్రౌపదులిద్దరు నిత్యయౌవనులని తెల్పుచున్నవి. కవచము, ధనుర్బాణములతో బుట్టిన ధృష్టద్యుమ్నుడు వస్త్రసహితముగా నుద్భవించెనని పైశ్లోకములు తెల్పుచున్నవి. 'వేదీమధ్యాత్సముత్థితా, తామ్రతుంగనఖీ సుభ్రూః శ్చారుపీన పయోధరా, మానుషం విగ్రహం కృత్వా' అనునవి నవస్త్రిగా ద్రౌపది యుద్భవించినదని తెల్పుచున్నవి. గంభీరహృదయుడగు యుధిష్ఠిరుడు దూతసమయమందు ద్రౌపది కిట్లుగా వస్త్రహీన మంపినాడు.

ఏకవస్త్రా త్వధో నీవీ రోదమానా రజస్వలా
సభా మాగమ్య పాంచాలి శ్వశుర స్యాగ్రతో భవ. సభా. ౭౭-౧౯

మున) కీచకుని శిక్షించువారు కాజాలరు. ధర్మజభీము లచ్చట నేయున్నను ముందుకు రాజాలనివారయిరి. వనవాసమపుడు ధర్మజుడు, అజ్ఞాతవాసమపుడు ద్రౌపది సూర్యునారాధించినారు. ద్రౌపది పట్టినది అక్షయమగునంచు సూర్యుడపుడు వరమొసంగి నాడు. సైరంధ్రిగా ప్రవర్తించు ద్రౌపదిని సూర్యు డిపుడు కాపాడువాడగుచున్నాడు. సైరంధ్రిగా ద్రౌపది సూర్యుని ముహూర్తకాల ముపాసించినది. (ఉపాతిష్ఠత సా సూర్య మబలా తతః)

కీచకు నంతఃపురమున గీచకునిజడవేసి వేవేగ సభా ముఖమునకు ద్రౌపదివచ్చినది. ఇచ్చోట, సూర్యనియోజితు డగు రక్కసుని పనియేమియు లేదు. ద్రౌపదియే యాయాప దను గడచి సభాముఖమునకు వచ్చినది. సభాముఖమున సైరంధ్రీ రక్షణభారమపుడు సూర్యనియోజితుడగు రక్కసు నం దేర్పడినది. ప్రచ్ఛన్నచారులై యుండి సైరంధ్రి నామె భర్తలు గంధర్వులు కాపాడుదురనుమాటను పురస్కరించు కొని యిపుడు రక్కసుడు గీచకుని డొల్లవేసెను. సూర్యు

సభకుదెప్పించి ద్రౌతదిని వివస్త్రను గావించ ప్రయత్నమున గౌర పులున్నారని గ్రహించియే 'ఏకవస్త్రా' అని సాభిప్రాయుడై ధర్మజుడు ద్రౌపదికి వర్తమానమంపినాడని యీ శ్లోకములు స్పష్టముగావించు చున్నవి. నిండుసభయందు (కౌరవసభయందు) పరావమానపూర్వ కాత్మ రక్షణ మాచరించియున్న దిట్ట ద్రౌపది, యిపుడును కీచకపరాభవ పూర్వ కాత్మరక్షణము గావించుకొని (కీచకుని తానే పడవేసి) యుధిష్ఠిరుడున్న సభకు శరణార్థియై వచ్చెను.

డీపరిస్థితినంతయు గమనించియే రక్కసుని అంతర్హితునిగా నియోగించియున్నాడు.

తస్యా యోసౌ తదార్కేణ రాక్షస స్సన్నియోజితః
స కీచక మపోవాహ వాతవేగేన భారత. ౧౬-౧౨
స పపాత తదా భూమౌ రక్షోబల సమాహతః,
విఘూర్ణమానో నిశ్చేష్ట శ్ఛిన్నమూల ఇవ ద్రుమః.౧౩

(ఆ మెనిమిత్తము సూర్యనియోజితుడైన రాక్షసు డపుడు వాయువేగమున గీచకుని బడవేసెను. వాడు రక్షో బలసమాహతుడై నేలమీాద పడిపోయెను. విఘూర్ణమానుడై నిశ్చేష్టుడై, ఛిన్నమూలమగు దుృమమట్లు కీచకుడు నేలపై పడిపోయెను.)

సూర్యనియోజితుడగు రక్కసు డిట్లు సైరంధ్రిరక్షణ మాచరించెను. ఉత్తమస్త్రీ గాంభీర్య మిట్లు గాపాడబడినది. ఇపుడు కీచకునిపరిస్థితి యద్ధ్వాన్నమైనది. ఇంట దగిలిన దెబ్బకే కీచకుడు భూమిమీాద పడిపోయెను. విరాటసభాముఖమునగూడ వేలుమనిషి లేనందున నాదెబ్బయు సైరంధ్రి వలననే తగిలినదని కీచకుడు తలంపవలసియున్నది. సభాముఖమునందు వాయువేగమున రక్కసుడు డొల్లవేసినపాటు చాలాగాటుగా గీచకునందు బరిణమించినది. విఘూర్ణమానుడు, నిశ్చేష్టుడు నైనాడు కీచకుడు.

పపాత శాఖీవ నికృత్తమూలః. గృహమున గీచకుడు శాఖవలెనే పడినాడు.

విఘూర్ణమానో నిశ్చేష్ట శ్ఛిన్నమూల ఇవ ద్రుమః.
సభాముఖమున ద్రుమమట్లు పడినాడు. తమకముడిగి కీచకు డీపై జంకిపోవలసి వచ్చినదను నంతరార్థ మిచ్చోట సూచింపబడినది. ఇంకను దమకించి ముందుకుబోయిన నిం కెంతటి పరాభవ మేర్పడునోయనుపరిస్థితి యపుడేర్పడినది. ఆ మేస్త్రీ, దాసి-కీచకు డిట్టి విచిత్రపరిస్థితిలో బడిపోయినాడు. కవియు జిత్రముగా గీచకు నిట్లధ్యాసన్నమునబడవేసి మఱి వాని పికరు సభయందు గల్గింపలేదు. మఱునాడు మరల కీచకుడు తమకించుటయేకాని యపుడు మఱివాని పికరు లేదు. కీచకు డిట్టిదెబ్బకు శాల్పడినాడని చమత్కారము.

తాం చాసీనౌ దదృశతు ర్భీమసేన యుధిష్ఠిరౌ
అమృష్యమాణౌ కృష్ణాయాః కీచకేన పరాభవమ్. ౧౮

(ఆసభయందుండిన భీమసేనయుధిష్ఠిరులు కీచకుని వలన ద్రౌపదికిగల్గిన పరాభవమునుజూచి యోర్వలేని వారైరి)

ధర్మరాజు, వృకోదరుడు అను పదములుకాక భీమ సేన యుధిష్ఠిరులని చెప్పబడుట గమనింపదగినది. భీమసేనుడు చూచినాడు, యుధిష్ఠిరుడు చూచినాడాయసహ్యపరా భవము నని యీపదములు వ్యక్తీకరించుచున్నవి. ఈ రెండు పదములు సహజముగను, సమయోపయోగముగనుగూడ నున్నవి. యుధిష్ఠిరునికంటె భీమసేను డిచ్చట ముందుగా జెప్పబడుట మఱియొక విశేషమై యున్నది.

తస్య భీమో వధం ప్రేప్సుః కీచకస్య దురాత్మనః
దంతై ర్దంతాం స్తదా రోషా న్నిష్పిపేష మహామనాః
ధూమచ్ఛాయా మభజతాం నేత్రే చోచ్ఛ్రిత పక్ష్మణీ
సస్వేదా భ్రుకుటీ చోగ్రా లలాటే సమవర్తత ౧౬
హస్తేన మమృదే చైవ లలాటం పరవీరహా
భూయశ్చ త్వరితః క్రుద్ధస్సహసోత్థాతు మైచ్ఛత ౧౭

(దురాత్ముడగు కీచకుని వధనుగోరి భీముడు పండ్లు పటపట కొఱికెను. అతనికంటిరెప్ప లుబ్బి కన్నులెఱ్ఱబారినవి, కోపము ధూమచ్ఛాయ నొందినది. చెమటపట్టి యుగ్రముగు బొమముడి నొసటగల్గినది. పరవీరహంతయగు భీముడాలలాటమును దుడిచికొనెను. గబాలున నెగిరిపడుట కిచ్ఛయించెను.)

'భూయశ్చ త్వరితః క్రుద్ధ స్సహ సోత్థాతు మైచ్ఛత' అని యిచ్చట గలదు. ఇందలి ప్రతిపదము భీముని కోప వేగము నంతకంతకు వ్యక్తీకరించుచున్నవి. 'ఐచ్ఛత' అను చివరనున్నమాట భీముని సత్వభావమును పోషించుచున్నది. తటాలున నెగిరిపోవ నిశ్చయించినాడే కాని భీముడు లేచిపో లేదని యీమాట వివరించుచున్నది. అదియే భీమునం దున్న (పాండవునియందున్న) గంభీరత. ధర్మరాజు డిపుడు తటాలున భీముని నివారింపవలసి వచ్చినది.

అథావమృద్నాదంగుష్ఠ మంగుష్ఠేన యుధిష్ఠిరః
ప్రబోధనభయా ద్రాజా భీమం తం ప్రత్యషేధయత్. ౧౮

తేం మ త్త మివ మాతంగం వీక్షమాణాం వనస్పతిం
స త మావారయామాస భీమసేనం యుధిష్ఠిరః. ౧౯
ఆలోకయసి కిం వృక్షం సూద దారుకృతేనవై
యది తే దారుభిః కృత్యం బహి ర్వ్రృక్షా
న్నిగృహ్యతామ్. ౨౦

(ఆయవసరమున మొదట యుధిష్ఠిరు డంగుష్ఠము నంగుష్ఠమున గీచి ప్రబోధనభయమున, భీముని నివారించినాడు. మదించిన గజేంద్రునట్లు వృక్షమును వీక్షించుచున్న యా భీమసేనుని యుధిష్ఠిరుడు వారించెను. 'సూదుడా! కట్టెలకుగాను చెట్టును చూచుచుంటివా! నీకు దారువులతో బనియున్న బైనున్న చెట్లను గ్రహింపుము' అని ధర్మజుడు వారించెను.)

మాటపలుకుటకును దడవులేని యారభససమయమున ధర్మరాజు మొదట చేష్టచే భీముని వెనుకాడించి యాపిమ్మట మాటచే వారించుచున్నాడని గ్రహింపవలెను.

* హ స్తేన మమృదే చైవ లలా
టం పరవీరహా ఇది భీముని రభసము
అథాంగుష్ఠమమృద్నా దంగుష్ఠ మంగుష్ఠేన
యుధిష్ఠిరః ఇది ధర్మజుని ప్రతిక్రి

---

* స స్వేదా భ్రుకుటీ చోగ్రా లలాటే సమవర్తత. ఇది భీముని పరిస్థితి. యుధిష్ఠిరస్య కోపాత్తు లలాటే స్వేద ఆగమత్. ఇది ధర్మజుని పరిస్థితి. భీమసంరంభము నిది యెక్కువగా జూపుచున్నది.

భూయశ్చ త్వరితః క్రుద్ధ స్సహసో
త్థాతు మైచ్ఛత ఇది భీమసంరంభము
ప్రబోధనభయా దాజా భీమం తం
ప్రత్యషేధయత్ ఇది ధర్మరాజు నివారణము

కోపోద్రేకమపుడు భీముడు చెట్టునుజూచుట తటస్థించును. దాని నజ్ఞాతవాసమున గప్పిపుచ్చుటకై భీముడొక యుపాయము పన్నెను. 'నీ వేమి గావించుచు విరాటునొద్ద నుందువు' అని ధర్మరాజుడడిగినపుడు భీముడు 'వల్లవుడను పేరుతో వంటవాడుగా, మల్లుడుగా విరాటునొద్ద నుందును' అని చెప్పి మఱియు నిట్లనినాడు.

ఆహరిష్యామి దారూణాం నిచయా న్మహతోపిచ ౨-౩
యత్ ప్రేక్ష్య విపులం కర్మ రాజా సంయోక్ష్యతే సమాం
అమానుషాణి కుర్వాణ స్తాని కర్మాణి భారత ౪

(పెద్దపెద్దదారువులను పెద్దమోపుగా గట్టితెచ్చెదను. ఏవిపులమగు కర్మను తిలకించి రాజు నన్నమానుషకార్య ప్రవర్తకుని గావింప నిచ్ఛయించునో యట్లుగావించెదను.)

చెట్లనువిఱుచుట సూదునకు నిత్యకృత్యమై యున్నది. కావుననే ధర్మరాజుడు చమత్కారముగా 'బహిర్వృక్షా న్నిగృహ్యతామ్' అని పలికినాడు. రాజాస్థానమందున్న వృక్షము పెకలింప వద్దంచు ధర్మరాజుడు భీముని వారించినాడని భావము. ఇక్కడనున్న 'వృక్షాన్' అను బహువచనము మఱియు రసవంతముగా నున్నది. కీచకోపకీచకులవధ నిది సూచించుచున్నది. కీచకుడు పెద్దపాటులో నున్నాడు

సైరంధ్రి గొప్పసంకటములో నున్నది. రాజు, సభ్యులు సంక్షుభితులై యున్నారు. ఈ రభససమయములో నెవరికి దేనియందును పట్టుతగులదు. ఆగొడవలో సన్నసన్నగా సభాస్తారు డీమాట సూదునితో బలికినాడు కావుననే 'స త మా వారయామాస' అని చిత్రముగ చెప్పబడినది. ఇది భీమనివారణమందలి ధర్మజుని జాగరూకతను వెల్లడించు చున్నది. ఇట్లుగా ధర్మజు డీసంకటపరిస్థితినుండి మెలకువగా దప్పుకొనినాడు, వంటవాని నిత్యకృత్యవిషయక ప్రస్తావనగా దీనినిమార్చి సంకటపరిస్థితిని దప్పించినాడు.

సా సభా ద్వార మాసాద్య రుదతీ మత్స్య మబ్రవీత్
అవేక్షమాణా సుశ్రోణీ పతీం స్తాన్ దీనచేతసః ౧౬-౨౧
ఆకార మభిరక్షంతీ ప్రతిజ్ఞాం ధర్మసంహితాం
దహ్యమానేన రౌద్రేణ చక్షుషా ద్రుపదాత్మజా ౨౨

ద్రౌ ప ది —

౧ యేషాం వైరీ న స్వపితి షష్ఠేపి విషయే వసన్
తేషాం మాం మానినీం భార్యాం సూతపుత్రః
పదాఽవధీత్ ౨౩

౨ యే దద్యు ర్నచ యాచేయు ర్బ్రహ్మణ్యాః సత్యవాదినః
తేషాం మాం మానినీంభార్యాంసూతపుత్రఃపదాఽవధీత్
౩ యేషాం దుందుభినిర్ఘోషో జ్యాఘోషః శ్రూయతేఽనిశం
తేషాం మాం మానినీం భార్యాం సూతపుత్రః పదాఽ
వధీత్. ౨౪

ర యేచ తేజస్వినో దాంతా బలవంతో ఽతిమానినః,
తేషాం మాం మానినీం భార్యాం సూతపుత్రః పదాఽ
వధీత్. ౨౬

శ్రీ. సర్వలోక మిమం హన్యు ర్ధర్మపాశా స్థితా స్తు యే
తేషాం మాం మానినీం భార్యాం సూతపుత్రః పదాఽ
వధీత్. ౨౭

శరణం యే ప్రపన్నానాం భవంతి శరణార్థినాం
చరంతి లోకే ప్రచ్ఛన్నాః క్వను తేద్య మహారథాః ౨౮
కథం తే సూతపుత్రేణ వధ్యమానాం ప్రియాం సతీం
మర్షయంతి యథా క్లీబా బలవంతో ఽమితౌజసః. ౨౯
క్వను తేషా మమర్షశ్చ వీర్యం తేజశ్చ వర్తతే
న పరీప్సంతి యే భార్యాం వధ్యమానాం దురాత్మనా.
మయాతు శక్యం కిం కర్తుం విరాటే ధర్మదూషకే
యః పశ్య న్మాం మర్షయతి వధ్యమానా మనాగసమ్ 3౦
స రాజా రాజవ త్కించి త్సమాచరతి కీచకే
దస్యూనా మివ ధర్మ స్తే నహి సంసది శోభతే 3౨
• నాహం మే తేన యుక్తా వై హంతుం మత్స్య తవాంతికే
సభాసదశ్చ పశ్యంతు కీచకస్య వ్యతిక్రమమ్ 33
కీచకో నచ ధర్మజ్ఞో నచ మత్స్యః కథంచన
సభాసదో ప్యధర్మజ్ఞా య ఏవం పర్యుపాసతే 3౪

• విరాటరాజునందు భావము నిది సూచించుచున్నది.

వైశంపాయనః—

ఏవం విధై ర్వచోభి స్సా తదా కృష్ణాఽశ్రులోచనా
ఉపాలభత రాజానం మత్స్యానాం వరవర్ణినీ 3౫

(ఆమె సభాద్వారమునుచేరి యేడ్చుచు విరాటుని గూర్చి మాటాడెను. దీనచేతస్కయై పతులను జూచుచు నాసుశ్రోణి యిట్లుపలికెను. ధర్మసంహితమైన ప్రతిజ్ఞ నాకారము నభిరక్షించుచు దహ్యమానరౌద్రచక్షుస్సు గల్గి ద్రౌపది యిట్లు పలికెను. 'ఎవరివైరి యాజీవదేశమున నున్నను నిదురబోవరో వారియొక్క మాననీయురాలగు భార్యను నన్ను సూతపుత్రుడు కాలితో దన్నెను (౧). ఎవరిచ్చువారలో యాచింపరో బ్రహ్మణ్యులు సత్యవాదులు నగు వారి మాననీయ భార్యను నన్ను సూతుడు కాలదన్నెను (౨). ఎవరి జ్యాఘోష దుందుభినిర్ఘోష యట్లనిశము వినంబడునో వారి మాననీయభార్యను నన్ను సూతపుత్రుడు కాలదన్నెను (౩). ఎవరు తేజోవంతులు దాంతులు బలవంతు లతిమాన్యులో వారి మాననీయభార్యను నన్ను సూతపుత్రుడు కాలదన్నెను (౪). ఈసర్వలోకము హతము గావింపగలవారో ధర్మపాశమున నున్నవారో వారి మాననీయనగుభార్యను నన్ను సూతపుత్రుడు కాలితో దన్నెను (౫). శరణన్న శరణార్థుల • గాపాడువారగు లోకమందు ప్రచ్ఛన్నముగా జరించు నామహారథు లిపుడెచటనున్నారో. సూతపుత్రునిచే వధ్యమానయగు బ్రియసతిని క్లీబులవలె

ట్లుగా వారోర్చియున్నారో, బలవంతులమితౌజస్కులు వారు. వారి రోషము (అమర్షశ్చ) వీర్యము తేజమెటవర్తించి యున్నదో, దురాత్మునిచే వధ్యమానయగు భార్యను గాంచ లేదు, వార లెటవర్తించుచున్నారో. విరాటునందు ధర్మ దూషకత్వము వర్తింపగా నాచే నేమి చేయ శక్యమగును. నిరపరాధిని వధ్యమాన నగు నన్నుజూచుచు సహించి యున్నవాడగుట నేమిగావింపవచ్చును. రాజు (నెదుట) రాజునట్లు కీచకు డల్పమాచరించియుండగా (కించి త్సమాచరతి) దస్యులట్లయిన యీసభయందు ధర్మము శోభింపలేదు. రాజా! నీసమక్షమున నేనిట్లు పరిభవింపబడుచుంటిని. నేనట్లు కాకూడదుకదా. కీచకుని వ్యతిక్రమమును సభాసదులు చూచెదరుగాక. కీచకుడు ధర్మజ్ఞుడు కాడు. ఎట్లును విరాటుడును కాదు. వానినే పర్యుపాసించు సభాసదులును నధర్మజ్ఞులే. వైశంపాయను డిట్లనెను- ఇట్టివిధములగు వచనములు పలుకుచు ద్రౌపది గన్నీరుగల్గి రాజును, మాత్స్యులను నుపాలంభించెను.)

సభకు ద్రౌపదివచ్చి భర్తలనుజూచుచు భర్తలను గూర్చి ప్రసంగించినది. ఆమె తత్కాలమున జేయదగినదదియే. పర్యవసానమున సభలోని వారు పలుకునట్లును, నందుమూలమున ధర్మజుడు ధర్మవిధాన మేర్పఱచునట్లును ద్రౌపది పరిస్థితిని యేర్పఱచినది. 'ఆతనినే యుపాసించుచు కర్తవ్య మొనరింపకపోయిన సభాసదులును అధర్మజ్ఞులే

యగుదురు, అని యామె తనమాటలు ముగించినది. ధర్మజ భీమసేనులు కర్తవ్యమెఱింగువారు కావలసినదనియు వారు అధర్మజ్ఞులు కారనియు నభిప్రాయము. కావుననే తదనంతరము 'ఉపాలభత రాజానం మత్స్యానాం వరవర్ణినీ' అని కవివాక్యము చెప్పబడినది. ఆమె భర్తలను ఉపాలంభించలేదని పర్యవసానముననున్న యభిప్రాయము. విరాటుడు, ధర్మజుడు ప్రసంగించుపరిస్థితి యిట్లేర్పడగా నప్పుడు విరాటు డిట్లు పలికెను.

పరోక్షం నాభిజానామి విగ్రహం యువయో రహం
అర్థతత్త్వ మవిజ్ఞాయ కిన్నుస్యా త్కౌశలం మమ 38
తతస్తు సభ్యా విజ్ఞాయ కృష్ణాం భూయోఽభ్యపూజయన్
సాధుసాధ్వితి చాప్యాహుః కీచకంచ వ్యగర్హయన్ 39

(మీయిద్దఱియొక్క విగ్రహము పరోక్షము. విజ్ఞాతమగుట లేదు. అర్థతత్త్వ మెఱుగనిది తీర్పుపలుకుట కెట్లు నాకగును.' అని విరాటుడు పలికెను. అపుడు సభ్యులు ద్రౌపదినిశ్లాఘించి సాధువాక్యములు పలికిరి. కీచకుని గర్హించిరి.)

విరాటునినోట చిత్రముగా 'పరోక్షం' అను మాట వెలువడినది. తనయందు విపరీతముగా ప్రవర్తించువాడు పరాంతనువు నొందువాడగుననియు ప్రచ్ఛన్నులుగా నుండిన తనాప్తగంధర్వపతులు గాపాడెదరనియు-అనగా వానిని గంధర్వపతులు తుదముట్టించెదరనియు - యిట్టి కట్టడి ద్రౌపది యాదియందే కావించియున్నది. (౯- 35, 36) విరాట

సభయందు, సైరంధ్రి కీచకుని వ్యతిక్రమమును చెప్పినది కాని కీచకుడు మాటాడు పరిస్థితియందపుడుండలేదు (విఘూర్ణమానః నిశ్చేష్టః - ఇట్లున్నాడు) అర్థతత్త్వకుశలుడుగాని విరాటుడు పలికిన పరోక్షమనుమాట వలన నీకలహనిర్ణయము విచిత్రముగా బరోక్షమునకు బోయినది. రాజసభయందేర్పడిన యీరాజవచనము పరోక్షనిర్ణయానుకూలమైనది. అప్పుడు సభ్యులు ద్రౌపదిని శ్లాఘించి కీచకుని గర్హించిరి. ఇదిసమయముగా సభ్యుడుగానున్న ధర్మజుడు మాటాడు పరిస్థితి యేర్పడినది. 'సీ కప్రియముగ వర్తించువానిని వధించెదను, నాయట్లు కంకుడును రాజ్యమునకు ప్రభువే' యని విరాటుడు ధర్మజుని ప్రవేశసందర్భమున బలికియున్నాడు. (౭—౧౮) ఇట్లుగా ద్రౌపదీధర్మజు లజ్ఞాతవాసములో ప్రవేశించుసమయముననే కీచకవధ నిర్ణయమైయుండి యిపుడది విరాటునాస్థానమందు నిర్ణయమగుపరిస్థితి యేర్పడినది. అపుడు ధర్మజు డిట్లుపలికెను.

ఏవం సంపూజయంత స్తే కృష్ణాం ప్రేక్ష్య సభాసదః
యుధిష్ఠిరస్య కోపాత్తు లలాటే స్వేద ఆగమత్. ౪౦
అథాఽబ్రవీ ద్రాజపుత్రీం కౌరవ్యో మహిషీం ప్రియాం
గచ్ఛ సైరంధ్రి మాఽత్ర త్వం స్థాః సుదేష్ణాయా నివేశనమ్.
భర్తార మనురుధ్యంత్యః క్లిశ్యంతే వీరపత్నయః
శుశ్రూషయా క్లిశ్యమానాః పతిలోకం జయంత్యుత॥

* మన్యే న కాలం క్రోధస్య పశ్యంతి పతయ స్తవ
తేన త్వాం నాభిధావంతి గంధర్వాః సూర్యవర్చసః ౪౩
అకాలజ్ఞాసి సైరంధ్రి శైలూషీవ విరోదిషి
విఘ్నం కరోషి మత్స్యానాం దీవ్యతాం రాజసంసది౪౪
♦ గచ్ఛ సైరంధ్రి గంధర్వాః కరిష్యంతి తవ ప్రియం
వ్యపనేష్యంతి తే దుఃఖం యేన తే విప్రియం కృతమ్౪౫

(సభ్యు లిట్లు ద్రౌపదిని ప్రశంసించుచుండుటను గాంచిన యుధిష్ఠిరునకు గోపమున నుదుట జెమటపట్టినది. ఆరాజ పుత్రితో, మహిషితో, ప్రియురాలితో నాత డిట్లనెను. 'సైరంధ్రి! నీవిట నుండవలదు. సుధేష్ణనివేశమునకు వెడలి పొమ్ము. భర్తననుసరించు వీరపత్నులు క్లేశమొందు చుందురు శుశ్రూషచే క్లిశ్యమానలయ్యు పతిలోకమును జయింతురు. ఇపుడు క్రోధమునకు కాలముకాదంచు నీపతులు తలంచిరని తలంతును. కావుననే సూర్యవర్చస్కులగు గంధర్వులు నిన్నుగూర్చి పరుగునరాలేదు. అకాలజ్ఞురాలవగుచున్నావు -ఉచితముకాని కాలమును గ్రహించియున్నావు-సైరంధ్రి! శైలూషివలెనే విరోదించుచున్నదానవు,

* ఇందలి 'పతయః' అనునది పాండవులను నిర్దేశించుచున్నది. గంధర్వాః అనునది గంధర్వపతులను నిర్దేశించుచున్నది.

♦ గంధర్వాః కరిష్యంతి తవప్రియం అని ధర్మజుడు పలికినాడు. గంధర్వ రక్షితయగు నామె కపుడు ప్రకటింపదగు మాట ధర్మజుడు పలికినాడు.

రాజసభలో క్రీడాసక్తులగు మత్స్యరాజులకు విఘ్న మొన రించుచున్న దానవు. వెడలిపొమ్ము. సైరంధ్రి! గంధర్వులు నీకు ప్రియము గావించెదరు. నీ దుఃఖమును దొలిగించెదరు. ఏ హేతువున (ఎవనిచేత) నీ కీ విప్రియము చేయబడినదో- నీదుఃఖమును బోగొట్టెదరు' అని పలికెను.)

సైరంధ్రిపరిస్థితినిజూచి విరాటుడు విచిత్రముపలికి నాడు. సభ్యులు సైరంధ్రిని, గంధర్వపతులను శ్లాఘించు చుండిరి. ఈ పరిస్థితి ధర్మజునకు దుర్భరవేదననుగల్గించి నుదుట చెమటపట్టినది. 'అథాబ్రవీ ద్రాజపుత్రీం కౌరవ్యో మహిషీం ప్రియాం' అనుపాద మాజగత్సార్వభౌముడట్లు ప్రియమహిషిని గాంచుటయందలి దుర్భరవేదనను వ్యక్తీక రించుచున్నది. కావున తత్పరిస్థితినిగూర్చి పలుకుటకుముందే 'సుధేష్ణ సదనముకు వెడలిపొమ్ము' అని యాతడు ద్రౌపదిని గూర్చి పలికినాడు. ధర్మజు డిట్లనుచు పతివ్రతలచారిత్ర గాంభీర్యమును (దృఢశీల గరిమను) విస్తరించుచు 'గంధర్వ పతుల కదె కోపమునకు కాలముకాదు' అని పలికినాడు, అనగా కీచకవధ కది యదనుకాదని సూచించినాడు, కావు ననే 'అకాలజ్ఞాసి' అని చిత్రముగా బలికినాడు. సమయ మెఱుంగని దానవని కాదు దీని యర్థము, 'అకాలమును గ్రహించియున్నదానవు' అని దీని భావము. ఇట్లు పలుకు చునే వక్తవ్యవచనము 'గంధర్వులు నీకు ప్రియ మొనరించె దరు' అనుమాట ధర్మజుడు వచించినాడు.

ధర్మరాజు డిపుడు సేవకధర్మములో నున్నాడు. తన పలుకాహద్దును దాటిపోరాదు. 'రాజబంధువు, సేనానాయకుడు నగు గీచకుని సంహరింతురు' అని యట్టివాడు పలుకుట యుచితముకాదు. అందుచేత కంకుడుగానున్న ధర్మరాజుడు 'గంధర్వులు నీకు ప్రియము గల్గింతురు, నీదుఃఖమును పోగొట్టెదరు' అని మాత్రమే పలికి తదనంతర ప్రమేయము 'యేన తే విప్రియం కృతం' అని సొగసుగా ముగించినాడు. 'యేన' అనునది 'ఎవనివలన, ఏహేతువున' అను రెండర్థములను సృజించుచు నీఘట్టమును రసవంత మొనరించుచున్నది. 'చంపుట' యనున దిందంతర్యాభతమే కాని పైకి యామాట లేదని యభిప్రాయము. ఉచ్చారణయం దప్రాధాన్యమును, కార్య సాధనమందు ప్రాధాన్యమును ఈప్రమేయము సమర్థించుచున్నది.

'పరోక్షం నాభిజానామి' అను విరాటునిమాట నూతగా దీసికొని యపర విరాటునట్లు విరాటసభయందున్న కంకుడు (ధర్మరాజుడు) ఇట్లు నిర్ణయము పలికినాడు. కాగా నిది విరాటుని తీర్పుగా నేర్పడుచు రహస్యమందు జంపబడు కీచకుడు బహిరంగముగా జంపబడువాడే యగుచున్నాడు. కీచక దండనము రాజసభయందే నిర్ణయమైనదని పర్యవసానము.

తామాహి మాం పురుషో గృధ్యే ద్యథాన్యాః ప్రాకృతాః స్త్రియః
తా మేవ నివసే ద్రాత్రిం ప్రవిశ్యచ పరాం తనుమ్—3౫

దుఃఖశీలాహి గంధర్వా స్తే చ మే బలవత్ప్రియాః
ప్రచ్ఛన్నాశ్చాపి రక్షంతి తే మాం నిత్యం శుచిస్మితే
గచ్ఛసైరంధ్రి గంధర్వాః కరిష్యంతి తవ ప్రియం
వ్యపనేష్యంతి తే దుఃఖం యేన తే విప్రియం కృతమ్,

ఈ ద్రౌపదీ ధర్మరాజుల వచనములందు కీచకవధ సూచితమగుచున్నది. ఇది వారి హృదయగాంభీర్యమును వ్యక్తీకరించుచున్నది. విధివశమున నీపర్యవసాన మేర్పడ గలదను నుదారవిషయ మిందెంతయేని యొప్పియున్నది. 'ఆకార మభిరక్షంతీ ప్రతిజ్ఞాం ధర్మసంహితాం' అని ద్రౌప దినిగూర్చి చెప్పబడినది. (౧౩–౨౨) అజ్ఞాతవాసవిషయ ప్రాధాన్యత ద్రౌపదీ ధర్మరాజులం దెంత యొప్పియున్నదియు నీఘట్టము సువ్యక్తము గావించుచున్నది. ధర్మజుడు తన ప్రసంగమున నాద్యంతములందు 'గచ్ఛసైరంధ్రి' అని పలికి యున్నాడు.

ధర్మజునిచే రాజసభలో కీచకదండనము ప్రకటించుట యేర్పడినదిగాన * ద్రౌపది కిదిసమాధానమైనది. ఇంక నామెసైరంధ్రిగా గంకు నుద్దేశించి యిట్లు పలుకుచున్నది.

* విరాటపౌరులు పలుకరించునపుడు 'సా తా నువాచ' (ఆమె వారితో నిట్లనెను) అని ద్రౌపదినిగూర్చి చెప్పబడినది. (౯. ౯) సుధేష్ణ నీవెవరని యడిగినపుడు ద్రౌపదిగా నామె సమాధానమొసంగినది (౯ అధ్యాయము)

సైరంధ్రీ —

అతీవ తేషాం ఘృణినా మద్దేహం ధర్మచారిణీ
తస్యత్సైవ తే వధ్యా యేషాం జ్యేష్ఠోఽత్ర దేవితా.

కీచకుడు నీ వెవరవని యడుగుచు దన యభిలాషను వ్యక్తీకరించు నపుడామె 'వలదు కూడదు' అని ద్రౌపదిగా బలుకుపలికినది. (౧౪-౧౨-౩౯) ద్రౌపదియొక్క యీమాటలను కీచకుడు సైరంధ్రివచనములుగా వినుట యైనది.

ఏవ ముక్తస్తు సైరంధ్ర్యా కీచకః కామమోహితః
జానన్నపి సుదుర్బుద్ధిః పరదారాఽభిమర్శనే ౧౪–౩౯
దోషాన్ బహూన్ ప్రాణహరాన్ సర్వలోకవిగర్హితాన్
ప్రోవా చేదం సుదుర్బుద్ధి ర్ద్రౌపదీ మజితేంద్రియః ౪౦

అజితేంద్రియుడై కీచకుడు మరల నాశగొలుపుమాటలు ద్రౌపదితో బలికినాడు (౧౪-౪౧-౪౬) ఆసాధ్వి కీచకునిమాటలు విని గర్హించుచు మాటాడినది (౧౪-౪౭). ఈకీచకప్రసంగమును గర్హించుచు నామె సైరంధ్రిగా దిరస్కరించి పలికినది. (౧౪-౪౯) 'సైరంధ్రీ'! కీచకునింటికి బోయి సురనుదెమ్మ' అని సుధేష్ణపలుకగా సైరంధ్రిగా 'నేను కీచకునింటికిబోను, ఆదినే యిట్టికట్టడి గావించుకొని నీయింట నున్నదానను' అని బదులు పలికినది. (౧౫-౧౧-౧౬) అధికారికముగా సుధేష్ణ త న్నా కీచకునింటికి బంపునపుడు 'సా శంకమానా......ప్రాతిష్ఠత సురాహారీ' అని ద్రౌపదినిగూర్చి చెప్పబడినది. (౧౫-౧౯) అపు డాత్మవిశ్వాసమును బలుకుచు సైరంధ్రిగా నామె సూర్యునకు నమస్కరించినది. (౧౫-౧౯) ఆమెరక్షణమునిమిత్తము సూర్యు, డంతర్హితుడగు రక్కసునొక్కని నియోగించెను.

ఉపాతిష్ఠత సా సూర్యం ముహూర్త మబలా తతః ౧౯
స తస్యా స్తనుమధ్యాయా స్సర్వం సూర్యోఽవబుద్ధవాన్

ఇత్యుక్త్వా ప్రాద్రవ త్కృష్ణా సుధేష్ణాయా నివేశనం
కేశా న్ముక్త్వాచ సుశ్రోణీ సంరంభా ల్లోహి తేక్షణా. ౮౨
శుశుభే వదనం తస్యా రుదంత్యా స్సుచిరం తదా
మేఘలేఖా వినిర్ముక్తం దివీవ శశిమండలమ్. ౮౫

అంతర్హితం తత స్తస్యా రక్షో రక్షార్థ మాదిశత్ ౨౦
తచ్చైనాం నాజహా త్తత్ర సర్వావస్థా స్వనిందితామ్ ౨౧

ద్రౌపది సైరంధ్రిగా సూర్యు నుపాసించినది. సైరంధ్రీరక్షణార్థముగా సూర్యుడంతర్హితుడగు రక్కసుని నియోగించినాడు. అనగా ద్రౌపదీ రక్షణార్థము కాదనియు సైరంధ్రిరక్షణార్థ మీరక్కసుడు నియోగింప బడినాడనియు ఫలితార్థము. కీచకునిసమీపించు ద్రౌపదినిగూర్చి 'తాం ...కృష్ణాం సమీపగాం' అని చెప్పబడినది. (౧౪–౨౨) సమీపమునకు వచ్చిన ద్రౌపదినిజూచి కీచకుడు తనవాంఛను దెల్పునపు డామె ద్రౌపదిగా సుధేష్ణయొక్క పనుపునుగూర్చి చెప్పినది. (౧౬–౫) కీచకుడామెను బట్ట బోవునపుడు ద్రౌపదిగా నామె యాత్మవిశ్వాసమును ప్రకటించినది, కీచకుని దిరస్కరించి పలికినది, కీచకుని నేలపైబడవేసి శరణార్థము రాజ సభకు బరుగునవచ్చినది. (౧౬–౭–౧౨) ౯–౧౨ ఈశ్లోకములందున్న 'తయా సమాక్షి ప్తతనుః సా గృహీతా విధున్వానా, తాం కీచకః ప్రధావంతీం, తస్యా యోసౌ...రాక్షసః 'అనువానిలో ద్రౌపదినిగూర్చిన సర్వ నామములు ద్రౌపదిని నిర్దేశించుచున్నవి. కీచకాంతఃపురమున నాత్మరక్ష స్వయముగావించుకొని కీచకుని బుడమిపై బడవేసి పరుగున రాజసభ కేతెంచిన ద్రౌపది నాసభయెదుట పరాభవించిన యాకీచకుని సూర్యనియోజితుడగు నంతర్హితుడైయున్న రాక్షసుడు డొల్లవేసెను. ఈరాక్షసకృత్యము గంధర్వకృత్యముగా నిట పరిణమించుట గమనింపదగినది. సైరంధ్రిగా ద్రౌపది సూర్యునుపాసించుట యిచ్చోట గమనింపదగినది.

సుధేష్ణా
కస్త్వా వధీ ర్వరారోహే కస్మా ద్రోదిషి శోభనే
కస్యాఽద్య న సుఖం భద్రే కేన తే విప్రియం కృతమ్.

---

తాం చాఽఽసీనౌ దదృశతు ర్భీమసేనయుధిష్ఠిరౌ
అమృష్యమాణౌ కృష్ణాయాః కీచకేన పరాభవమ్ ౧౬–౧౪

కీచకుడు భూమిపై దొర్లుచున్నాడు. ఆమె రాజసభను ప్రవేశించినది. ప్రచ్ఛన్నచారులగు గంధర్వపతులచే రక్షితమైన దనునట్లు తెలియున్న సైరంధ్రిని భీమసేనయుధిష్ఠిరులు గాంచిరి.—ద్రౌపదిని సభయెదుట కీచకుడు పరాభవించుటను భీమసేనయుధిష్ఠిరులు గాంచిరి. యుధిష్ఠిరునికంటె ముందుగా భీమసేను డిచట నిర్దేశింపబడుట గమనింపదగినది. సూదుని నివారించుటయను నెపమున ధర్మజుడు భీమసంరంభము నరికట్టెను.

సా సభాద్వార మాసాద్య రుదతీ మత్స్య మబ్రవీత్
అవేక్షమాణా సుశ్రోణీ పతీం స్తాన్ దీనచేతసః ౧౬–౨౧
ఆకార మభిరక్షంతీ ప్రతిజ్ఞాం ధర్మసంహితాం
దహ్యమానేన రౌద్రేణ చక్షుషా ద్రుపదాత్మజా

'సా...మత్స్య మబ్రవీత్' అనునది సైరంధ్రి యొల్లను సూచించుచున్నది. తక్కిన మూడుపాదములు ద్రౌపదియొల్లను నిర్దేశించుచున్నవి. ద్రౌపది విరాటసభలో పతులనుద్దేశించి శరణాగతివచనములు పలికినది. (౧౬–౨౩–౩౫) ధర్మజుడు ద్రౌపదితో నన్యాపదేశముగ గార్యనిర్ణయము (కీచకవధను) వచించినాడు. (౧౬–౪౦–౪౫) ఈసందర్భములో సైరంధ్రి యని ధర్మజుడు సంబోధించినదాని కామె సైరంధ్రిగా బదులుమాట పలికినది (౧౬–౪౬). ధర్మజు డీసందర్భములో భీమనివారణమందు 'సూద' అని భీముని సంబోధించినాడు (౧౬–౨౦). ద్రౌపదిని రెండుపర్యాయములు 'సైరంధ్రి' అని సంబోధించినాడు (౧౬–౪౧, ౪౫)ద్రౌపది పిమ్మట

ద్రౌపదీ

కీచకో మాఽవధీ త్త్రత్ర సురాహారీం గతాం తవ

సభాయాం పశ్యతో రాజ్ఞో యథైవ విజనే వనే. ౫౦

సుధేష్ణనివేశమునకు వచ్చినది. (ఇత్యుక్త్వా ప్రాద్రవ త్కృష్ణా సుధేష్ణాయా నివేశనం ౧౬-౪౭) ఆమె కష్టపు పాటునుగూర్చి సుధేష్ణ యడుగునపుడామె ద్రౌపదిగా బదులుపలికినది (౧౬-౫౦). అపుడు కీచకుని దండితుని జేయుదు నని సుధేష్ణపలికినదానికి సైరంధ్రిగా 'గంధర్వులే యాపని గావించెదరు' అని పలికినది. (౧౬-౫౨) కీచకవధకై భీముని ప్రేరేపింపబోవునపుడు గంధర్వపతిని గూర్చినమాటగా కష్టనిష్ఠురవచనము పలికినది.

సైరంధ్రీ

తస్మిన్ జీవతి పాపిష్ఠే సేనావాహే మమ ద్విషి

తత్కర్మ కృతవా నద్య కథం నిద్రాం నిషేవసే ౧౭-౫

ఈశ్లోకమం దొక్కపతియే నిర్దేశింపబడుటగమనింపదగినది. (భీముడే నిర్దేశింపబడుచున్నాడని చమత్కారము.) ఇట్లుపలికి యామె భీముడున్న శాలను ప్రవేశించినది (౧౭-౬). పాంచాలి భీమసేను నాలింగనమొనరించు కొని యిట్లనెను. ద్రౌపది భీమునితో దన కడగండ్లనన్నియు దెల్పినది.

ఉత్తిష్ఠోత్తిష్ఠ కిం శేషే భీమసేనయథా మృతః

నామృతస్యహి పాపీయాన్ భార్యా మాలభ్య జీవతి ౧౭-౧౫

సైరంధ్రిది ప్రతీకార వచనము. పరాభవమున బలుకుచున్న వచనము ద్రౌపదిది. ద్రౌపది భీమునితో తన కడగండ్లనన్నియు దెల్పినది. కీచకుడు నర్తనశాలకువచ్చునట్లు సంకేత మొనర్పుమని భీముడు ద్రౌపదితో చెప్పినాడు. కీచకుడు మఱునాడు సుధేష్ణాంతఃపురమునకుబోయి ద్రౌపదితో తనవలపును దెల్పెను (౨౨-౭). ద్రౌపది వానితో సంకేతవచనములు పలికినది (౨౨-౫-౧౭). నర్తనశాలయందు పార్థోన్మథితచిత్తాత్ముడై

సుదేష్ణా
ఘాతయామి సుకేశాంతే కీచకం యది మన్యసే
యోఽసౌ త్వాం కామసమ్మత్తో దుర్లభా మవమన్యతే.

కీచకుడు పలికినదానికి భీముడు కోపమున జాజ్వల్యమానుడై బదులాడినాడు (౨౨-౪౯,౫౦). భీముడు కీచకు నుద్దేశించి 'సైరంధ్రి యింక సుఖముగా విహరించును, సైరంధ్రీపతులు సుఖముగా చరింతురు' అని పలికినాడు (౨౨-౫౩, ౫౪) కీచకుని వధించునపుడును భీముడు కీచకునిగూర్చి 'సైరంధ్రీ కంటకం' అని పలికినాడు (౨౨-౭౨). ద్రౌపది గా కీచకమరణ వృత్తాంతమును నర్తనశాలరక్షకులతో బలికినది (౨౨-౯౨, ౯౩). స్తంభము నాలింగనమొనరించుకొనియున్న ద్రౌపదినిగాంచి కీచకులు పెచ్చు రేగిరి (౨౩-౪). విరాటుడు సూతులపరాక్రమమును దలంచి సైరంధ్రిని సూతపుత్రుని శవముతో సహదాహమొనరించుటకు సమ్మతించెను (౨౩-౭). ద్రౌపదిని కీచకశవముపై కట్టి కీచకులు గొనిపోవునపుడు ద్రౌపదిగా నామె భర్తలనుద్దేశించి యార్తనాద మొనరించినది (౨౩-౬-౧౫).

పరాక్రమంతు సూతానాం మత్వా రాజాఽన్వమోదత
సైరంధ్ర్యా స్సూతపుత్రేణ సహదాహం విశాంపతిః ౨౩—౭
తాం సమాసాద్య విత్రస్తాం కృష్ణాం కమలలోచనాం
మోముహ్యమానాం తే తత్ర జగృహుః కీచకా భృశమ్ ౯

'గంధర్వుడు వచ్చుచున్నాడు, సైరంధ్రిని విడిచివేయుడు' అని పలుకుచు నుపకీచకులు ద్రౌపది నటువిడిచి పురముదిక్కుగా బరుగిడ జొచ్చిరి (౨౩-౨౭, ౨౮). 'దివృక్షంత స్తదా జ్యేష్ఠం భ్రాతరం హ్యుపకీచకాః (౨౩-౨౬) అని విచిత్రముగా నిట చెప్పబడినది. ఉపకీచకులు భీముని జూచి గంధర్వుడని భయమొందిరి కాని కీచకుడు తనతో పోరాడువాడు గంధర్వుడని పలికినట్లు లేదు. సైరంధ్రిని జూచి పురుషులు గంధర్వభయత్రస్తులయిరి. (తాం దృష్ట్వా పురుషా రాజన్ ప్రాద్రవంత

సైరంధ్రి

అన్యే చైవ వధిష్యంతి యేషా మాగః కరోతి సః
మన్యే చైవాఽద్య సువ్యక్తం యమలోకంగమిష్యతి. ౫౨

('అట్టి దయావంతులవిషయమై నేను సహధర్మచారిణియై యున్నాను, ఆతనికే వారందఱు వధ్యులందు జ్యేష్ఠుడు జూదమాడువాడు' అని సైరంధ్రి పలికినది. ద్రౌపది యిట్లు పలికి జుత్తు విరియబోసికొని లోహితేక్షణయై సుధేష్ణయొక్క—

---

దిశో దశ' అని యిచ్చటగలదు. ఇందలి 'తాం' అనునది సైరంధ్రినే తెలుపును. ద్రౌపదినిజూచి పురజనులు భయమంది పరుగులిడిరని దీని

---

భావము కానేరదు (౨౪–౧౩). ద్రౌపది భీమునితో కృతజ్ఞతను దెల్పుచు 'గంధర్వరాజునకు నమస్కారము' అని పలికెను (౨౪–౧౪, ౧౫). నర్తనశాలయందు బృహన్నలావచనమునకు సైరంధ్రి బదులుమాట పలికినది (౨౪–౨౬). 'సైరంధ్రీ వెడలిపొమ్ము' అని సుధేష్ణపలికినదానికి 'పదుమూడు దినములు రాజు క్షమింపదగును' అని సైరంధ్రిగా నామె బదులు పలికినది (౨౪–౩౦, ౩౧).

అర్జునుకు తెల్పినప్రకారము ద్రౌపది యుత్తరునితో సారథ్య విషయకమగు ప్రసంగము గావించినది (౩౬–౧౪–౨౨). ఆమాటవిని యుత్తర దుత్తరను బృహన్నలయొద్దకు బంపెను (౩౬–౨౩, ౨౪). అపుడర్జును డుత్తరునితో బృహన్నళగా ప్రసంగము గావించెను (౩౭ వ అధ్యాయము). పాంచాలికొరకు కౌరవవీరుల వస్త్రముల గొనితెమ్మని కన్యలు పలికినదానిని కొత్త దర్జునుడుగా బదులుపలికినాడు. 'ఉత్తరుడు జయించిన నేను వస్త్రముల దెచ్చెదను' అని బృహన్నళగా బలికెను.

ఏవం తా బ్రువతీః కన్యాః సహితాః పాండునందనః
ప్రత్యువాచ హసన్ పార్థో మేఘదుందుభినిస్వనః ౩౭–౩౧

నివేశనమునకు బోయినది. సుచిర రోదనమొందిన యామె వదనము మేఘలేఖా వినిర్ముక్తమగు నాకాశశశిమండల మట్లుండెను. సుదేష్ణ 'నిన్నెవరు కొట్టిరి, ఏలనేడ్చుచున్నావు, ఎవని కిపుడసుఖమగును, ఎవడు నీకు విప్రియమొనరించెను'

బృహన్నల

యద్యుత్తరోఽయం సంగ్రామే విజేష్యతి మహారథాన్
అథాహరిష్యే వాసాంసి దివ్యాని రుచిరాణిచ ౩౨

అర్జునవచనము (ఆపలుకుబడి) మేఘగంభీరనిస్వనముగా నున్నదని యిచ్చట గలదు. అర్జునునందు సదావర్తించియున్న పురుషప్రకృతి నిది యెంతయేని నిర్ధారించుచున్నది. అర్జునప్రశంసాపూర్వకమగు మంగళాశీర్వచన మిపుడు స్త్రీలు, కన్యలు, ద్విజులు బృహన్నలోత్తరులనుద్దేశించి పలికిరి. (౩౨-౩౪, ౩౫) అర్జునుడుత్తరునిరథమును వాతరంహసమైన నాకసమంటునటుల నడిపెను. మత్స్యపుత్రధనంజయులు కౌరవబలమును గాంచిరి. (౩౭-౩, ౪) ఆకౌరవబలమునుజూచి యుత్తరుడు సవ్యసాచిసకాశమున మందుడై పరిదేవనమొందినాడు. (౩౭-౧౭) అర్జునుడు బృహన్నలగా నుత్తరునితో మాటాడినాడు. (౩౭-౧౯-౨౭) భీతుడై పారిపోవుచున్న యుత్తరుని గూర్చి బృహన్నలగా 'వలదిది యుచితముకాదు' అని పలుకుచు గాంతేయుడుగా రథముదిగి యుత్తరుని యొద్దకు పరుగిడినాడు.

బృహన్నల

నైష శూరైః స్మృతో ధర్మః క్షత్రియస్యేహ పలాయనం
శ్రేయస్తు మరణం యుద్ధే న భీతస్య పలాయనమ్ ౩౭-౨౯
ఏవముక్త్వాతు కౌంతేయః సోఽవప్లుత్య రథోత్తమాత్ ౩౦

ఉత్తరుని వెనుక నట్లు పోవుచున్న ధనంజయునిజూచి కౌరవులు నజ్జుగుజ్జుపొందిరి (౩౭-౩౧). పార్థుడుత్తరుని ధీరునిగావించువాడైనాడు (౩౭-౪౭). ధనంజయకృతభయమున భీష్మద్రోణాద్యులందఱు విత్రస్తమన

అని యడిగెను. ద్రౌపది 'నీనిమిత్తము సురాహారిగా వెళ్ళిన నన్ను రాజు చూచుచుండగా నిజనమైన వనమందువలెనే కీచకుడు గొట్టెను' అని బదులు పలికెను. సుధేష్ణ 'సుకేశినీ (నీవు) కోరిన కీచకుని దండింతును, కామసమ్మత్తుడై దుర్లభ యైన నిన్నవమానించెనా' అని పలుకగా సైరంధ్రి 'ఎవరికి

---

స్కులు, హతోత్సాహులునైరి (౩౯-౧, ౩). పార్థుడుగా నత డుత్తరుని ధీరునిగావించు ప్రయత్నము గావించినాడు (౪౦ అధ్యాయము). 'ఈశమీ వృక్షమున శవమున్నదని వింటిమి' అని యుత్తరుడు పలికినదానికి బృహన్నళగానతడుబదులుపలికినాడు (౪౧-౧-౨౫). 'ఈశమీవృక్షమునెక్కుము' అని ధనంజయుడుగా నుత్తరుని శాసించినాడు. ఉత్తరుడాయుధముల మూటను విప్పి వాని వివరణ మడిగెను.

త మన్వశాసత్ శత్రుఘ్నో రథే తిష్ఠన్ ధనంజయః ౪౧-౮

వైరాటి రక్షనం రాజ న్నిదం వచన మబ్రవీత్ ౧౩

శమీవృక్షమందున్న పాండవాయుధవిశేషములను బృహన్నళగా నుత్తరునకు ప్రపంచించినాడు (౪౩వ అధ్యాయము). 'ఆయుధము లిచ్చట నున్నవి ఆపాండవులు, ద్రౌపది యెచ్చటనున్నవారో' అని యుత్తరుడు, ప్రస్తావించుటయందు 'బృహన్నళ నడిగెను' అవి శేషుండుట గమనింపదగినది (౪౪-౧-౪). యుద్ధానంతరకాలమం దుత్తరుడు ప్రహృష్టుడై కిరీటి సారథిగా పట్టణముగూర్చి బయలువెడలెను (ప్రాయా త్స మతో స్వ నగరం ప్రహృష్టః కిరీటినా సారథినా మహాత్మనా (౬౭-౧౪) అపుడర్జునుడు బృహన్నళారూపమున హృష్టుడై నగరమును ప్రవేశించెను (వివేశ హృష్టో నగరం మహాత్మా బృహన్నళారూప ముపేత్య సారథిః ౬౭-౧౬)

కౌరవులతోడి యుద్ధమున నుత్తరుడు పోయియున్నాడని విని కడు విచారమొందియున్న విరాటునుద్దేశించి ధర్మజుడు నవ్వుచు (విహాస్య)

వాడపకార మొనర్చినాడో వారే వానిని వధించెదరు, వాడు నిశ్చయ మిపుడే యమలోకమునకు బోవుననితలంచుచున్నాను' అని పలికెను.)

సైరంధ్రీరక్షణము కీచకవధ కనుమతి యేర్పడిన పిమ్మట ధర్మరాజు వచనానుసారము మరల ద్రౌపది సుధేష్ణా

---

బదులుపలికెను. 'బృహన్నళా సారథిశ్చే న్నరేంద్ర పరే న నేష్యంతి తవాద్య గా స్తాః' అని పలికెను ఉ౮-౧౬). కౌరవులజయించిన విజయవార్తను విని ముందుగా యుధిష్ఠిరుడే ప్రశంసావచనము పలికెను. (దిష్ట్యా వినిర్జితా గావః కురవశ్చపలాయితాః ఉ౮-౨౨, ౨౩. కౌరవపరాజయము కన్న ముందుగా గోవిజయకమగు ప్రస్తావన గావించుటయందు ధర్మజుని ధర్మమార్గసంపద సువ్యక్తమగుచున్నది.) జయోత్సాహపూరితుడైన విరాటుడు 'జూద మాడుదము' అని హృష్టుడై పలికినదానికి ధర్మజుడు ద్యూతవిషయము పాండవుడుగా బలుకుచు ననుకూలవచనము పలికెను (ఉ౮-౩౧, ౩౩). విరాటు డుత్సాహియై ద్యూతప్రశంసయే నొక్కి పలుకగా ధర్మజుడుకంకుడుగా ద్యూతమందలిదోషమును పేర్కొనుచు ద్యూతానుకూలవచనము నేపలికెను(ఉ౮-౩౫-౩౭). ద్యూతము ప్రవర్తితముకాగావిరాటుడు పాండవునితో(ధర్మరాజుతో- మత్స్యఃపాండవమబ్రవీత్)సంతోషవచనము పలికెను.దానికొఱకుయుధిష్ఠిరుగా బదులుమాటవచించెను(ఉ౮-౩౮-౩౯). అపుడు షండునిప్రశంసించుచుండుటకు విరాటుడు కుపితుడై పాండవునితో గోపవచనము పలికెను. (ఉ౮-౪౦) అర్జునవిజయమునకు హృష్టుడై యున్న యుధిష్ఠిరుడు ద్యూతాసక్తియుక్తుడగుచు నాసందర్భమున విరాటవచనమునకు బదులుమాటగా నర్జునపరాక్రమవిశేషమును ప్రపంచించి ప్రశంసించెను. (ఉ౮-౪౩-౪౬) ఉత్తరునిగాక షండుని బొగడుచున్నాడను కోపమున విరాటుడు యుధిష్ఠిరుని పాచికతో కొట్టెను (ఉ౮-౪౭).

మందిరమునకు వెడలిపోయినది. ద్రౌపది యీసందర్భములో పరాభవవిషయము ద్రౌపదియందు, ప్రతీకారవిషయము సైరంధ్రిపరముగాను సుధేష్ణనుగూర్చి పలికినది. సుధేష్ణయు సైరంధ్రినిగూర్చి దుర్లభయని పలికినది. కార్యమిపుడు ౪౦

---

అతని నాసికనుండి రక్తముకారెను. (బలవత్ప్రతివిద్ధస్య నస్తఃశోణిత మావహత్ ౪౫) ధర్మజు డాఃరిస్థితియందుద్రౌపదినీక్షింపగా నామె ధర్మజున కుపచారమొనర్చెను (౬౫-౪౯-౫౧). ఉత్తరబృహన్నల నిరువురను లోనబ్రవేశబెట్టవలసినదని విరాటుడు పలికిన సందర్భములో కురురాజు యుధిష్ఠిరుడాక్షత్రనుజూచి బృహన్నలను లోనబ్రవేశపెట్టవలదని తెల్పెను. (౬౫-౫౫). ఈఘట్టమందలి పాండవః, కురురాజః అను పదములు సాభిప్రాయములు. ఉత్తరుడు లోనబ్రవేశించి తండ్రికి నమస్కరించి కంకుని సమీపించెను (౬౫-౫౯). ఉత్తరుడు గాబరాపొంది పలికినమాట విని విరాటుడు భస్మచ్ఛన్నానలమట్లున్న కౌంతేయుని క్షమింపవేడెను. దాని కాతడు ధర్మజుడుగా నుత్తరునకు సమాధానమగు వచనము విచిత్రముగా రచించెను (౬౫-౬౫-౬౭). ధర్మజునిముక్కునుండి రక్తముకారుట కట్టినపైని బృహన్నల లోనబ్రవేశించి విరాటునకు నమస్కరించి కంకునిసమీపించెను (౬౫-౬౫). ఈరెండుచోట్ల ధర్మజునిగూర్చి కంకుడుగా వ్యవహారముండుట సమయపురస్కృతమైయున్నది. యుద్ధవిషయము నుత్తరుడు వివరించినసందర్భమున విరాటు డంతపని గావించియున్న మహానుభావు డర్జునుడకడనేయున్నవిషయము తెలియనివాడాయెను. (౬౯-౧౫) పార్థు (డర్జునుడు) కౌరవవీరుల వస్త్రముల నుత్తరకు స్వయమొసంగెను (౬౯-౧౬).

విరాటపర్వమందు సుధేష్ణనుగూర్చి కొన్నిచోట్ల సుధేష్ణయని, కొన్నిచోట్ల కైకేయిసుతని, విరాటమహిషి యని యిట్లుగా గలదు. కీచ

ధర్వ్యాలచేత పడినది, కీచకు డింక పరాంతనువు నొందువాడు కాగలడని వచించినది.

సా హతా సూతపుత్రేణ రాజపత్నీ యశస్వినీ
వధం కృష్ణా పరీప్సంతీ సేనావాహస్య భామిని ౧౭-౧
జగామ వాసమేవాఽథ తదా సా ద్రుపదాత్మజా
కృత్వా శౌచం యథాన్యాయం కృష్ణా సా తనుమధ్యమా
గాత్రాణి వాససీచైవ ప్రక్షాల్య సలిలేన సా
చింతయామాస రుదతీ తస్య దుఃఖస్య నిర్ణయమ్. 3
కిం కరోమి క్వ గచ్ఛామి కథం కార్యం భవే న్మమ
ఇత్యేవం చింతయిత్వా సా భీమం వై మనసాఽగమత్ ౪
నాన్యః కర్తా ఋతే భీమా న్మమాఽద్య మనసః ప్రియం
తత ఉత్థాయ రాత్రౌ సా విహాయ శయనం స్వకమ్ ౫
పాంద్రవ న్నాథ మిచ్ఛంతీ కృష్ణా నాథవతీ సతీ

---

కునిగూర్చి, ఉపకీచకులనుగూర్చి' సందర్భమునుబట్టి సేనానియని, సూతుడని, కీచకుడని: సూతులని, ఉపకీచకులని గలదు.

కర్ణునిగూర్చి కర్ణుడని, సూతుడని, రాధేయుడని భారతమందు వ్యవహారము గలదు.

భారతమందు కృష్ణునిగూర్చి యనేకనామములు గలవు. ఆతనిమాటలకు మూడుమకుటములు గలవు. ౧ భగవానువాచ ౨ కృష్ణోవాచ 3 వాసుదేవోవాచ—అని యుండును. భగవద్గీత, రాజసూయఘట్టము మొదలగునవి గమనించిన నిది స్పష్టముకాగలదు. భారతార్థవివరణ మందీ విశేషవిషయములనెల్ల గమనింపవలసి యున్నది.

* భవనం భీమసేనస్య క్షిప్ర మాయతలోచనా
దుఃఖేన మహతా యుక్తా మానసేన మనస్వినీ ౬
సైరంధ్రీ :—
తస్మిన్ జీవతి పాపిష్ఠే సేనావాహే మమ ద్విషి
తత్కర్మ కృతవా నద్య కథం నిద్రాం నిషేవసే ౭
ఏవ ముక్త్వాఽథ తాం శాలాం ప్రవివేశ మనస్వినీ
యస్యాం భీమ స్తదా శేతే మృగరాజ ఇవ శ్వసన్. ౮
♦ తస్యా రూపేణ సా శాలా భీమస్యచ మహాత్మనః
సంమూర్ఛితేవ కౌరవ్య ప్రజజ్వాలచ తేజసా. ౯

.... .... .... ...

† సా లతేవ మహాసాలం ఫుల్లం గోమతితీరజం
పరిష్వజతి పాంచాలీ మధ్యమం పాండునందనమ్. ౧౨

---

* మహానసమందు భీమునకు ప్రత్యేకము నివాసగృహమున్నదని యిది సూచించుచున్నది. 'జగా మావాస మే వాథ తదా సా ద్రుపదాత్మజా' అనునది ద్రౌపదియొక్క నివాసగృహమును సూచించుచున్నది (౧౪-౨).

♦ రూపవంతులు ద్యుతిమంతులునగు ద్రౌపదీభీములచే నాశాల ప్రకాశించినది. ఆదంపతుల మూర్తిమంతమందలి ఘనత నిది వ్యక్తీకరించుచున్నది.

† మధ్యముపాండునందను డర్జునుడేయైనను 'మధ్యమం' అనుపదమిచ్చుట విచిత్రముగా భీమున కన్వయింప జేయబడినది. ద్రౌపదియాలింగనమం దట్లుగాభీము డుండిపోయినాడను రూప మిందువలన వ్యక్తమగుచున్నది.

* వీణేవ మధురాలాపా గాంధారం సాధు మూర్ఛతీ
అభ్యభాషత పాంచాలీ భీమసేన మనిందితా ౧౮
ఉత్తిష్ఠోత్తిష్ఠ కిం శేషే భీమసేన యథా మృతః
నాఽమృతస్యహి పాపీయాన్ భార్యా మాలభ్య జీవతి.
స సంప్రహాయ శయనం రాజపుత్ర్యా ప్రబోధితః
ఉపాతిష్ఠత మేఘాభః పర్యంకే సోపసంగ్రహే. ౧౯
♦ అథాఽబ్రవీ ద్రాజపుత్రీం కౌంతేయో మహిషీం
ప్రియాం
కేనాఽస్యర్థేన సంప్రాప్తా త్వరితేవ మమాంతికమ్. ౧౭
న తే ప్రకృతిమాన్ వర్ణః కృశా పాండుశ్చ లక్ష్యసే ౧౮
⸙ ఆచక్ష్వ పరిశేషేణ సర్వం విద్యామహం యథా

---

* బాహువులతో భీము నాలింగనమొనరించికొని సుప్తసింహ మును మృగరాజవధువు లేపినటుల నాతని ద్రౌపది లేపినది. మహాగజము నాడేనుగట్లు భీము నాలింగనమొనరించికొని ద్రౌపది పలికినమాటలు వీణపై గాంధారమట్లు మూర్ఛనముగా నుండినవి.

♦౧౯ అధ్యాయమం దీ శ్లోకార్థము ధర్మజునిగూర్చి యీ యధ్యాయమందు భీమునిగూర్చి యుండుట గమనింపదగినది. జగత్పార్వ భౌములు ధర్మజభీమసేనులు మహిషితో మాటాడిన మాట లంత పరిస్థితిగ నుండినవని యభిప్రాయము.

⸙ 'గంధర్వులు నీకు ప్రియముగల్గింతురు' అని ధర్మజుడు సభలో బలికియున్నాడు. ఆప్రియమునే పర్యవసానమొనరించుచు నట్లుగనే భీము డిప్పుడు పలికినాడని గుర్తింపవలెను. ఇందు మొదటిమాట 'సుఖము' చివరిమాట 'ప్రియము', ఆమధ్యనే 'దుఃఖము - ద్వేష్యము (ఇతికింపబడి)

సుఖంవా యదివా దుఃఖం ద్వేష్యం వా యదివా ప్రియమ్.
యథావ త్సర్వ మాచక్ష్వ శ్రుత్వా జ్ఞాస్యామియత్ క్షమం
*అహ మేవహి తే కృష్ణే విశ్వాస్యస్సర్వకర్మసు
అహ మాపత్సు చాపి త్వాం మోక్షయామి పునః పునః
శీఘ్రముక్త్వా యథా కామం యత్తే కార్యం వివక్షితమ్
గచ్ఛవై శయనాయైవ పురా నాన్యేన బుధ్యతే. ౨౨

యున్నవి. వానిని దాటించువాడే భీము డిప్పుడని పర్యవసానము. ఇది పరమోత్తముడను భీమసేనునిపలుకు. శ్లో॥ కార్యవేగముయొక్క (ఆత్రము యొక్క) అత్యవసర పరిస్థితిలో సధర్మమందు జుట్టుకొనిన ధృతరాష్ట్రు డిట్టుల పలికినాడు.

క్షత్తః పుత్రేషు పుత్రైశ్చ కలహో న భవిష్యతి
యదిదేవాః ప్రసాదం నః కరిష్యంతి న సంశయః సభా॥ ౪౯.౫౬
అశుభం వా శుభం వాపి హితంవా యది వాఽహితం
ప్రవర్తతాం సుహృద్ద్యూతం దిష్ట మేత న్న సంశయః ౫౪

(ధృతరాష్ట్రుడు విదురునితో నిట్లనెను, విదురా! దేవతలే ప్రసన్నులై యుండిరచో పుత్రులతో పుత్రులకు కలహము సంభవింపదు, నిస్సంశయము. అశుభముగాని, శుభముగాని, హితముకాని అహితముకాని, సుహృద్ద్యూతము నడుపవలయును.)

ఇం దాద్యంతములందు 'అశుభము అహితము' గలదు. ఈవ్యాత్యాసము గమనించుచో ఉత్తమప్రవృత్తియొక్క 'వివేకసంపద సుస్పష్టము కాగలదు. 'శుభము హితము' మధ్యనిరికింపబడినవి.

* 'నాన్యః కర్తా ఋతే భీమా న్మమాద్య మనసః ప్రియం' అని ద్రౌపదిదలంచి భీమునియొద్దకు వచ్చినది. 'అహమేవహి తే కృష్ణే విశ్వాస్య స్సర్వకర్మసు, అహమాపత్సు చాపి త్వాం మోక్షయామి పునః పునః' అనిభీముడు ద్రౌపదినిగూర్చి పలికినాడు. రాజులను బంధించిన జరాసంధుని

(రాజపత్ని, యశస్విని యగు ద్రౌపది సూతపుత్రు)
నిచే నవమానింపబడినది; ద్రౌపది యాసేనానాయకుని వధను గోరినది; యథాన్యాయమైన శౌచమాచరించి తనబసకు వెళ్లినది. ఆమె స్నానముచేసి, బట్టలు ప్రక్షాళన మొనరించి రోదనమొనరించుచు బోయి యాదుఃఖనిర్ణయము నాలోచించెను. 'ఏమిచేయుదు నెందుబోదును నాకార్యమెట్లగును'- ఇట్లుగా నామె చింతించి భీముని మనసులో దలంచెను. 'భీముడుగాక యిప్పుడు నామనసునకు ప్రియమొనరించువా డింకొకడుకాడు' అని ద్రౌపది తలంచెను. రాత్రికాలమున శయనమునుండి లేచి నాథవతియగునామె వేగ భీముని భవనమునకు బోయెను మహద్దుఃఖము మనమందు గల్గిన యామనస్విని భీమునిదరికి బోయెను. సైరంధ్రి 'ఆ పాపిష్ఠుడు, నాద్వేషి, యాసేనానాయకుడు జీవించి యుండగా, వాడంతటిపని గావించియుండగా నెట్లుగా బ్రదుకొని యున్నావో' అని పలికినది. (సైరంధ్రిమూలగా) ద్రౌపది యిట్లుపలికి యామనస్విని మృగరాజువలె శ్వసించుచున్న

---

వధించి రాజసూయము నడపునట్లు భీముడు గావించినాడు. విరాటరాజ్యమందు గొప్పవారైయున్నట్టి కీచకులనెల్ల సంహరించి విరాటమోక్షణ మొనరించినాడుభీముడు. సౌగంధికా పుష్పమును దెచ్చి ద్రౌపదికిచ్చినవాడుభీముడు. కౌరవులనెల్ల వధించినవాడు భీముడు. యువరాజై రాజ్యకార్యమెల్ల నడిపించినవాడు భీముడు. ఇచ్చట ద్రౌపదీభీముల ప్రసంగమీ విశేషములనెల్ల స్మరింపజేయుచున్నది.

భీముడు పండుకొనియున్న యా శాలను ప్రవేశించెను. ఆమె యొక్కయు మహాత్ముడగు భీమునియొక్కయు రూపమున ఆ తేజమున నాశాలయంతయు సంమూర్ఛితమట్లు ప్రజ్వలించెను. ఆశుచిస్మిత మహానసమందున్న భీమసేనునిదరికి పోయెను. ఆమధ్యముని, పాండునందనుని గోమతితీరమందలి ఫుల్లమగు మహాసాలమును లతచుట్టుకొనినటుల ద్రౌపది పరిష్వంగ మొనరించెను. బాహువులతో నాతనిగాగిలించి దుర్గమందు సింహమును మృగరాజవధువునట్లామె భీముని లేపించెను. ఆడేనుగు మహాగజమునట్లు భీమసేనుని యాలింగన మొనరించుకొని వీణయట్లు మధురాలాపమున సాధు మూర్ఛనమగు గాంధారమట్లా పాంచాలి యిట్లు పలికెను. 'లే లెమ్ము, మృతునట్లు పండుకొంటివేల. అమృతుడగు వానిభార్యను నన్నుముట్టి (ఆలభ్య) యాపాపాత్ముడు బ్రదికి యుండునా'— ఆ రాజపుత్రిచే ప్రబోధితుడై భీముడు శయనమునుండి లేచెను. మేఘాభమగునట్టి సోపసంగ్రహమును, పర్యంకమందుండి యాకౌంతేయుడా రాజపుత్రితో, మహిషితో, ప్రియురాలితో నిట్లనెను. 'ఎందునిమిత్తము త్వరితముగా నాయొద్ద కేతెంచితివి, నీవర్ణము పూర్వమట్లులేదు. (న తే ప్రకృతిమాన్ వర్ణః) కృశించి, తెల్లనై కానవచ్చుచున్నావు, నేను తెలియునట్లంత విషయమును తెల్పుము (ఆచక్ష్వ పరిశేషేణ). సుఖమో లేక దుఃఖమో, ద్వేషమో లేక ప్రియమో యది తెలియబలుకుము. యథావత్ సర్వ

మెరింగింపుము, వినిగావింపవలసిన దానిని గ్రహించెదను. నేనేకదా సర్వకర్మలందు విశ్వసింపదగినవాడను. నేనేకదా యాపదలనుండి పునఃపునః విముక్తినొందించు చున్నాను. కార్యవివక్షను వేగ నెఱిగించి యితరులు తెలియకుండునట్లు నిశ్శయనస్థలమునకు వెడలిపొమ్ము' అని పలికెను.)

ఈసందర్భములో పాండవులిందువిషయమై ప్రత్యేక మాలోచన సాగించిన ట్లేమియు నుల్లేఖింపబడి యుండలేదు. ప్రవేశసమయమందే పాండవులిందువిషయమై మెలకువగ నుండిరి. సూతునిచే నవమానింపబడిన రాజపుత్రి యాద్రౌపది యాసేనానాయకుని దుదముట్టింపదలచినది. యథాన్యాయమగు శౌచ మాచరించినది. ఆవాసమును జేరి యామె యాదుఃఖనిర్ణయము గావింప మొదలిడినది. ఇన్నినాళ్లుగా కీచకుడు బాధించుచుండినను గంధర్వరక్ష యామెయందు గానవచ్చుటలేదు. సభలో జిత్రముగా 'చరంతి లోకే ప్రచ్ఛన్నాః క్వను తేఽద్య మహారథాః' అని భర్తలనుద్దేశించి యామె మాటపలికినది. ఎప్పుడుగాని, ఏస్త్రీగాని యింతటి పరాభవ మొందియుండలేదు. అట్లుగా కీచకునిచే సభాముఖమున నంతటిపరాభవ మొందియు (నాగంధర్వప్రియపత్ని) సుధేష్ణామందిరమునకే తిరిగివచ్చినది. సుధేష్ణాదులందు పెద్ద యలజడి కలుగకుండుటకిది చక్కని హేతువుగానున్నది. ఆమె పైకి మామూలుగా నుండుచు లోలోనే కార్యనిశ్చయము చేసికొనినది. అట్లయినగాని యామె కార్యనిశ్చయ మపు

డనువుగానేరదు. రాత్రికాలములో నామె యీయాపదను దాటించుసమర్థుడు భీమసేనునితో మాటాడవలసియున్నది. కావున నామె యెట్టియూర్పుగాని పైకి తోపనీయలేదు. దుఃఖించి దుఃఖించి యామె పడుకొను ననునట్లుండి యామె కార్యగతిని మనమున నిశ్చయించుకొనినది.

భీముడున్నచోటునకు-ఆశాలకు బోవు నామె సైరంధ్రిగా 'ఆసేనావాహుడు నాద్వేషి జీవించియుండగా నాపాపాత్ముండంతపని గావించియుండగా నీవిపుడెట్లుపండుకొనియున్నవాడవు' అని పలికినది. 'నన్ను ప్రాకృతస్త్రీగా దలంచి విపరీతముగా ప్రవర్తించువాడా రాత్రికాలములో పరాంతమువు నొందగలడు' అని యామె మాటిమాటికి వచించియున్నది. (౯-3౫). ఆగంధర్వపతికృత్యమేర్పడవలసిన దారాత్రి సమయము. కావున నామె సైరంధ్రిగా నీమాటపలికి భీముడున్న శాలను ప్రవేశించినది. భీము నాలింగనమొనరించికొని ద్రౌపది 'లే లెమ్ము, మృతునట్లు భీమ! పండుకొంటి వేల మృతుడు గాని (వాని) యొక్క భార్య నవమానించి వాడు జీవించదగదు కదా' అని పలికినది. విరాటసభయందు రోష మోర్చియున్న భీమునిగాంచి రోషమున ద్రౌపది యీమాట వచించినది. ద్రౌపది లేపగానే భీముడు లేచి అంతత్వరగా వచ్చినసంగతి నడిగినాడు. ధర్మసహితబుద్ధియై సమయపాలనము దాకారమును రక్షించుకొనుచు ద్రౌపది విరాటసభయందు పతులనుగూర్చి పలికినది. ధర్మజు నివారణమున

నట్లే నిలిచిపోయియుండిన భీమునిచే కీచకవధ గావించుట కను మతి ధర్మరాజువలన ద్రౌపది పొందియున్నది. ఆవిశ్వాస మున దన్నే సమీపించియున్నట్టి యా రాజపుత్రితో మహి షితో నాప్రియురాలితో భీముడు రహస్యవచనము పలికినాడు. వివక్షితకార్యమెఱిగించి యెవరికి దెలియకుండ వేగశయనము నకు వెడలిపొమ్మని భీముడు ద్రౌపదితో మృదిగా బలికినాడు. ద్రౌపది యంతపర్యంతము పండుకొనియే యున్నది. అట్లే యామె సమీపించువఱకు భీముడును నట్లే పండుకొనియున్నా డని యభిప్రాయము. అంతయు దెలియబలుకుము, అంతయు నెఱింగి తగిన కృత్యము నిర్ణయింతును. నేనేకదా యాపదల నుండి నిన్ను విముక్తినొందించుచున్నది. అని భీముడు పలు కుటవలన గీచకవధయేకాక సర్వకార్యనిర్ణయమును ధ్వనించు చున్నది. ఆత్మవిశ్వాసమున సమీపించిన యర్ధాంగిని గూర్చి భీముడాత్మవిశ్వాసవచన మిట్లు పలికెను. ద్రౌపది యిట్లు పలికెను.

అశోచ్యత్వం కుత స్తస్యా యస్యా భర్తా యుధిష్ఠిరః
జానన్ సర్వాణి దుఃఖాని కిం మాం త్వం పరిపృచ్ఛసి
యన్మాం దాసీప్రవాదేన ప్రాతికామీ తదాఽనయత్
సభా పరిషదో మధ్యే తన్మాం దహతి భారత 2
పార్థివస్య సుతా నామ కాను జీవతి మాదృశీ
అనుభూయ యేదృశం దుఃఖ మన్యత్ర ద్రౌపదీం ప్రభో 3
వనవాసగతాయాశ్చ సైంధవేన దురాత్మనా

పరామర్శో ద్వితీయో మే సోఢు ముత్సహతే తు కా ౪
మత్స్యరాజ్ఞ స్సమక్షంతు తస్య ధూర్తస్య పశ్యతః
కీచకేన పదా స్పృష్టా కా ను జీవతి మాదృశీ ౫
ఏవం బహువిధైః క్లేశైః క్లిశ్యమానాంచ భారత
న మాం జానాసి కౌంతేయ కిం ఫలం జీవితేన మే ౬
యోఽయం రాజ్ఞో విరాటస్య కీచకో నామ భారత
సేనానీః పురుషవ్యాఘ్ర స్స్యాలః పరమదుర్మతిః ౭
స మాం సైరంధ్రివేషేణ వసంతీం రాజవేశ్మని
నిత్య మేవాఽహ దుష్టాత్మా భార్యా మమ భవేతి వై ౮
తే నోపమంత్ర్యమాణాయా వధార్హేణ సపత్నహన్
కాలేనేవ ఫలం పక్వం హృదయం మే విదీర్యతే ౯
భ్రాతరంచ విగర్హస్వ జ్యేష్ఠం దుర్ద్యూత దేవినం
యస్యాఽస్మి కర్మణా ప్రాప్తా దుఃఖ మేత దనంతకమ్ ౧౦

(ధర్మజుడు భర్తయైన నా కశోచ్యత్వ మెక్కడగలదు. సమస్తదుఃఖము తెలిసియు నన్నెలనంతయు నడుగుచున్నావు. దాసీపరివాదమున ప్రాతికామి యాప్రకారమున నన్ను సభాపరిషన్మధ్యమునకు గొనితెచ్చినాడు. అది నన్ను దహించుచున్నది. ప్రభో ద్రౌపదిగాక యేరాజపుత్రి యిట్టిదుఃఖమనుభవించి జీవించియుండగలదు. వనవాసమొనర్చుచున్నప్పుడు సైంధవు డాదురాత్మునిచేత — ఈ రెండవపరామర్శనెవ్వ రోర్వగలరు. మత్స్యరాజుసమీపములో—నాధూర్తుడు చూచుచుండగ కీచకునిచేత పాదప్రహార మొందిన నావంటి

దేవరు జీవించి యుండును. ఇట్లు పలువిధ క్లేశములచే క్లేశ మొందుచున్న నన్ను దెలియకున్నావు, జీవించియేమిప్రయోజనముగలదు. విరాటునకు సేనానియు, స్యాలుడు నగు పరమ దుర్మతికీచకుడనువాడు సైరంధ్రివేషమునరాజవేశ్మమందున్న నన్ను ఓపురుషవ్యాఘ్రము! ప్రతినిత్యము భార్యవుకమ్మని-యా దురాత్ముడనుచున్నాడు. శత్రుసంహారకుడా! వధార్హుడగువానిచే నిట్లు సంకటమొందుచున్న నా హృదయము పక్వఫలము కాలమందు పడునట్లు (విదీర్యతే) పరితాపమొందుచున్నది. ఎవనివలన నీయనంతకమగుదుఃఖము నొందియున్నానో యాదుర్ద్యూతదేవియగు జ్యేష్ఠుని భ్రాతను గర్హింపుము.)

ద్రౌపది యిందు మూడుకష్టములను దెల్పి విచారించినది. అందు మొదట కౌరవసభలో జరిగిన పరాభవము నామె దెల్పినది. ఆనా డామెను సభ కీడ్చి తెచ్చినవాడు ప్రాతికామి కాడు, దుశ్శాసనుడే. ప్రాతికామి రెండుపర్యాయములు ద్రౌపదియొద్దకు వచ్చినను ద్రౌపది కౌరవసభకు పోలేదు. ధర్మజుని వర్తమాన మందువలకు నామె సభకు వచ్చుట కొప్పుకొనలేదు. అయినను ద్రౌపది యిపుడు ప్రాతికామియే యామెను సభకు దెచ్చినట్లిచ్చట పలుకుచున్నది. దాసుడగువాడు వచ్చి తన్ను దాసిగా వచించినాడని యామె యభిప్రాయము సైంధవుడు తన్ను హరించుట నామె రెండవపరాభవముగా జెప్పినది. మొదటిపరాభవమే యామెను దహించుచున్నది. అట్టిచో నామె కిం

కొక్క పరాభవము గల్గినది. అట్లయినను దానింకను జీవించి యుండినందుల కామె కడువిచారించుచున్నది, అయిన నీరెండు పరాభవములందు పర్యవసానము దిక్కుమాలి పోలేదు. కౌరవసభలో ద్రౌపదీపాండవుల ధర్మనిష్ఠ వ్యక్తమైనది. సైంధవుని పాండవులు శిక్షించియున్నారు. పై రెంటి వలె కాక కీచక పరాభవమిపుడుదుర్భరదుఃఖహేతు వేయగు చున్నదని ద్రౌపది పలుకుచున్నది. 'మత్స్యరాజ్ఞః సము క్షంతు తస్య ధూర్తస్య పశ్యతః' అని ద్రౌపది చిత్రముగా బలికినది. 'ధూర్తుడైనమత్స్యనృపాలుడు చూచుచుండగా నాతనియెదుటనే కీచకుడు నన్ను కాలితో దన్నెను' అని యామె పలికినది. కీచకు డింతటి పరాభవ మొనరించియుం డియు దండింపబడలేదని యామె యభిప్రాయము-ద్రౌపది యొక్క ఈమాటలసందర్భ మింకొక్క యభిప్రాయమును గూడ స్ఫురింపించుచున్నది. ఈసంకట పరిస్థితిని దప్పింపక ధర్మజుడూరకొనుట బాగులేదని యిచ్చటి 'తస్య ధూర్తస్య పశ్యతః' అనున దభిప్రాయమును గల్గించుచున్నది. ఈమాట విరాటునకు, ధర్మజునకుగూడ చమత్కారముగా నన్వ యించుచున్నది.

కౌరవసభలో కౌరవులు ద్రౌపదిచేత దాసీవేషము వేయించుటకు విశ్వప్రయత్నము గావించిరి. అది కానీయక గాంభీర్యమును నిలబెట్టుకొనిన దామె. (మహారాజ్ఞిగానే సభ యందు దుదివఱకు నామె నిల్చియుండినది. కౌరవులను

నిందపాలు గావించి పాండవవంశధర్మమునుసుప్రతిష్ఠితముగ రించి ద్రౌపది గాంభీర్యము నిలుపుకొని యున్నది. ఆమహా యిల్లాలు, ఆమహారాజ్ఞి నేడు భర్తల ననువర్తించుచు దాసియగుట కంగీకరించి విరాటకొలువును చేరినది. ప్రపంచమున నేనాడు నెవ్వరికి జరుగనంతటి పరాభవమే యీనా డామెకు గల్గినది. నాడు కౌరవసభలో భీష్మాదులు, ద్రౌపది యెందఱు ప్రసంగించినను తూష్ణీంభూతుడై యుండునట్టి ధర్మబద్ధుండగు ధర్మజు డీనాడు ధర్మరక్షణార్థమే విరాటసభలో భీమసేనునివారించుట, ద్రౌపదినోదార్చుట గావించి యున్నాడు. అట్లయ్యును ద్రౌపదికి గొప్పపరాభవమే యిపుడేర్పడియున్నది. అట్లయినను గీచకుడు దండింప బడకున్నాడు. అందువలన నామెకు ధర్మజునిపై గొప్పకోపమేర్పడినది. ఇచ్చట జటాసురుని సంగతిని ద్రౌపది యెత్తుకొనలేదు. వానిని బాండవులు తుదముట్టించియుండిరి. కాని నావిషయమై యామె యిప్పుడు తడవనేలేదు. తన కష్టములను దెల్పు నీసందర్భమున ద్రౌపది యాద్యంతములందు ధర్మజు నుపాలంభించుచు బలికినది. (౧, ౧౦ శ్లోకములు) పాండవుల కడగండ్ల నన్నియు గ్రమముగా జెప్పుచు ద్రౌపది విచారించినది. ఇప్పట్టున పాండవుల ఘనతను బేర్కొనుట యామె ప్రయోజనముకాదు. ఆచెడు జూదమున సముద్రనేమీపతులగు దనభర్త లెంతటి విషయమునకు బాల్పడినదియు బలికి (తలంచుకొని) విచారించుటయే యామె గావించుచున్నది.

ఉపాస్తేస్మ సభాయాం యం కృత్స్నా వీర వసుంధరా
త ముపాసీన మప్యన్యం పశ్య భారత భారతమ్. ౧౮-౩౩
ఏవం బహువిధై ర్దుఃఖైః పీడ్యమానా మనాథవత్
శోకసాగరమధ్యస్థాం కిం మాం భీమ న పశ్యసి ౩౪
ఇదంతు మే మహద్దుఃఖం యత్ప్రవక్ష్యామి భారత
న మేఽభ్యసూయా కర్తవ్యా దుఃఖా దేత ద్బ్రవీ
మ్యహమ్, ౧౯-౧

... .... .... ....

త్వ య్యేవం నిరయం ప్రాప్తే భీమే భీమపరాక్రమే
శోకే యాధిష్ఠిరే మగ్నా నాహం జీవితు ముత్సహే.౧౩

.... ..... .... ...

నూన మార్యా న జానాతి కృచ్ఛ్రం ప్రాప్తం ధనంజయం
అజాతశత్రుం కౌరవ్యం మగ్నం దుర్ద్యూత దేవినమ్. ౩౧

... ... .... ....

కిన్ను మాం మన్యసే పార్థ సుఖినీతి పరంతప
ఏవం దుఃఖసమావిష్టా యుధిష్ఠిరనిమిత్తతః. ౪౫
అంతఃప్రతివిశిష్టాని దుఃఖా న్యన్యాని భారత
వర్తంతే మయి కౌంతేయ వక్ష్యామి శృణు తాన్యపి.౪౬
యుష్మాసు ధ్రియమాణేషు దుఃఖాని వివిధా న్యుత
శోషయంతి శరీరం మే కిన్ను దుఃఖ మతః పరమ్. ౪౭
అహం సైరంధ్రివేషేణ చరంతీ రాజవేశ్మని
శౌచదాఽస్మి సుదేష్ణాయా అక్షధూర్తస్య కారణాత్.

విక్రియాం పశ్య మే తీవ్రాం రాజపుత్ర్యాః పరంతప
ఆత్మకాల ముపేక్షంతీ సర్వం దుఃఖం కి లాంతవత్ ౨
అనిత్యా కిల మర్త్యానా మర్థసిద్ధి ర్జయాజయా
ఇతికృత్వా ప్రతీక్షామి భర్తౄణా ముదయం పునః. 3
చక్రవ త్పరివర్తంతే హ్యర్థాశ్చ వ్యసనానిచ
ఇతికృత్వా ప్రతీక్షామి భర్తౄణా ముదయం పునః. ౪
య ఏకహేతు ర్భవతి పురుషస్య జయావహః
పరాజయేచ హేతుశ్చ స ఇతి ప్రతిపాలయే. ౫
కిం మాం న ప్రతిజానీషే భీమసేన మ్మృతా మివ
దత్వా యాచంతి పురుషా హత్వా వధ్యంతి చాఽపరే. ౬
పాతయిత్వాచ పాత్యంతే పరై రితిచ మే శ్రుతం
న దైవస్యాతిభారోఽస్తి న చైవాస్యాఽతివర్తనమ్. ౭
ఇతి చాప్యాగమం భూయో దైవస్య ప్రతిపాలయే. ౮
స్థితం పూర్వం జలం యత్ర పున స్తత్రైవ గచ్ఛతి
ఇత పర్యాయ మిచ్ఛంతీ ప్రతీక్షే హ్యుదయం పునః. ౯
దైవేన కిల యస్యార్థ స్సునీతోఽపి విపద్యతే
దైవస్య చాగమే యత్న స్తేన కార్యో విజానతా. ౧౦
యత్తు మే వచన స్యాస్య కథితస్య ప్రయోజనం
పృచ్ఛ మాం దుఃఖితాం తత్త్వం పృష్టా చాఽత్ర
బ్రవీమి తే. ౧౧
మహిషీ పాండుపుత్రాణాం దుహితా ద్రుపదస్యచ
ఇమా మవస్థాం సంప్రాప్తా మదన్యా కా జిజీవిషేత్. ౧౨

కురూణాం పరిభవేత్సర్వాన్ పాంచాలానపి భారత
పాండవేయాంశ్చ సంప్రాప్తో మమ క్లేశో హ్యరిందమ ౧౩
భ్రాతృభి శ్శ్వశురైః పుత్త్రై ర్బహుభిః పరివారితా
ఏవం సముదితా నారీ కాత్వన్యా దుఃఖితా భవేత్ ౧౪
నూనంహి బాలయా ధాతుర్మయా వై విప్రియంకృతం
యస్యప్రసాదా ద్దుర్నీతం ప్రాప్తాఽస్మి భరతర్షభ. ౧౫
వర్ణావకాశ మపి మే పశ్య పాండవ ,యాదృశం
తాదృశో మేన తత్రాఽసీ ద్దుఃఖే పరమకే తదా ౧౬
త్వమేవ భీమ జానీషే యన్మే పార్థ సుఖం పురా
సాహం దాసీత్వ మాపన్నా న శాంతి మవశా లభే ౧౭
నాఽదైవిక మహం మన్యే యత్ర పార్థో ధనంజయః
భీమధన్వా మహాబాహు రాస్తే ఛన్న ఇవానలః ౧౮
అశక్యా వేదితుం పార్థ ప్రాణినాంవై గతి ర్నరైః
వినిపాత మిమం మన్యే యుష్మాకం హ్యవిచింతితమ్ ౧౯
యస్యా మమ సుఖప్రేక్ష్యా యూయ మింద్రసమాస్సదా
సా ప్రేక్షే సుఖ మన్యాసా మవరాణాం వరా సతీ ౨౦
పశ్య పాండవ మేఽవస్థాం యథా నార్హామివై తథా
యుష్మాసు ధ్రియమాణేషు పశ్య కాలస్య పర్యయమ్ ౨౧
యస్యా స్సాగరపర్యంతా పృథివీ వశవర్తినీ
ఆసీ త్సాఽద్య సుధేష్ణాయా భీతాహం వశవర్తినీ ౨౨
యస్యాః పురస్సరా ఆసన్ పృష్ఠత శ్చాఽనుగామినః
సాఽహమద్య సుధేష్ణాయాః పురఃపశ్చాచ్చగామినీ ౨౩

ఇదంతు దుఃఖం కౌంతేయ మమాసహ్యంనిబోధతత్ ౨౩
యా న జాతు స్వయం పింషే గాత్రోద్వర్తన మాత్మనః
అస్యత్రి కుంత్యా భద్రంతే సాపినష్మ్యద్య చందనమ్ ౨౪
పశ్య కౌంతేయ పాణీమే నైవాఽభూతాంహి యాపురా
ఇత్యస్య దర్శయామాస కిణవంతౌ కరౌ వృభౌ ౨౫
బి భేమి కుంత్యా యానాఽహం యుష్మాకంవా కదాచన
సాఽద్యాఽగ్రితో విరాటస్య భీతా తిష్ఠామి కింకరీ ౨౬
కిన్ను వక్ష్యతి సమ్రాణ్మాం వర్ణక స్సుకృతోనవా
నాఽన్యపిష్టంహి మత్స్యస్య చందనం కిలరోచతే ౨౭
సా కీర్తయంతీ దుఃఖాని భీమసేనస్య భామినీ
రురోద శనకైః కృష్ణా భీమసేన ముదీక్షతీ ౨౮
సా బాష్పకలయా వాచా నిశ్వసంతీ పునః పునః
హృదయం భీమసేనస్య ఘటయంతీ ద మబ్రవీత్ ౨౯
ద్రౌ ప దీ
నాఽల్పం కృతం మయా భీమ దేవానాం కిల్బిషం పురా
అభాగ్యా యత్రజీవామి కర్తవ్యే సతి పాండవ ౩౦
*రాజసభయందు వసుంధరయంతయు నెవ్వానినుపా
సించుచుండెనో యాభారతుని(ధర్మరాజును)భార తా(భీమా)

* రాజ్యపరిత్యాగ మొంది, తన్ను, సర్వస్వమును ద్యూతపణము
గావించువాడు దుర్ద్యూతదేవనుడుగాక యింకెవ్వడుండును. అహోరాత్ర
గణములు జూదమాడినను ఇట్లెన్నిసంవత్సరములు జూదమాడినను తఱుగని
యుదంతసంపదగల్గి, ధనపశుసర్వసంపన్నుడై యుండినవాడు ద్యూతప్రవాద

అన్యు నుపాసించుచున్నట్టి యాతని దిలకింపుము. ఇట్టి బహువిధదుఃఖములచే ననాథమాడిక్క పీడింపబడు శోకసాగరమధ్యమున సంపదబోయి (శ్రియా పరిత్యక్తవరోపితః) తూష్ణీంభూతుడై స్వకృత్యముల జింతించుచు మూగవానట్లున్నాడు. దశనాగసహస్రములు, హేమమాలాహయము నెవ్వాని ననుసరించియుండినవో యాతడు ద్యూతమున జీవించుచున్నాడు. ఇంద్రప్రస్థమందు శతసహస్రరథములు, అమితౌజస్కులగు రాజన్యులు యుధిష్ఠిరు నుపాసించుచుండిరి. పాత్రీహస్తులగు సహస్రములు పరిజను లాతనిమహానసమందు దివారాత్రములు లతిథిభోజనము గావించుచుండిరి. అట్టి నిష్కసహస్రప్రదాత, దదతాంవరుడు యుధిష్ఠిరుడు ద్యూతజానర్థమగ్నుడై యున్నాడు. సుమృష్టమణికుండలములుగల్గి స్వరసంపన్నులగు సూతమాగధులు సాయం ప్రాతములందు నుతించెడువారు. తపఃశ్రుతోపసంపన్నులగు వేయిమందిబుధు లనునిత్యము సభాసదులై సర్వకామ సమృద్ధులగుచుండిరి. నుప్పదిమందిదాసీజన మొక్కరికి నుపచారములు గావించుచుండ నిట్టిస్నాతకుల నష్టాశీతిసహస్రగృహమేధులను యుధిష్ఠిరుడు భరించుచుండెను. అప్రతిగ్రహులగు నూర్ధ్వరేతస్కులు యతులు పదివేవు రనునిత్య మాతని వర్తించియుండిరి. ఆనృశంస్యము, అనుక్రోశము, సంవిభాగము-సర్వమాతని గుణసంపదనై యున్నది. అట్టివాడిపుడు విరాటసభలో వర్తించుచున్నాడు. దుర్గతులగు నంధులను, వృద్ధులను, అనాథులను, బాలురను భరించిపోషించు నుదారుడతడు, ధృతిమంతుడు, సత్యవిక్రముడు నగు నా యుధిష్ఠిరుడిపుడు వినయమొంది మత్స్యపరిచారకుడై విరాటసభయందు ద్యూతప్రవర్తకుడై కంకుడనని పలుకుచున్నాడు. ఇంద్రప్రస్థమందెవ్వానికి సర్వపార్థివులు బలిభృతు లగుచుండిరో యాతడిపు డన్యులవలన భృతి నిచ్ఛయించుచున్నవాడు. పృథివీపాలురగు పార్థివు లెల్ల నెవ్వానికి వశవర్తులై యుండిరో యాయుధిష్ఠిరుడిపుడు నవ్యశవివశుడై పరవశమందు వర్తించుచున్నాడు. (స్వవశే వివశో రాజా

స్థనగునన్ను భీమా చూడకుంటి వేలనో. ఈమహద్దుఃఖమును దెల్పుచున్నాను. నాయందసూయ చేయవలదు. దుఃఖముననే దీనిని దెల్పుచున్నాను .. ♦ భీమపరాక్రముండవగు నీయం దిట్టినిరయము (సూదతనము) మల్లుతనము ప్రాప్తింపగా యుధిష్ఠిరశోకమగ్నయైననేను జీవింపనుత్సహింపను... * కృచ్ఛ్రప్రాప్తుడై యున్న ధనంజయుని ఆయ

పరేషా మద్య వర్తతే) రశ్మివంతుడగు భాస్కరునట్లు పృథివినెల్ల దేజమున వెలిగించినయుధిష్ఠిరు డిపుడు విరాటునకు సభాస్తారుడైనాడు. ఋషిసహితులగురాజులచే రాజాస్థానము దుపాసింపబడువా డిపు డన్యు నుపాసించుచున్నాడు. ఓపాండవ! యట్టిపాండవుని గనుగొనుము. పరప్రియవాదియై సదస్యుడై విరాటసభయందున్న యుధిష్ఠిరునిజూచి నాకు కోపము వృద్ధియగుచున్నది. నిస్సంశయ మిది. అందుకుదగనివాడు, జీవితార్థాభిసంస్థితుడై నిలిచియున్న యుధిష్ఠిరునిజూచి-యాధర్మాత్ముని గాంచి యెవ్వనికి దుఃఖముగలుగదు. - ద్రౌపది యిట్లుగా ధర్మజునిగూర్చి భీమునితో బలికి విచారించినది.

♦ భీముడు సూదుడుగను, మల్లుడుగను విరాట నగరమున నిలిచియుండుటకు ద్రౌపది కడువిచారమును భీమునితో బలికినది. భీముడు కుంజరములతో బోట్లాడునపు డంతఃపురకాంతలు గొల్లుమని హసించువారు, ద్రౌపదిమవ మపు డెరియుచుండెడిది. ఇది కనిపెట్టి సైరంధ్రిని సూదునందు శంకించి సుధేష్ణకోపమొంది గద్దించిపలుకజొచ్చినది. నిత్య మీవిధముగా విరాటునంతఃపురమున దుఃఖమనుభవించుచున్న ద్రౌపది భీమున కీపరిస్థితిని దెల్పి మిక్కిలిగా విచారించినది.

* అర్జునునిపరిస్థితి భీముని కెఱింగించుచు ద్రౌపది యిట్లు బహుదుఃఖ మొందినది. ఏకరథుడై సర్వజయమొందినవాడు 'కన్యాపరివృతు

జాతశత్రువందు, గౌరవ్యునందు, దుర్ద్యూతదేవనునందు
మగ్నుడై పోయిన యర్జునుని పూజ్యురాలు (కుంతి) తెలియ
లేదు...యుధిష్ఠిర నిమిత్తముగా నిట్లు దుఃఖశతావిష్టనై
యున్న నన్ను సుఖవంతురాలనని తలంచుచుంటివా' అని

---

డగుటకు, జాతవేదుని ఖాండవవనమున సంతృప్తుని గావించినవాడు కూపా
గ్నియట్లగుటకు, శత్రుభయంకరుడు లోకపరిభూతవేష మొందియుండుటకు,
జ్యాక్షేపకఠినములగు నాపరిఘబాహువులు శంఖపరిపూర్ణమై యుండుటకు
శాత్రవకంపితజ్యాతలనిర్ఘోషుడగువాడు స్త్రీలు ముదమొంది వినునట్టి
గాయకుడగుటకు, కిరీటశోభిత మూర్ధన్యుడగువాడు వేణీవికృతికేశాంతు
డగుటకు, కన్యాపరివృతుడగుటకు, దివ్యాస్త్ర సర్వవిద్యాసంపన్నుడగు
వాడు కుండలధారియగుటకు, రణరంగమున రాజన్యసహస్ర మెవ్వానితేజ
మున కణంగియుండెనో యాతడిపుడు వేషప్రతిచ్ఛన్నుడై కన్యాపరిచారకు
డగుటకు ద్రౌపది కడువిచారించినది. 'సపర్వతవనమగు స్థావరజంగమాత్మక
మైన మేదిని యెవ్వానిరథఘోషమున గంపించెడికో, ఎవండు జాతమాత్ర
మున కుంతీమాత శోకమును విడనాడినదో యాతడు నాకిపుడు శోచనీయ
పరిస్థితిగా నున్నవాడు. అలంకార విభూషితుండగువాడు కంబుపాణిగా
వచ్చుటను జూచి నామనస్సు విచారించుచున్నది. (సీదతి) అని భీమునితో
బలికి ద్రౌపదివిచారించినది. భువి న్రపతిమానవీరవరుడు, మేటిధనుర్ధారి
యగువాడు స్త్రీ వేషవికృతుడై యుండుటకు, దేవరూపుండగువాడు
కరేణుపరికీర్ణ ప్రభిన్నమాతంగమట్లుగా గన్యాపరివృతుడై యర్థ
పతి విరాటునెదుట తూర్యమధ్యస్థుడగుటకు ద్రౌపది కడువిచారమును
వెలిబుచ్చినది. 'నామనసు కొట్టుకొనుచున్నది. నాకు దిక్కులుగానవచ్చుట
లేదు' అని పలికినది. (పార్థం దృష్ట్వా సీదతి మే మనః॥ పశ్యామితూర్య
మధ్యస్థం దిశో నశ్యంతి మే తదా)

ద్రౌపది భీమునితో * నకుల సహదేవుల కడగండ్లను దెల్పి విచారించినది. అంతః ప్రతిష్టమగు నన్య దుఃఖములు గలవు. కౌంతేయుడా! వానిని జెప్పెదను వినుము. మీరలు బ్రతికి యుండగా (యుష్మాస్సుధ్రియమాణేషు) వివిధ దుఃఖములు నాయొడలిని శోషింపజేయుచున్నవి. ఇంతకన్న వేఱుదుఃఖ మింకేమిగలదు. అక్షధూర్తుని కారణమున నేను సైరంధ్రి వేషమున విరాటరాజగృహమున సుధేష్ణకు శౌచదాసిగా నున్నాను. పరంతపా! రాజపుత్రినగు నాకు గల్గిన యీతీవ్ర విక్రియమును చూడుము. సర్వదుఃఖ మంతమొందునని యాత్మకాలమపేక్షించి యున్నదానను. అర్థసిద్ధి, జయా

* గోవేషధారియై, గోపాలవేషగుడై గోవులందువర్తించు సహదేవునిగాంచి నేను పాండుభూత నగుచున్నాను. నాకునిద్రవచ్చుటలేదు. సహదేవుని కుంతీదేవి నిత్యము ప్రశంసించుచుండును. వనమందుండునపుడు సహదేవుని నేను కనిపెట్టుచుండుము. పాంచాలీ స్వయము నీవు సహదేవునకు భోజనమిడుము-పుత్రగృద్ధినియగు కుంతియట్లు పలుకుచు సహదేవుని వనమునకు వెడలునపుడు పరిష్వంగమొనరించుకొని విచారించినది. వత్సచర్మవ్యాపాశ్రయుడై గోవులందు వర్తించియుండునట్టి సహదేవునిగాంచుచు జీవించియుంటి నేలనో. రూపాస్త్రమేధస్సులందు నిత్యసంపన్నుడగు నకులుడు విరాటునకు కళ్ళెబంధుడైనాడు. కాలవిపర్యము గాంచుము, విరాటుడు మాచుమండ నాతనియెదుట నశ్వవశ్య మొనరించువాడగుచుండు, విరాటునకు గుఱ్ఱములజూపెట్టునాడగుటకు ఖేదపడుచున్నాను. అట్టి నకులుని జూచుచున్నదాన నింక సుఖవంతురాలనని తలంచెదవా-ద్రౌపది సహదేవునిగూర్చి నకులుని గూర్చి విచారించి భీమునితో కష్టములనెల్ల బలికినది.

జయములు మనుష్యుల కనిత్యములైనవికదా యని చేసి భర్త
లకు మరల నుదయము గల్గగలదని యాత్మకాల మపేక్షించి
ప్రతీక్షించి యున్నదానను. అర్థములు వ్యసనములు చక్రి
మట్లు పరివర్తన మగునని చేసి భర్తలయొక్క యుద
యము మరల గలుగునని ప్రతీక్షించుచున్నదాన. పురుషున
కెయ్యది జయావహమగు నొక్క హేతువయగునో
పరాజయమున కది హేతువు కాగలదని ప్రతీక్షించుచున్న
దాన (ప్రతిపాలయే) భీమసేన! మృతినొందినట్లున్న నన్ను
నీవేల తెలియకుంటివో. ఇచ్చియే యాచించు వారగుదురు
పురుషులు, మఱికొందఱు చంపి చంపబడువా రగుదురు, పాత
మొనరించి పాతమొరులచే నొందువా రగుదురంచు విని
యున్నదానను. దైవమున కతిభారము లేదతివర్తనము
లేదు. ఇట్లు మరల భాగ్యమునుగోరి దైవప్రతిపాలన మొన
రించుచున్నదానను. నీదు పూర్వమున్న చోటునకే మరల
జేరునంచు బర్యాయ మపేక్షించి మరల యుదయమగునని
ప్రతీక్షించి యున్నదాన. నీతుడైనను నెవ్వాని యర్థము
దైవమున విపత్తి నొందినదగునో యాతడు—జ్ఞాతుడగు
వాడు దైవాగమ మప్పుడు యత్నపరుండగుట కార్యమగును.
ఇట్లు పలికిన వచనప్రయోజన మేమని దుఃఖితనగు నన్ను
యథార్థ మడుగుము—అడిగినచో నీకది తెల్పెదను. పాండు
పుత్రులకు మహిషిని, ద్రుపదునకు దుహితనునగు నే నిట్టి
యవస్థ నొందియున్నాను. నాకన్న వెఱొక స్త్రీ యెవ్వతె

యిట్లు జీవించియుండును. భారత! అరిందమా! నాయీ క్లేశము కౌరవులనెల్ల పరిభవింపజేయును, పాంచాలురనుగూడ మఱియు పాండవేయుల కిది పరిభవమే కల్గించును. భ్రాతృశ్వశురపుత్రబహుపరివారయుతయగు నిట్టి సముదయము గల్గిన నాలి నాకన్న నేఱెవ్వరిట్లు దుఃఖితురాలగును. బాలనగు నాచే దైవవైపరీత్యము గావింపబడియుండినది, భరతర్షభ! ఎవ్వనిచే (యస్య ప్రసాదాత్) సుక్షితమైతినో గదా. పాండవ! నావర్ణానకాశమెట్టి దదియిపు డెట్లున్నదో చూడుము. బహుదుఃఖమొందియున్నందున నేనిట్లయితిని. భీమ! నాపూర్వసౌఖ్యముల నెల్ల నీవే యెరుంగుదువుకదా. ఆనేను దాసినై యవశనై శాంతినొందకున్నాను. ఎచ్చట ధనంజయుడుండునో యచ్చట నద్దైనిక ముండదని తలంతును. ఆభీమధన్వుడు, మహానుభావుడు భస్మానల మట్లున్నవాడు. ప్రాణులయొక్కగతి నరులెఱుంగుట కశక్యమైనది. మీకిది యచింతిత వినిపాతమని తలంతును. ఇంద్రసమానులైన మీర లెద్దాని సుఖమును గాంచువారలో యానరపతినగు నే నవరులగుస్త్రీల సౌఖ్యమును చూచుదాననైతిని. పాండవ! చూడు మెట్టిదై యున్నదో నాయవస్థ యట్టిదానికి దగునుకదా. మీరలు బ్రతికియుండగా గాలపర్యయ మిది చూడుము సాగరపర్యంతమగు పృథివియెల్ల నెవర్తెకు వశవర్తమై యుండునో యా నేను సుధేష్ణకిపుడు వశవర్తినినై భీతనై యున్నదానను. పురఃపశ్చాదనుగామిని నగు నేనిపుడు

సుధేష్ణకు ముందు వెనుకలం దనుసరించి ప్రవర్తించుదాన నైతిని. అసహ్యమగు నాయీదుఃఖమును దెలియుము. కుం తికిగాక నాకును స్వకుము గాత్రోద్వర్తన మొనర్చినదానను కానో యానేను విరాటునింట గంధము దీయుచున్నాను. కౌంతేయా! నాచేతులిపుడు యెట్లున్నవో చూడుము ఇట్లనుచు ద్రౌపది కాయలు గాచిన రెండు చేతులు భీమునకుజూపి 'కుంతికి భయపడ లేదు. మీకును భయమొందియుండ లేదు, ఆనేను విరాటు నెదుట భీతురాలనై నిలిచియున్నాను. ఆ సామ్రాట్టు నేనుంచియున్నవర్ణకము బాగు, కాదు-ఏమనునో యని భయమొంది కింకరినై నిలిచియున్న దాననైతిని. ఆ విరాటుడు నేను దీసిన దాని నేకాని వేఱొక నలుగు, చం దన మంగీకరించువాడు కాడు. భీమునితో ద్రౌపది తన దుఃఖము నిట్లుదెల్పి మెల్లగా నేడ్చుచు నాభీముని దిలకించి నది, డగ్గుత్తికగల్గి మరల మరల నిట్టూర్పు విడుచుచు భీమ హృదయమును భేదించుచు మఱియు నిట్లు పలికినది. 'నేను వెనుక దేవతలం దల్పాపరాధము గావించలేదు. అభాగ్య రాలను. కర్తవ్య మందిట్లు పాండవ! జీవించియున్న దానను' అని పలికెను.

ద్రౌపది పాండవుల కష్టములను పలుకుటలో ధర్మ జుడు, భీముడు, అర్జునుడు, సహదేవుడు, నకులుడు—ఈ వరుస యిచ్చుట వ్రాయబడి యున్నది. అశ్వశాలయం దుండు నకులు డంతతఱచుగా ద్రౌపదికి గనబడువాడు కాడు.

అందువలన నకులునిగూర్చి ద్రౌపది చివరగా బలికినదని యీవరుస వ్యక్తీకరించుచున్నది. భర్తల కడగండ్లనెల్ల దెల్పి ద్రౌపది తన యిక్కట్టులనెల్లదెల్పి దుఃఖించినది. ఈ యధ్యాయమందలి శ్లోకములన్నియు ద్రౌపది కష్టపరంపరల నెల్ల నెక్కువెక్కువగా వెల్లడించుచున్నవి. దేవతలవిషయమై యపరాధమొనర్చుట పెద్దకిల్బిషమగును. ద్రౌపది చివరకట్టి కష్టపుమాట పలికినది.

తత స్తస్యాః కరౌ సూక్ష్మౌ కిణవంతౌ వృకోదరః
ముఖ మానీయ వై పత్న్యా రురోద పరవీరహా. ౩౧
తౌ గృహీత్వాచ కౌంతేయో బాష్పముత్సృజ్యవీర్యవాన్
తతః పరమదుఃఖార్తః ఇదం వచన మబ్రవీత్. ౩౨
ధిగస్తు మే బాహుబలం గాండీవం ఫల్గునస్యచ
యత్తే రక్తౌ పురా భూత్వా పాణీకృతకిణౌ విమౌ. ౨౧-౧
సభాయాంతు విరాటస్య కరోమి కదనం మహత్
తత్ర మే కారణం భాతి కౌంతేయో య త్ప్రతీక్షతే ౨
అథవా కీచకస్యాఽహం పోథయామి పదా శిరః
ఐశ్వర్యమదమత్తస్య క్రీడ న్నివమహాద్విపః. ౩
అపశ్యం త్వాం యదా కృష్ణే కీచకేన పదా హతాం
తదే వాహం చికీర్షామి మత్స్యానాం కదనం మహత్. ౪
తత్ర మాం ధర్మరాజస్తు కటాక్షేణ న్యవారయత్
తదహం తస్యవిజ్ఞాయ స్థిత ఏవాఽస్మి భామిని. ౫

యచ్చ రాష్ట్రాత్ ప్రచ్యవనం కురూణా మపథశ్చ యః
సుయోధనస్య కర్ణస్య శకునే స్సౌబలస్యచ. ౬
*దుశ్శాసనస్య పాపస్య యన్మయా నహృతం శిరః
తన్మే దహతి గాత్రాణి హృది శల్య మివార్పితమ్. ౭
మా ధర్మం జహి సుశ్రోణి క్రోధం జహి మహామతే
ఇదంతు సముపాలంభం త్వత్తో రాజా యుధిష్ఠిరః ౮
శృణు యా ద్యాపి కల్యాణి కృత్స్నం జహ్యాత్స జీవితం
ధనంజయో వా సుశ్రోణి యమౌ వా తనుమధ్యమే. ౯
లోకాంతరగతే ష్వేషు నాహం శక్ష్యామి జీవితమ్. ౧౦

(పరవీరహంతయగు వృకోదరు డామెయొక్క సూక్ష్మములగుచేతు లట్లు కాయలు గాచియుండుట జూచి తన మోముపై నిడికొని రోదనమొనరించెను. ఆమె చేతులను బట్టుకొని కౌంతేయుడు బాష్పమోచన మొనరించి యపుడు పరమదుఃఖార్తుడై యీమాట పలికెను. 'వ్యర్థమైనదే నా బాహుబల మర్జునుని గాండీవము వ్యర్థమే, ఎఱ్ఱని నీచేతులు కాయలు గాచుటను చూచుచున్నానుకదా, విరాటసభయందే మహత్కధనము గావించువాడనే. కారణమపుడు భాసించినది. నన్ను ధర్మజుడు చూచుట జరిగినది. అట్లు కానిచో నైశ్వర్యమదమత్తుడై మహాద్విపమట్లు క్రీడించు

* భీముడు దుష్టచతుష్టయమును వధించుటను చేర్కొనుచు 'నహృతం శిరః' అని యేకవచనముగా బలుకుట, 'దుశ్శాసనస్య పాపస్య' అని పలుకుట సాభిప్రాయముగా నున్నది.

కట్టుకొన్న యాకీచకుని శిరము నపుడే పాదప్రహారమున బడ గొట్టి యుండువాడనే. కృష్ణా! ఎపుడు కీచకునిచే పాదహత మైనదానిగా నిన్ను గాంచితినో యపుడే మాత్స్యలతో మహాత్కదన మొనరించియే యుండువాడను. అపుడు ధర్మ జుడు నన్ను నివారించెను. అదిగాంచి భామినీ! నేనట్లే నిలిచి పోయితిని. రాజ్యప్రచ్యవనము, కౌరవుల నధఃపతితుల గావింపకుండుట, సుయోధన కర్ణ శకుని దుశ్శాసనుల శిర ములు దుంపకుండుట— యాది నాయంగముల దహించు చున్నది, హృదిశల్యము గానున్నది. ధర్మమును విడనాడ కుము, సుశ్రోణి! క్రోధమును విడువుము. ఈసముపాలంభ నము నీవలన రాజు యుధిష్ఠిరుడు వినినటులైన నవశ్యము జీవితము త్యజించును, ధనంజయుడుగాని, సుశ్రోణి! కవలలు గాని వినినచో—వారు లోకాంతరగతులగుచో నేను జీవింప జాలను. పూర్వము సుకన్యయను భార్య వల్మీకభూతుడైన భర్త భార్గవచ్యవనుని వనమం దనుసరించియుండెను రూప మున నప్రతిమానయగు నారాయణీచంద్రసేన వర్షసహస్ర వృద్ధుడైన పతిని పూర్వమనుసరించియుండెను. జనకుని కూతురు వైదేహి సీత మహారణ్యనివాసియగు పతి ననుస రించిపోయెను. ఆరాముని ప్రియమహిషి రాక్షసనిగ్రహ మొందియు క్లిశ్యమానయైనను యాపరమసాధ్వి రామునిబాం దినది. భీరు! వయోరూపసమన్వితయగు లోపాముద్ర యమానుష సర్వకామముల విడనాడి యగస్త్యుని ననుసరించి

యుండెను. ద్యుమత్సేనసుతుని వీరుని సత్యవంతుని పునస్వినియగు సావిత్రియొక్కతెయే యమలోకమున కనుసరించిపోయినది. రూపవతులు, పతివ్రతలునగు వీరలమాడ్కి కళ్యాణి నీవును సకలసద్గుణవిశిష్టురాలవై యున్నావు ఈమెయొక్క పక్షము నీకొలదికాలము నోర్చియుండుము. పదుమూడవయేడు నిండగనే రాజ్ఞులకు రాజ్ఞివి కాగలవు—అని భీముడు ద్రౌపదితో పలికెను.)

అంతటికడగండ్లు భర్తలకు, దనకు వచ్చినందులకు ద్రౌపది భీమునితో పెక్కుసంకట వచనములు పలికినది తనకష్టములుదెల్పుటయందాద్యంతములందామె 'యుష్మాసు ధ్రియమాణేషు' అని (౧౯-౩౭, ౨౦-౨౧) రెండుమారులుగా పలికినది; కాయలుకాచినచేతులను జూపించి 'కింకరినై విరాటునెదుట నిల్చియుండు దానను, ఇదంతయు బుద్ధికృతపారబ్ధము, దైవవైపరీత్యము' అని భీముని పరీక్షించుచు ద్రౌపది పలికినది. భీమసేనుడామె చేతులుపట్టి ముఖమందు నద్దుకొని రోదనమొనరించెను, కన్నీరుగార్చుచు పరమదుఃఖార్తుడై తనబాహుబలమును ల్గునుని గాండీవము వ్యర్థమంచు కష్టవచనము పలికినాడు. విరాటసభయందే ప్రతిక్రియగావించకుండుట కేర్పడిన నిరోధపరిస్థితిని బలుకుచు నాదినుండియైన కష్టదశనెల్ల భీముకు దేశికవచనముగా బలికినాడు. [ద్రౌపది యాదినుండియైన కడగండ్లను జెప్పి (౧౮-౧-౧౦) పిమ్మట విరాటనగరకష్టములనెల్ల బలికినది. భీముడును

* ధర్మజుని నివారణమున దనయందుదటస్థించిన పరిస్థితిని దెల్పి యాదినుండియైన కష్టదశ నెల్లపలికినాడు. 'పాపుండగు దుశ్శాసనుని శిరము ద్రెంపకుండుటవలన నది నాగాత్రముల దహించుచున్నది; హృదయశల్యమైయున్నది' యని పలుకుచునే ధార్మికవరుండగు భీముడు 'మా ధర్మంజహి సుశ్రోణి క్రోధం జహి మహామతే' అని పరమయోగ్యవచన ముచ్చరించినాడు. ద్రౌపదియొక్క మాఃస్పృష్ఠుకవచనములు విని నచో ధర్మజుడు జీవితము త్యజించుననియు, భర్తలందఱు నాత్మఘాతకు లొప్పుడువారుగాగలరనియు–నంతటితీక్ష్ణముగా నామాటలున్నవనియు భీముడు సూచించువాడయినాడు. మఱియు భర్తల ననుసరించి ప్రవర్తించిన పరమపతివ్రతల చారిత్రగాంభీర్యమును వివరించిపలికినాడు.

యథైతాః కీర్తితా నార్యో రూపవత్యః పతివ్రతాః
తథా త్వమపి కల్యాణి సర్వైస్సముదితా గుణైః ౧౭
మా దీర్ఘం క్షమ కాలం త్వం మాసమర్ధంచ సమ్మితం
పూర్ణే త్రయోదశే వర్షే రాజ్ఞాం రాజ్ఞీ భవిష్యసి ౧౮

(ఈరూపవతులు, పతివ్రతలమాడ్కి కళ్యాణి నీవును సకలసద్గుణవిశిష్టురాలవై యున్నావు. ఈయొక్కపక్షము–

* 'కౌంతేయో యత్ప్రతీక్షతే, ధర్మరాజస్తు మాం కటాక్షేణ న్యవారయత్' అని భీముడు పలికినాడు. ఇది పరిస్థితిని, భీమపరిస్థితిని సువ్యక్తమొనరించుచున్నది. 'ఇందలి కౌంతేయః' అనునది భ్రాతృత్వమును జ్యేష్ఠత్వమును సూచించుచున్నది, 'ధర్మరాజస్తు' అనునది ధర్మగౌరవమును సూచించుచున్నది.

నీకొలదికాలమునోర్చియుండుము, పదుమూడవయేడు దాటగనే రాజులకు రాజ్ఞివి కాగలవు)

భీముడు రూపవతులగు పతివ్రతల చారిత్రగాంభీర్యమును ప్రపంచించి పలుకుట గంభీరముగానున్నది. ధర్మరాజు కూడ విరాటసభయందు వీరపత్నుల చారిత్రగాంభీర్యమే వ్యక్తీకరించి ద్రౌపదికి సమాధానవచనము పలికినాడు. (౧౯—౪౨) సర్వగుణసంపన్నురాలగు ద్రౌపదిని భీముడు ఘనతరమగునోదార్పు గావించినాడు. 'పూర్ణే త్రయోదశే వర్షే రాజ్ఞాం రాజ్ఞీ భవిష్యసి'. అని యోదార్చినాడు. అపుడు ప్రమాదపరిస్థితిగానేర్పడియున్న కీచకసంరంభమంతయు నిట్లుగా ద్రౌపది దెల్పినది.

* ఆర్తయైత స్మయా భీమ కృతం బాష్పప్రమోచనం
అపారయంత్యా దుఃఖాని న రాజాన ముపాలభే ౧౯
కిముక్తేన వ్యతీతేన భీమసేన మహాబల
ప్రత్యుపస్థిత కాలస్య కార్యస్యాఽనంతరో భవ ౨౦
మమేహ భీమ కైకేయీ రూపాఽభిభవ శంకయా
నిత్య ముద్విజతే రాజా కథం నేయా దిమా మితి ౨౧
తస్యాః విదిత్వా తం భావం స్వయం చాఽనృతదర్శనః
కీచకోఽయం సుదుష్టాత్మా సదా ప్రార్థయతేహి మామ్

* ద్రౌపది భర్తలయొక్క దశావైపరీత్యమునకు గడువాపోయినదని, ధర్మజుని నిందించుట కాదని యీశ్లోకము సువ్యక్తముచేయుచున్నది. ద్రౌపది బాష్పప్రమోచనమే కావించినదని యభిప్రాయము.

త మహాం కుపితా భీమ పునః కోపం నియమ్యచ
అబ్రువం కామసంమూఢ మాత్మానం రక్ష కీచక ౨౩
గంధర్వాణా మహం భార్యా పంచానాం మహిషీ ప్రియా
తే త్వాం నిహన్యుః కుపితా శూరా స్సాహసకారిణః ౨౪
ఏవ ముక్తస్సుదుష్టాత్మా కీచకః ప్రత్యువాచహ
నాఽహం బిభేమి సైరంధ్రి గంధర్వాణాం శుచిస్మితే ౨౫
శతం శతసహస్రాణి గంధర్వాణా మహం రణే
సమాగతం హనిష్యామి త్వం భీరు కురు మేక్షణమ్ ౨౬
ఇత్యుక్తే చాఽబ్రువం మత్తం కామాతుర మహం పునః
న త్వం ప్రతిబల శ్చైషాం గంధర్వాణాం యశస్వినామ్
అథ మాం తత్ర కైకేయి ప్రేషయేత్ ప్రణయేనతు ౨౭
తేనైవ ప్రేషితా పూర్వం భ్రాతృప్రియచికీర్షయా
సురామానయ కళ్యాణి కీచకస్య నివేశనాత్ ౩౦
సూతపుత్రస్తు మాం దృష్ట్వా మహత్సాంత్వ మవర్తయత్
సాంత్వే ప్రతిహతే క్రుద్ధః పరామర్శమనాభవత్ ౩౧
విదిత్వా తస్య సంకల్పం కీచకస్య దురాత్మనః
తథాఽహం రాజశరణం జవేనైవ ప్రధావితా ౩౨
సందర్శనేతు మాం రాజ్ఞ స్సూతపుత్రః పరామృశత్
పాతయిత్వాతు దుష్టాత్మా పదాఽహం తేన తాడితా ౩౩
ప్రేక్షతేస్మ విరాటస్తు కంకస్తు బహవో జనాః
రథినః పీఠమర్దాశ్చ హస్త్యారోహాశ్చ నైగమాః ౩౪

ఉపాలబ్ధో మయా రాజా కంకశ్చాపి పునః పునః
తతో న వారితో రాజ్ఞా న తస్య వినయః కృతః ౩౫
యోఽయం రాజ్ఞో విరాటస్య కీచకో నామ సారథిః ౩౬
త్యక్తధర్మా నృశంసశ్చ పరస్త్రీసంమతః ప్రియః
శూరోఽభిమానీ పాపాత్మా సర్వార్థేషు చ ముగ్ధవాన్
దారామర్శీ మహాభాగ లభతేఽర్థాన్ బహూనపి ౩౭
ఆహరేదపి విత్తాని పరేషాం క్రోశతామపి
న తిష్ఠతిస్మ సన్మార్గే నచ ధర్మే బుభూషతి ౩౮
పాపాత్మా పాపభావశ్చ కామబాణవశానుగః
అవినీతశ్చ దుష్టాత్మా ప్రత్యాఖ్యాతః పునఃపునః ౩౯
దర్శనే దర్శనే హన్యాద్యది జహ్యాచ్చ జీవితం
తద్ధర్మే యతమానానాం మహాన్ ధర్మోన శిష్యతి ౪౦
సమయం రక్షమాణానాం భార్యా వో న భవిష్యతి
భార్యాయాం రక్ష్యమాణాయాం ప్రజా భవతిరక్షితా ౪౧
ప్రజాయాం రక్ష్యమాణాయా మాత్మాభవతి రక్షితః
ఆత్మాహి జాయతే తస్యాం తేన జాయాం విదుర్బుధాః
భర్తాతు భార్యయా రక్ష్యః కథం జాయా మమోదరే
వదతాం వర్ణధర్మాంశ్చ బ్రాహ్మణానా మితి శ్రుతమ్.
క్షత్రియస్య సదా ధర్మో నాన్యః శత్రునిబర్హణాత్
పశ్యతో ధర్మరాజస్య కీచకో మాం పదాఽవధీత్. ౪౨
తవ చైవ సమక్షం వై భీమసేన మహాబల
త్వయా హ్యహం పరిత్రాతా తస్మాద్ఘోరా జటాసురాత్

జయద్రథం తథైవ త్వం మజైషీః భ్రాతృభి స్సహ
జహీమ మతిపాపిష్ఠం యోఽయం మా మవమన్యతే. ౨౬
కీచకో రాజవ న్నిత్యం శోకకృ న్మమ భారత
త మేవం కామసంమత్తం భింధి కుంభ మివాఽశ్మని. ౨౭
యో నిమిత్త మనర్థానాం బహూనాం మమ భారత
తం చే జ్జీవంత మాదిత్యః ప్రాత రభ్యుదయిష్యతి. ౨౮
విష మాలోడ్య పాస్యామి మా కీచకవశంగమం
శ్రేయో హి మరణం మహ్యం భీమసేన తవాఽగ్రతః. ౨౯
ఇత్యుక్త్వా ప్రారుద త్కృష్ణా భీమ స్యోర స్సమాశ్రితా.

(దుఃఖముల దాటజాలని నే నార్తనై బాష్పవిమోచన మొనరించితి నంతయే రాజు నుపాలంభించిన దానకాను. కడచినదాన నేల. భీమసేన! మహాబల! ప్రత్యుపస్థితకాలమును గమనించి యనంతరకార్యమును గాంచుము. భీమ! కైకేయి (సుధేష్ణ) నారూపమునకు మిగుల భయమొంది శంకగొని (రూపాభిభవ శంకయా) రాజు దీనినెట్లు చేరకుండునంచు నిత్యము నన్నుగూర్చి సంకటపడుచున్నది. ఆమెకుగల యీతలంపు ననృతదర్శనుడగు దుష్టాత్ముడు కీచకుడు స్వయమెఱింగినవాడై సదా నన్ను ప్రార్థించుచున్నాడు. కుపితనైన నేను భీమ! మరల కోపమును నిగ్రహించుకొని 'కామసంమూఢ! కీచక! నిన్ను రక్షించుకొనుము, గంధర్వు లయిదుగురకు బ్రియభార్యను, మహిషిని, వారు నిన్ను కుపితులై హతమార్చెదరు, వారు

శూరులు, సాహసకారులు' అని పలికిరి. ఆదుష్టాత్ముడు కీచకు డిట్లు బలికెను. 'సైరంధ్రీ! శుచిస్మితా! నేను గంధర్వులకు భయమొందువాడను కాను, శతము, శతసహస్రమునైన గంధర్వులు సమాగతులైనను నేను వారిని రణమందు హతమొనర్చెదను. భీరు! నీవు క్షణముగావింపుము' అని వాడు పలుకగా నాకామాతురునితో నేను మరల 'యశోవంతులు గంధర్వులకు నీవు సాటికానేరవు. ధర్మమందు సతతమున్న దానను నేను, కులశీలసమన్వితను. నేనెవ్వరిని వధ్యులుగా గోర నందువల్లనే కీచక నీవింతపర్యంతము జీవించి యున్నావు.' అని పలుకగా నాదుష్టాత్ముడు ప్రహసించి యార్చెను. వానిచే బూర్వ ప్రేషితనైన కైకేయి (సుదేష్ణ) భ్రాతృప్రియచికీర్షయై ప్రణయముననన్ను 'కీచకగృహమునుండి సురను గొనిరమ్ము' అని నియోగించెను. సూతపుత్రుడు నన్ను జూచి మహాత్సాంత్వ మొనరించెను. అది ప్రతిహతముకాగా వాడు క్రుద్ధుడై, పరామర్శమనస్కుడాయెను. దురాత్ముడగు కీచకుని సంకల్పమెఱింగి యపుడు రాజశరణమునకై పరుగున వచ్చినట్టి నేను వానిచే పదతాడన మొందితిని. అది విరాటుడు చూచెను. కంకుడును, బహుజనమును, రథికులు, పీఠమర్దులు, హస్త్యారోహులు నైగములు—నిందఱు గాంచిరి. అపుడు నాచే రాజు, కంకుడును మరల మరల నుపాలంభింపబడిరి. అట్లయ్యును రాజుచే వాడు వారింపబడుటలేదు. వాని నదమాయించుట జరుగలేదు. విరాటసారథియగు కీచకు

డనువాడు త్యక్తధర్ముడు, నృశంసుడు, పరస్త్రీసంగమతుడు-
ప్రియుడు, శూరుడనభిమాని, పాపాత్ముడు, సర్వార్థముగ్ధుడు,
దారామర్శియగువాడు, బహ్వర్థములబొందియు, బరులాక్రో
శించుచుండినను వారలవిత్తముల నపహరించువాడు, సన్మార్గ
ముందున్నవాడు కాడు, ధర్మమునందు నిలుచువాడు కాడు.
పాపాత్ముడు, పాపభావుడు, కామబాణవశానుగుడు, అవినీతుడు,
దుష్టాత్ముడు పలుమారులు ప్రత్యాఖ్యాతుడయ్యు వచ్చి
నప్పుడెల్ల హింసగావించుచున్నాడు. ప్రాణత్యాగమొనరించు
కొనునంత హింస గావించుచున్నాడు. తద్ధర్మయుతమానులగు
(మీకు)మహాధర్మము నశించుచున్నది. సమయరక్షణము గా
వించు(మీకు) భార్యయుండదు. భార్యను రక్షించిన వారలకు
సంతతి రక్షింపబడిన దగును. ప్రజారక్షణమున (సంతతిరక్షణ
మున) నాత్మరక్ష కాగలదు. తాను (మరల గర్భమున) నుద్భ
వించునట్టిదానికి 'జాయ' అని బుధవిదితమై యున్నది. నా
యుదరమందు భర్త యట్లుద్భవింపగలడని భార్యచే రక్షింప
బడువాడు భర్తయగునంచు వర్ణధర్మప్రవర్తకులైన బ్రాహ్మ
ణులు వచించినవారని వినియున్నాను. సదా క్షత్రియునకు
శత్రునిబర్హణముకన్న నన్యధర్మ మింక లేదు. ధర్మరాజు
యొక్క సమక్షముననే కీచకుడు నన్ను కాలితో దన్నెను,
భీమసేనా! మహాబల! నీసమక్షమందె (యిది జరిగినదికదా)
ఘోరమైన వాడాజటాసురుని బారినుండి నీచే నేనురక్షింప
బడియున్నాను. ఇట్లే భ్రాతృసహితుండవగు నీవు జయద్రథుని

జయించి నన్ను గాపాడితివి. నన్నవమానించిన యాపరమపాపిని కీచకుని దెగటార్పుము. ఆకీచకుడు రాజు వట్లు నాకు శోకము గల్గించుచున్నాడు. ఎవనివలన నీబహ్వానర్థములు నాకుగల్గుచున్నవో యాకీచకుని కుండను రాతిపై వేసి పగులగొట్టునట్లు ఆకామసంమత్తుని బండలుచేయుము. (చట్టలు చేయుము) వాడు బ్రతికియుండగా సూర్యుడు రేపుదయించుచో నేనింక విషమాలోడనముచేసి త్రాగి వేయుకునంతే కీచకునకు వశ్యము కాజాలను. భీమసేన! నీయెదుట మరణమే నాకు శ్రేయముగదా— ఇట్లుపలికి ద్రౌపది యాభీము నురముపై వ్రాలిపోయెను. (భీమస్యోరస్సమాశ్రితా)

ద్రౌపది విరాటునంతఃపురమందు దటస్థించిన విషమ పరిస్థితికెల్ల నేకరూపము గల్గించి భీమునితో బలుకుచున్నది. సుదేష్ణకు తన విషయమై (రూపాభిభవమున) ఏర్పడినట్టి శంక, సుదేష్ణకుగల యీ యభిప్రాయమును గ్రహించి యున్న కీచకు డామెను బాధించుచున్న విధము ద్రౌపది భీమునకు దెల్పినది. కీచకుని దుష్టత్వము నెల్ల వివరించి తెల్పినది. ఈసందర్భమున ద్రౌపది సైరంధ్రిపరిస్థితినెల్ల వివరించు నదిగా ప్రసంగించుట గమనింపదగినది, కావుననే యామె పతులనుగూర్చి గంధర్వపతులని, కీచకునిగూర్చి సూతపుత్రు డని, సుదేష్ణనుగూర్చి కైకేయియని సందర్భములందు విచిత్రముగా బలికినది. 'నిత్యముద్విజతే' అని సుదేష్ణవిషయ

మున, 'సదా ప్రార్థయతేహి మాం' అని కీచక విషయమున బలికి, యింతకంతకు మిక్కుటమగుచుండిన యావిషయమును దానెంతగా నోర్చి ప్రవర్తించుచున్నది ద్రౌపది యిందు వివరించి పలికినది, తనయీమాట కాకీచకు డెంత యలక్ష్య మొనర్చినది, అపహాస్య మొనర్చినదీ గంధర్వులనవమానించి నది వ్యక్తీకరించినది. అట్టిపరిస్థితియందు నోరుచుట్టుపై నోకటి పోటువలె యాకైకేయి దన్నపుడు కీచకునింటికి సురను దెమ్మని పంపుట, దాని పర్యవసానము పలికి కీచకు డారాజ్య మందెట్లు కొల్లగానున్నది, వాని మదము, దుర్మార్గసాహసము ద్రౌపది తెల్లమొనర్చుచు పరిస్థితిని బురస్కరించినట్టిమాట ధర్మజుని గూర్చి 'కంకుడు' అని పలికినది. విరాటుడు, కంకుడు, విస్తార జనము చూచుచుండగా నేర్పడిన పరాభవము నంతయు నామె వ్యక్తీకరించినది, 'ప్రేక్షతేస్తు విరాటస్తు కంకస్తు బహవో జనాః' అని ద్రౌపది యీసందర్భములో నుచ్చరించినది. 'వల్లవుడు చూచినాడు' అని యిచ్చట లేకుండుట యందలి విషయగాంభీర్యము గమనింప దగినది. ఆ సందర్భమున నచ్చటనే భీముడున్నను నాభీముని గూర్చిన ప్రస్తావన యీసందర్భముగా నామె గావింపకుండుట గంభీరముగా నున్నది. ఆ సంకట పరిస్థితిని జూచుటయందు 'భీమసేన యుధిష్ఠిరా' అని గలదు. భీమసేనుడే ముందుగా నిర్దేశింపబడి యున్నాడు. అపుడు భీమసేనుడే బహుసంరంభపూరితుడై యుద్రేకమొందినవా డయినాడు, భీమసమక్షమున దనగష్టపళ్ళ

నెల్ల వెలికక్కుచున్నట్టి ద్రౌపది భీమసేన విషయమిచటకాక యుచితస్థలమున నిర్దేశింపనెంచినది. ద్రౌపది యింతపర్యం తము సైరంధ్రిపరిస్థితి. కంకునుపేక్షను దెల్పి యీపై ధర్మ మార్గమును, క్షత్రియధర్మప్రాధాన్యతను దెల్పుచు ప్రసం గించినది. సాభిప్రాయముగ 'ధర్మజభీమసేనులు' అను నామ మాలను నిర్దేశించి పలికినది. ధర్మజభీమసేనుల సమక్షమున సంభవించిన పరాభవ మదిగావున నాకీచకుడింక తుదముట్ట వలసినదే (హతుడు కావలసినవాడే) యని యామె రూఢి పలుకునది యైనది. 'పశ్యతో ధర్మరాజస్య కీచకో మాం పదా వధీత్' అనునది ధర్మమార్గరక్షను, 'తవ చైవ సమక్షంవై భీమసేన మహాబల' అనునది ప్రతీకారావశ్యకతను దృఢ ముగా వెల్లడించుచున్నది. ద్రౌపది యిట్లుగా ధ్వనినిమార్చి పలుకుచు కార్యావసరమగునట్టిమాట—జటాసురవధను, జయ ద్రథదండన విషయమును బలికి కీచకుని దుదముట్టింపుమంచు నేర్పడబలికినది. 'జహీమ మతిపాపిష్ఠంభింధికుంభ మివాశ్మని' అని యెంతగానో పలికినది, ౪౬—౪౯ శ్లోకములో ప్రతీకారతైక్ష్ణ్యమునెల్ల వెల్లడించుచున్నవి. ద్రౌపది యిట్లు పలుకుచు రోదనమొనరించుచు భీమసేనుని వక్షమం దవశయై వ్రాలిపోయినది. (భీమస్యోరస్సమాశ్రితా) కాగా భీముడును, ద్రౌపదియు రోదనమొనర్చి వారేమైరి. అట్టి పరమకష్టదశ యాజగన్నాథ దంపతుల కేర్పడినది.

భీమశ్చ తాం పరిష్వజ్య మహ త్సాంత్వం ప్రయుజ్యచ
ఆశ్వాసయిత్వా బహుశో భృశ మార్తాం సుమధ్యమామ్
హేతుతత్త్వార్థసంయుక్తై ర్వచోభి ర్ద్రుపదాత్మజాం
ప్రమృజ్య వదనం తస్యాః పాణినాఽశ్రుసమాకులమ్ ౫౨
కీచకం మనసా గచ్ఛత్ సృక్కిణీ పరిసంలిహన్
ఉవాచ చైనాం దుఃఖార్తాం భీమః క్రోధసమన్వితః
తథా భద్రే కరిష్యామి యథా త్వం భీరు భాషసే
అద్య తం సూదయిష్యామి కీచకం సహబాంధవమ్ ౨౨-౧
అస్యాః ప్రదోషే శర్వర్యాః కురుష్వాఽనేన సంగతం
దుఃఖం శోకంచ నిర్ధూయ యాజ్ఞసేని సుచిస్మితే ౨
యైషాం నర్తనశాలేహ మత్స్యరాజేన కారితా

... ... ... ... ....

తత్రాఽస్య దర్శయిష్యామి పూర్వప్రేతాన్ పితామహాన్

(భీము డామెను కౌగిలించికొని యెక్కువగా నోదార్చెను. హేతుతత్త్వార్థయుక్త వచనము లెన్నియో బలుకుచు భృశమార్తురాలై యున్న ద్రౌపదిని బహుప్రకారముల నాశ్వాసించెను. ఆమె ముఖమును కన్నీరును దుడుచుచు కీచకుని దలంచి పెలవులుద్రిప్పుచు క్రోధసమన్వితుడై దుఃఖాతురాలగు నామెతో నిట్లుపలికెను.'భీరు అట్లే కావించెదను. కీచకుని బంధుసహితముగా జంపెదను. యాజ్ఞసేనీ దుఃఖమును శోకమును విడిచి ప్రదోషమున వానితో సంకేతమేర్పఱుచుము. మత్స్యరాజకారితమగు నర్తనశాలయందు

పగటిపూట కన్యలు నృత్యమునేర్చి రాత్రి వెడలిపోయెదరు. అక్కడ శయనమొకటి గలదు. అక్కడ వానికి పూర్వ పిత్రులగు పితామహుల జూపించెదను. అని భీముడు పలికెను.

సూర్యోదయాత్పూర్వమే కీచకుని తుదముట్టింప వలయునని ద్రౌపది యార్తయై పలికినది. భీము డిపుడే (అద్య) వానిని జంపివేయుదునంచు మాటపలికి పిమ్మట కార్యగతిని వచించినాడు. కీచకుని సంహరింపుమంచు ద్రౌపది పలుకగా బంధువులతో గూడ కీచకుని సంహరింతును అని భీముడు పలికినాడు. నర్తనశాలకు బోవు సందర్భమున గూడ భీముడిట్లే పలికినాడు. (౨౨-౩౭) విరాటరాజ్యమున గొల్లలుగా నున్నట్టి మిగులపరాక్రమవంతులగు దుష్టాత్ములు కీచకులనెల్ల జంపిన గాని కార్యముచక్కబడదు. భీము డీకార్యగతినెల్ల దలపోసి కీచకునితో బాటు ఉపకీచకులనెల్ల నారాత్రి కాలమందే సంహరించ వలసియున్నదని నిశ్చయము పలికినాడు. ద్రౌపది యిబ్బందితో పాటు విరాటుని సంకటపరిస్థితియు నిందువలన దీరగలదను కార్యగతి యిందు సూచితమగుచున్నది. నర్తనశాల సంకేతముగా నేర్పఱచి కీచకుడందులకు వచ్చునట్లు సులువు గావింపవలసినదని యీసంకేతమేర్పఱచు టెవరికి విదితము కానివిధమున గావింపవలసినదని భీముడు ద్రౌపదితో బలికినాడు. నాట్య మొనర్చునట్టి యుత్తర విశ్రాంతి తీసుకొనుటకు గాను నర్తన శాలయందు శయనమొకటి యున్నదని యిచ్చోట సూచిత

మగుచున్నది. ద్రౌపదీ భీము లిట్లుగా గార్యనిర్ణయమునకు వచ్చి దుఃఖించి రాత్రిశేషము నతికష్టమున గడపిరి.

కీచకుడు ప్రాతఃకాలమున లేచి యంతిపురమునకేపోయి ద్రౌపదిని గాంచి 'నాకీ రాజ్యమం దెదురులేదన్న సంగతి నీకు విదితమైనది కదా * నేనే మత్స్యదేశప్రభుండను, వాహినీపతిని, అని పలుకుచు మిగుల నాశగొల్పుమాటలు పెక్కు వచించినాడు. 'ఈవిషయ మేరికిని, ♦ తమ్మునకును దెలియనీయని పక్షమందు వశవర్తినగుదును' అని యామె పలుకగా 'అట్లే చేసెదను. గంధర్వులకు నీవు తెలియబడకుండునటుల నేనొక్కండనే శూన్యముగనుండు నీగృహమునకు వచ్చెదను' అని వాడు పలికెను. గృహమును విడిచి నేనొక్కండనే నీయింటికి వచ్చెదననుట కీచకుని కామోద్రేకమును వ్యక్తీకరించుచున్నది, మఱియు పాండవకార్యానుకూలమగుచున్నది. 'చీకటిలో నర్తనశాలకురమ్ము ‡, అక్కడ నేయాటంక మింక నుండబోదు, అని యామె పలికినది.

---

* అహమేవహి మత్స్యానాం రాజా వై వాహినీపతిః ౨౨

♦ న త్వాం న భావా భ్రాతా వా జానీతాం త్వంగమం మయా ౧౨

ఉపకీచకుల కెఱుకరాకుండ కీచకు డేకాకిగా వచ్చి మడియుట నిది సూచించుచున్నది. భీముడు ముందుగా గీచకుని, వెనువెంటనే యుపకీచకులను వధింప నిశ్చయించికొనియుండుట నిది తెల్పుచున్నది.

‡ తత్ర దోషః పరిహృతః భవిష్యతి న సంశయః ౧౪

'నీకున్న తెగు లక్కడణగిపోగలదు' అను చక్కనిమాట యిందు ధ్వనించుచున్నది.

ఈ సంకేతము పగటిపూట జరిగినది. కీచకుని కాదినసాంధ్యము మాసముతో సమముగా దోచెను. హర్షపరిప్లుతుడై సైరంధ్రీ రూపమృత్యువును దెలియజాలక కీచకు డలంకారతత్పరు డాయెను. ఆ విశాలనయనను తలంచుకొనుచున్న కీచకున కాకాల మెంతదీర్ఘముగనో గానవచ్చినది. * ఆఱిపోవు నపుడు వత్తియంతయు కాలిమండునటుల తుదిసమయమున కీచకుడలంకరించికొని యట్లు వెలింగెను.

తతస్తు ద్రౌపదీ గత్వా తదా భీమం మహానసే
ఉపాతిష్ఠత కల్యాణీ కౌరవ్యం పతి మంతికమ్. ౨౫

త మువాచ సుకేశాంతా కీచకస్య మయా కృతః
సంగమో నర్తనాగారే యథావోచః పరంతప. ౨౬

శూన్యం స నర్తనాగార మాగమిష్యతి కీచకః
ఏకో నిశి మహాబాహో కీచకం తం నిషూదయ. ౨౭

తం సూతపుత్రం కౌంతేయ కీచకం మదదర్పితం
గత్వా త్వం నర్తనాగారం నిర్జీవం కురు పాండవ. ౨౮

దర్పాచ్చ సూతపుత్రోఽసౌ గంధర్వా నవమన్యతే
తం త్వం ప్రహరతాం శ్రేష్ఠ హ్రదా న్నాగ మివోద్ధర.

అశ్రుదుఃఖాభిభూతాయా మమ మార్జస్వ భారత
ఆత్మనశ్చైవ భద్రం తే కురు మానం కులస్య చ. 30

* ఆసీ దభ్యధికా చాపి శ్రీ శ్శ్రియం ప్రముముక్షతః
నిర్వాణకాలే దీపస్య వర్తి మివదీ ధక్షతః ౨౨-౨౨

భీమః—

ఏవం కరో మ్యహం భద్రే యథాత్వం భీరు భాషసే
స్వాగతం తే వరారోహే య న్మాం వేదయసే ప్రియం
న హ్యన్యం కంచి దిచ్ఛామి సహాయం వరవర్ణిని
యా మే ప్రీతి స్త్వయాఽఖ్యాతా కీచకస్య సమాగమే.
హత్వా హిడింబం సా ప్రీతి ర్మమాసీ ద్వరవర్ణిని
సత్యం భ్రాతౄంశ్చ ధర్మంచ పురస్కృత్య బ్రవీమి తే.
కీచకం నిహనిష్యామి వృత్త్రం దేవపతి ర్యథా
తంగహ్వరే ప్రకాశేవా పోథయిష్యామి కీచకమ్ 3౮
అథచే దపి యోత్స్యంతి హింస్యే మత్స్యానపి ధ్రువం
తతో దుర్యోధనం హత్వా ప్రతిపత్స్యే వసుంధరామ్
కామం మత్స్య ముపాస్తాంహి కుంతీపుత్రో యుధిష్ఠిరః

ద్రౌపదీ

యథా న సంత్యజేథా స్త్వం సత్యంవై మత్కృతే విభో
నిగూఢ స్త్వం తథా పార్థ కీచకం తం నిషూదయ

భీమసేనః

ఏవ మేత త్కరిష్యామి యథా త్వం భీరు భాషసే 32
అద్య తం సూదయిష్యామి కీచకం సహబాంధవైః
అదృశ్యమాన స్తస్యాఽద్య తమస్విన్యా మనిందితే 3౫

(కీచకుడు కామమోహితుడై ప్రొద్దుగడచుట తెలియక యాసంగమమునే తలపోసుకొను చుండెను. అపుడు ద్రౌపది మహానసమందున్న భీముని సమీపమునకుబోయి

యిట్లుపలికెను. పరంతప నీవు చెప్పినప్రకార మాకీచకునితో నర్తనాగారమందు సంగమమును సమయ మేర్పఱచితిని. శూన్యమగు నర్తనశాలకుకీచకుడొక్కడు రాగలడు. నీవానర్త నాగారమునకుబోయి మదదర్పితుడైయున్న కీచకునినిర్జీవమొన రింపుము. శత్రుసంహారకుండవగు నీవుహ్రదమునుండినాగము నట్లు కీచకు నంత మొందింపుము. అశ్రుదుఃఖాభిభూతనగు నాకన్నీటిని దుడువుము (మమ మార్జస్వ భారత) నీకును నిది యావశ్యకమైనదే. కులమాన మొనరించువాడవగుము'—ద్రౌపది యిట్లు పలుకగా భీముడు 'నీవు చెప్పినట్లు గావించెదను. ఈప్రియమును వినిపించిననీకు స్వాగతము పలుకుచున్నాను. వరవర్ణిని ఇందెవ్వరిని గాని సహాయ మిచ్చయింపను. కీచకసమాగమ విషయకమగు నేప్రీతిని నీవు పలికితివో హిడింబాసురుని వధించినప్పుడట్టి ప్రీతినాకు గల్గియుండినది. సత్యమును భ్రాతలను ధర్మమును బురస్కరించికొని పలుకుచున్నాను. వృత్రాసురుని దేవపతి చంపినట్లు కీచకుని జంపెదను. ఆకీచకుని గహ్వరమందుగాని, ప్రకాశమున గాని చావగొట్టెదను. అప్పు డెదురించువారగుచో నామాత్స్యులను హింసించెదను. ధృవమిది. అట్లే దుర్యోధనుని వధించి వసుంధరను పొందెదను. కుంతీపుత్రుడు యుధిష్ఠిరుడు కోరి మత్స్యునుపాసింప నిమ్ము.' భీము డిట్లుపలుకగా ద్రౌపది 'నా నిమిత్తము సత్యమును త్యజింపని విధముగా నాకీచకుని నిగూఢముగా హతమార్చుము' అని పలికెను.

భీముడు 'నీవు చెప్పినప్రకార మట్లే గావించెదను. కీచకుని బంధువులతోగూడ చంపెదను. అదృశ్యమానుడనై తమస్సునం దిపుడే పరిమార్చెదను. అలభ్యయగు దాని నిచ్ఛయించియున్న యాదురాత్ముని కీచకుని శిరమును నాగము బిల్వశాఖవట్లు త్రుంచెదను'- అని పలికెను.

'కౌరవ్యం పతి మంత్రికం, తం సూతపుత్రం కౌంతేయ కీచకం, నిర్జీవం కురు పాండవ' అను వానిలోని 'కౌరవ్యం, కౌంతేయ, పాండవ' అను భీమునిగూర్చిన విశేషములు గమనింప దగినవి. మఱియు నీసందర్భముగా ద్రౌపది వచించియున్న యీమాట లెంతయో సంతస్తును వ్యక్తీకరించునవిగా నున్నవి.

ధర్మే స్థితాస్మి సతతం కులశీల సమన్వితా
నేచ్ఛామి కంచి ద్వధ్యం తం తేవ జీవసి కీచక. ౨౧-౨౭
ఏవ ముక్త స్స దుష్టాత్మా ప్రాహస త్స్వనవత్తదా ౨౮
క్షత్రియస్య సదా ధర్మో నాన్య శ్శత్రునిబర్హణాత్ ౨౯
దర్పాచ్చ సూతపుత్రోఽసా గంధర్వా నవమన్యతే
ఆత్మనశ్చైవ భద్రం తే కురు మానం కులస్యచ 30

ఈశ్లోకము లందు ద్రౌపదియొక్క యోర్మి, సైరంధ్రియెల్ల, క్షత్రియు సదాధర్మప్రాధాన్యత, భీముని కులశీల గౌరవము వ్యక్తీకరింపబడినవి. పాండవకార్యానుకూలత: విరాటసంకటవిమోచనము, ద్రౌపదీ దుఃఖశాంతి యగు నీకార్యమున గంధర్వప్రతీకారము, సైరంధ్రివిమోక్షణము

22

వ్యక్తమగుచున్నవి. కీచకవధ కనుకూలవాతావరణ మేర్పఱచిన ద్రౌపదిని బ్రశంసించువాడై భీముడు విచిత్రముగా హిడింబాసురవధను పేర్కొనినాడు. కాగల భార్యను గూర్చి భీముడు హిడింబాసురుని వధించియున్నాడు. మహిషిని గాపాడుటకై భీము డిపుడు కీచకవధ గావింపబోవుచున్నాడు. ఈచిత్రమగు నభిప్రాయమిందు వెల్లడియగుచున్నది.

'సత్యం భ్రాతౄంశ్చ ధర్మంచ పురస్కృత్య బ్రవీమి తే' అని భీము డుదారవచనము పలికినాడు. భీముడు సత్యధర్మములకు మధ్యగా భ్రాతలను పేర్కొనుట కడునుత్తమముగా నున్నది. పాండవుల సత్యధర్మప్రవర్తనము దడవువాడగుచు దత్కాల కార్యవిధానమును సమీచీనముగా భీముడు వచించినాడని యభిప్రాయము. 'కీచకం నిహనిష్యామి వృత్రాం దేవపతి ర్యథా' అని కీచకవధను నిశ్చయించిపలికి భీముడు 'తం గహ్వరే ప్రకాశే నా పోథయిష్యామి కీచకం' అనినాడు. రహస్యవిధానము వనే కీచక వధనుగావించినను తదనంతర పరిస్థితి యొకవేళ విషమించుచో గాదగిన కార్యవచనమును భీముడు సూచించుచున్నాడు. 'అపి చేదపి యోత్స్యంతి హింస్యే మత్స్యానపి ధ్రువం' అనినాడు. భీముడు తానుగా యుద్ధముచేయడు. మాత్స్యులొకవేళ యుద్ధమునకుగడంగిన వారిని హింసించెదనంచుభీముడనినాడు. ఇది భీమునిహృదయగాంభీర్యమును వ్యక్తీకరించుచున్నది. మాత్స్యులను చంపెదను'అనకుండ హింసించెదనుఅనినాడు.

ఒకవేళ మాత్స్యులను హింసించుటయే యేర్పడునపుడింక దుర్యోధనసంహారమే కాదగినదగునంచు భీముడు క్రోధోత్సాహోద్రేకపూరిత వచస్కుడై నాడు. 'దుర్యోధనుని హత మార్చి వసుందరనొందెదను. కుంతీపుత్రుడు యుధిష్ఠిరుడు మత్స్యనుపాసించు చుండనిమ్ము' అనిభీముడనినాడు. 'విరాటుని హింసించెదను' అని భీముడు మాటవరసకైన వచింపకుండుట గమనింప దగినది. ఇది భీముని హృదయసారమునంతయు వివరించుచున్నది. ఈ భీముని క్రోధోద్రేకపూరితవచనములు విని ద్రౌపది 'యథా న సంత్యజేథా స్త్వం సత్యంవై మత్కృతే విభో' అని పలికినది. ఇందలి 'సత్యం' అను మాట యీ పరమసాధ్వి హృదయసారము నంతయు వివరించుచున్నది. ఇది వారి సమయపాలనమును (అరణ్యాజ్ఞాతవాసమును) • తత్కాలసమయపాలనమును (కీచకులవధ) గూడ నిర్దేశించుచున్నది.

'నిగూఢ స్త్వం తథా పార్థకీచకం తం నిషూదయ' అని ద్రౌపది పలికినదానికి భీముడు 'అదృశ్యమాన స్తస్యాద్య తమస్వినాద్య మనిందితే' యని భీముడు బదులు పలికినాడు. కీచకవధనే ద్రౌపది పలుకుట, కీచకులందఱ సంహరించెదనని భీముడు పలుకుట గమనింపదగినది. విరాటపర్వమందలి కేంద్రాభిప్రాయ మంతయు నిందునిగూఢముగా నేర్పడియున్నది.

౧. అద్య తం సూదయిష్యామి కీచకం సహ బాంధవం

౨. అద్య తం సూదయిష్యామి కీచకం సహబాంధవైః.
సంకేతము కాకముందు భీముడు పలికినది మొదటిది, సంకేతా నంతరము భీముడు పలికినది రెండవది. కీచకులనెల్ల జంప వలసియున్నదని భీముడు కార్యగతినిసూచించినాడని మొదటి విషయము, కీచకుని ముందుగా జంపి పిమ్మట—వెనువెంటనే—యీచీకటియందే యుపకీచకులనెల్ల తుదముట్టించెదనని భీముడు నిర్ణయము పలికినాడని రెండవవిషయము వ్యక్తీకరించుచున్నది. 'అలభ్యయగు నిన్నిచ్ఛయించిన యీదురాత్ముని కీచకుని శిరమును త్రుంచివేసెదను' అని భీముడు ముఖ్యవిషయమును తుదివచనముగా బలికెను.

ప్రథమముగా భీముడే నర్తనశాలకుబోయి భిన్నముగా నుండెను. సింహము మృగమునట్లు కీచకుని నెదురుచూచుచుండెను. కీచకుడు యథాకామముగా నలంకృతుడై పాంచాలీ సంగమాశచే యీకాలమునకు సైరంధ్రి వచ్చియుండ గలదను సంకేతమును దలంచుచు నాయగారమును ప్రవేశించెను. తమోమయమైయున్న నర్తనశాలను ప్రవేశించి పూర్వాగతుడై యేకాంతావస్థితుడై యున్నట్టి యప్రతి మౌజస్సుడగు భీమునియొద్ద కాదుర్మతి కీచకుడు సమీపించెను.

శయానం శయనే తత్ర సూతపుత్రః పరామృశత్
జాజ్వల్యమానం కోపేన కృష్ణా ధర్షణజేనహ. ౪౪
ఉపసంగమ్య చైవైనం కీచకః కామమోహితః
హర్షోన్మథితచిత్తాత్మా స్మయమానోఽభ్యభాషత. ౪౫

ద్రౌపదీపరాభవహేతువున గోపమున జాజ్వల్యమానుడైన భీమనియోద్ధకు కామమోహితుడగు కీచకుడు సమీపించెను. శయనమందున్న యాభీముని సమీపించి హర్షోన్మథితచిత్తాత్ముడై కీచకుడు స్మయమానుడై యిట్లు పలికెను. 'బహువిత్తము నీనిమిత్తము గొనివచ్చితిని. సర్వసమృద్ధమై, క్రీడారతి విరాజితమైయుండు నాయంతఃపురమును (విడిచి) నిన్నుద్దేశించి వేగనిచ్చటకు (ఈకటికచీకటిలోనికి) వచ్చితిని. గృహాగతులకు స్త్రీలు సదా నన్ను సువాసా దర్శనీయశ్చ నాఽన్యోఽస్తి త్వాదృశః పుమాన్ అని ప్రశంసించుచుందురు- అని పలికెను. దైవవశమున దర్శనీయుడవైతివి, దైవవశమున నాత్మప్రశంస గావించుచున్నవాడవు, ఇట్టిస్పర్శ నీకిదివఱకైనది లేదు. కామధర్మవిచక్షణుడవు, నిగధిడవు, స్పర్శ నిది యెఱుంగగల విపుడే, స్త్రీలకు ప్రీతికరుడింకొకడు లేడు, నీసమాన పురుషుడిక లేడు' అని పలుకుచు భీమపరాక్రముడగు భీముడు తటాలున నెగిరి ప్రహసించి యిట్లు పలికెను.

* అద్య త్వాం భగినీ పాప కృష్యమాణం మయా భువి
ద్రక్ష్యతేఽద్రిప్రతీకాశం సింహేనేవ మహాగజమ్. ౫౨

* ఈశ్లోకము విచిత్రమైనది. కీచకుడు హతుడైనపిమ్మట విరాటుడెక్కడనుండినది వ్యక్తముకానివిధముగా భారతమందున్నది. కీచకశవమును సంస్కారమొనరింప గొనిపోదలంచుసందర్భమున నుపకీచకుల సంరంభమేర్పడి వారందఱు భీమునిచే హతులగు పరిస్థితి తటస్థించినది.

(పాపాత్ముడా! సింహముచే మత్తగజంబు క్రైవడి నాచే బడమిని త్రోయబడి యీడ్వబడు కొండవంటి నిన్ను నీయప్ప యిపుడు చూడగలదు.

అక్కను నిర్బంధించియే కీచకు డీముప్పును దెచ్చి కొనినాడు, స్వయంకృతాపరాధమునకు దగినశాస్తినొంది కీచకుడు తుదముట్టినాడనియే దీని భావముగాని సుధేష్ణను గూర్చి భీముడు మాటపలికినాడని దీనియభిప్రాయముకాదు. తుదముట్టనున్న కీచకుడు వినదగిన మాటగానిది యేర్పడి యున్నది.

---

ఉపకీచకులు ద్రౌపదిని కీచకశవముపై పెట్టి కొనిపోవ ననుజ్ఞ కోరునపుడు విరాటుడెచ్చటనుండినది స్పష్టముకానివిధముగా భారతమందున్నది.

అథ వా నైవ హంతవ్యా దహ్యంతాం కామినా సహ
మృతస్యాపి ప్రియం కార్యం సూతపుత్రస్య సర్వధా ౨౩-౬
తతో విరాట మూచు స్తే కీచకోఽస్యాః కృతే హతః
సహానే నాద్య దహ్యామ తదనుజ్ఞాతు మర్హసి

(సైరంధ్రి) నిమిత్తము కీచకుడు సంహరింపబడినాడు సైరంధ్రిని జంపివేయుడు, లేక యట్లు చంపవద్దు కామించియున్న కీచకునితో గూడ దీనిని దహింతము, మృతినొందినను సర్వధా కీచకునకు ప్రియమే యాచరింప దగినది - ఇట్లనిపలుకుచు నపుడు కీచకులు విరాటునితో 'ఆమె నిమిత్తము కీచకుడు హతుడైనాడు. సహదాహమున కిపుడే మాకనుజ్ఞ నీయవలసినది' అని పలికిరి.)

తతో విరాట మూచు స్తే' అనునది కళాగోపనమైన వచనము. 'ఇట్లు గానైన నిన్ను నీయక్క యిపుడీవిధముగా జూడగలదు' ఈమాటయందు బాంధవపరిస్థితి చిత్రముగా సూచింపబడినట్లయినది.

బలినాంవరుడగు భీముడు కీచకుని జుత్తును పట్టుకొనగా వాడది విడిపించికొని బాహువులచే పాండవుని బట్టుకొనెను. వసంత ఋతువునందు పెంటియేనుగు నిమిత్తము పోరాడు మద గజములట్లు భీమసేన కీచకుల కపుడు పోరాట మేర్పడినది. క్రోధవిషోద్ధతులై వారు నఖదంష్ట్రములచే నన్యోన్యపీడన మొనరించికొనిరి వారి భుజాఘాతములవలన వేణుస్ఫోటసమ మగు శబ్ద మేర్పడెను. అపుడు వృకోదరు డాకీచకుని బల ముగా గృహమధ్యమున కీడ్చి పెనుగాలి దుమమునట్లు వాని నూపివేసెను ఆఘోర బాహుయుద్ధమున నాభవనము మాటిమాటికి గంపించెను. హీనబలుడైన కీచకుని కేశ గ్రహణ మొనరించి భీముడు పెద్దరావ మొనరించెను. (విరు రావ మహాబలః) అపుడు భిన్నభేరీసమమగు స్వనముగా గీచకుని స్వన మేర్పడెను. (నదంతంచ మహానాదం భిన్నభేరీ సమస్వనం) ఆకీచకుని వేగముగా బాహువులతో నదిమిపట్టి ద్రౌపదీకోపశాంత్యర్థము వానికంఠమును భీమసేనుడు నులిపివేసెను. మఱియు భీముడు క్రుద్ధుడై కీచకుని పాద ములు, చేతులు, శిరము, గ్రీవము నూడబెఱికి డొక్కల లోనికి జొనిపి మాంసపిండోపమానముగా నాశవమునుగావిం చెను. అగ్నిని వెలిగించి భీము డాకీచకశవమును ద్రౌపదికి చూపించి యిట్లు పలికెను.

పార్థ యంతి సుకేశాంతే యే త్వాం శీలగుణాన్వితాం
ఏవం తే భీరు వధ్యంతే కీచక శ్శోభ తే యథా. ౯౨

*తత్కృత్వా దుష్కరం కర్మ కృష్ణాయాః ప్రియముత్తమం
తథా స కీచకం హత్వా గత్వా రోషస్యవై శమమ్. ౯౦
ఆమంత్ర్య ద్రౌపదీం కృష్ణాం క్షిప్రమాయా న్మహానసం
కీచకం ఘాతయిత్వా తు ద్రౌపదీ యోషితాం వరా. ౯౧
ప్రహృష్టా గతసంతాపా సభాపాలా నువాచహ
కీచకోఽయం హత శ్శేతే గంధర్వైః పతిభిర్మమ. ౯౨
పరస్త్రీ కామసంమత్త స్తత్రా గచ్ఛత పశ్యత. ౯౩

('శీల గుణాన్వితవగు నిన్నర్థించువారలు కీచకునట్లు వధ్యులై పోయెదరు.' (కీచక శ్శోభతే యథా) అని భీముడు ద్రౌపదితో బలికెను. భీముడు దుష్కరకార్య మిట్లుగావించి ద్రౌపదికి ప్రియ మొనరించెను, కీచకుని హతమార్చి రోష శమ మొందెను. ద్రౌపది నామంత్రించి (అచ్చటనే యుండు నట్లు నియమించి) భీముడు వేగముగా మహానసమునకు వచ్చెను. యోషితాంవరయగు ద్రౌపది కీచకుని వధింపజేసి ప్రహృష్టయు, గతసంతాపయై సభాపాలురతో 'నా గంధర్వ పతులచే హతుడై కీచకుడు పడియున్నాడు. పరస్త్రీ కామ సంమత్తుడు, వెళ్లి చూడండి' అని పలికెను.

నిశీథసమయమున నర్తనశాలయందు గృహమధ్యమున భీముడు కీచకుని దుదముట్టించెను. తదనంతర కార్య

*'నాఽన్యః కర్తా ఋతే భీమాన్మమాఽద్య మనసః ప్రియం' అని విశ్వసించి తనయొద్దకువచ్చినట్టి ద్రౌపది సంకటమును దీర్చి భీముడామెకు ప్రియము నాచరించినాడు. (౧౪-౫)

మనసు దలంచి భీముడు ద్రౌపదినచ్చటనే నిల్చి వెడలి పోయెను ద్రౌపదియు భీమనియోగానుసారము ప్రవర్తించు నదియై నర్తనశాల రక్షకులతో గీచకవధను దెల్పెను. సైరంధ్రి నిమిత్తముగా గంధర్వనిహతుడైనాడు కీచకుడని యిందువలన వ్యక్తమైనది. నర్తనశాలరక్షకులు దివిటీలు గొని వచ్చి కీచకశవమును దిలకించి యాశ్చర్యచకితులై * గంధర్వకృత్య మిట్లుండునని తలపోసిరి.

బంధువులందఱు కీచకశవముచుట్టు మూగి యేడ్చుచుండిరి. కీచకునకు సంస్కారమాచరింపదలంచు నాపమయమున నుపకీచకు లాశవముతో ద్రౌపదిని సహదాహ మొనరింప గోరి విరాటు ననుమతిని గోరిరి.

పరాక్రమంతు సూతానాం మత్వా రాజాఽన్వమోదత
సైరంధ్ర్యా సూతపుత్రేణ సహదాహం విశాంపతిః

(సూతులపరాక్రమమును దలంచి విరాటుడు సైరంధ్రిని సూతపుత్రశవముతో సహదాహ మొనరించుటకు సమ్మతివచనము పలుకువాడాయెను)

కీచకోపకీచకుల దుడుకుతనము విరాటరాజ్యమందిట్లు మిక్కుటమై యున్నదని దీని భావము. ఉపకీచకు లిట్లు తనా

* పాణిపాదవిహీనంతు దృష్ట్వా చవ్యథితాఽభవన్
నిరీక్షంతి తత స్సర్వే పరం విస్మయమాగతాః ౨౨-౯౬
అమానుషకృతం కర్మ తం దృష్ట్వా వినిపాతితం
క్వాఽస్య గ్రీవా క్వ చరణౌ క్వ పాణీ క్వ శిర స్తథా ౯౭
ఇతిస్మ తం పరీక్షంతే గంధర్వేణ హతం తదా ౯౮

శవముతో గట్టికొని పోవునపుడు ద్రౌపది రక్షణార్థ మిట్లాక్రోశించినది.

* జయో జయంతో విజయో జయత్సేనో జయద్బలః
తే మే వాచం విజానంతు సూతపుత్రా నయంతి మామ్
ఏషాం జ్యాతలనిర్ఘోషో విస్ఫూర్జిత మివాఽశనైః
వ్యశ్రూయత మహాయుద్ధే భీమఘోష స్తరస్వినామ్ ౧౩
రథఘోషశ్చ బలవాన్ గంధర్వాణాం తరస్వినాం
తే మే వాచం విజానంతు సూతపుత్రా నయంతి మామ్ ౧౪
తస్యా స్తాః కృపణా వాచః కృష్ణాయాః పరిదేవితాః
శ్రుత్వై వాభ్యాపత ద్భీమ శ్శయనా దవిచారయన్ ౧౫

.... ... ... ... ...

ఊరువేషేన తస్యాఽన న్యగ్రోధాఽశ్వత్థ కింశుకాః
భూమౌ నిపతితా వృక్షాః సంఘశ స్తత్ర శేరతే ౨౫

('జయుడు, జయంతుడు, విజయుడు, జయత్సేనుడు, జయద్బలుడు — వారు నామాట వినవలయును (తే మే వాచం విజానంతు) సూతపుత్రులు నన్ను గొనిపోవు

* 'జయుడు' జయంతుడు, విజయుడు, జయత్సేనుడు, జయద్బలుడు 'అనునవి సంకేతనామములు—గంధర్వనామములని విచిత్రము. ఇవి ప్రథమావిభక్తులుగానుండుట గమనింపదగినది. 'తే మే వాచం విజానంతు' అని పిమ్మట ప్రథమపురుషగా గార్యవచనముండుట గంభీరమైనది కాగా భీమునిమాత్రమే ద్రౌపదినిర్దేశించి యీ మాటలు పలికినదని పర్యవసానము. భర్తల ధనుర్విద్యాపాటవమగు మాటగానుండుటయు గంభీరవిషయమే యగును.

చున్నారు. యుద్ధవీరులు, తరస్వినులునగు గంధర్వులు నా మాట వినవలయును - సూతపుత్రులు నన్నుఁ గొనిపోవు చున్నారు.' - ద్రౌపదియొక్క యీకృపణవచనము నాపరి దేవనమును విని భీముడు తత్క్షణము నిస్సంకోచముగా శయనమునుండిలేచి 'సైరంధ్రి నీమాట వింటిని, సూత పుత్రులవలన నీకు భయములేదు' అని పలుకుచు మాఱు వేషమున బ్రాకారమునులంఘించి శ్మశానాభిముఖముగా బరుగెత్తి పదిమూరలుగల మూర్ధశుష్కవనస్పతినొకటి పెక లించి దండపాణియట్లు కీచకులయెదుట వచ్చిపడెను. ఆతని ఊరువేగమునకు న్యగ్రోధా శ్వత్థకింశుక వృక్షములు సంఘ ములుగా భూమిమీద పడిపోయినవి. మెఱుపువంటి భీముని యీకృత్యమున నేర్పడిన యాతని వచన మెఱుమునట్లు వెలు వడినదని సారస్యము. ఆవృక్షముతో భీము డుపకీచకులనెల్ల జంపివేసెను. * వృక్షేణ తేన రాజేంద్ర ప్రభంజనసుతో బలీ అని యిచ్చటగలదు. 'ప్రభంజనసుతః' అనునది రస వంతముగా నున్నది. ఝంఝామారుతమట్లుగా మఱ్ఱి సమీర నందనుడు కీచకులనెల్ల బరిమార్చెనని యభిప్రాయము.

తత ఆశ్వాసయ త్కృష్ణాం స విముచ్య విశాంపతే ౩౮

* కీచకులు ౧౦౫ గురు, కీచకునితో ౧౦౬ గురు 'స చ సేనా పతిః పూర్వ మిత్యేత త్పూతపట్శ్చతమ్' (౩౫) అని యిచ్చటగలదు. కౌరవ, పాండవులు ౧౦౫ గురు, పూర్వజాతుడగు కర్ణునితో ౧౦౬ గురు ఈసంఖ్యలో నంతరార్థమున్నదని విమర్శకులు నిదానించుచున్నారు.

* ఏవం తే భీరు వధ్యంతే యే త్వాం క్లిశ్యంత్యనాగసమ్
ప్రైహి త్వం నగరం కృష్ణే న భయం విద్యతే తవ. ౩౩

.... ... ....

త దృష్ట్వా మహదాశ్చర్యం నరా నార్యశ్చ సంగతాః
విస్మయం పరమం గత్వా నోచుః కించన భారత. ౩౬

(కీచకుల నెల్ల సంహరించి యశ్రుపూర్ణముఖియై దీనయై యున్న ద్రౌపదిని దుర్ధర్షుడగు వృకోదరు డోదార్చి 'అనాసురాలవగు నిన్ను క్లేశమొందించువారిట్లే వధింపబడుదురు, పట్టణమునకు వెడలిపొమ్ము, నీకు భయములేదు, నేను వేఱొకమార్గమున విరాటుని మహానసమునుగూర్చి పోయెదను' అని పలికెను. ఇట్లుగా కీచకునితో సహా నూటయైదుగురు కీచకులు చంపబడగా నీమహదాశ్చర్యమును జూచి స్త్రీపురుషులు పరమవిస్మయమొందియు నేమాటయు పలుకజాలనివారైరి. పెదవి మెదల్పలేనిపరిస్థితి యేర్పడినది.

సైరంధ్రిరోషమున పురము వినాశమొందకుండునట్లు నీతి నేర్పఱుచవలసినదిగా గంధర్వభయత్రస్తులగు పురజనులు విరాటునకు విన్నవించిరి. ఒకేచితియందు కీచకుల కెల్ల సంస్కారమొనరింపవలసినదిగా విరాటుడు పలికి పిమ్మట సుధేష్ణతో నిట్లు పలికెను. 'సైరంధ్రితో నిట్లు తెల్పుము, గంధర్వులవలన నేర్పడిన పరాభవమునకు రాజు

* కామమున కీచకుడు, క్రోధమున నుపకీచకులు సర్వనాశనమైరి. (౨౨-వ., ౨౩-౩౨)

భయమొందుచున్నాడు. గంధర్వరక్షితవగు నీతో రాజు స్వయము చెప్పుట కపేక్షించలేదు. స్త్రీ చెప్పుటయందు దోష మేర్పడలేదు గావున, నేను నీకు దెల్పుచున్నాను. నీయిష్టమువచ్చిన (చోటునకు) వెడలిపొమ్ము అనిచెప్పుము' అని పలికెను.

అథ ముక్తా భయాత్కృష్ణా సూతపుత్రాన్నిరస్యచ
మోక్షితా భీమసేనేన జగామ నగరం ప్రతి. ౨౮-౧౧
*త్రాసితేవ మృగీ బాలా శార్దూలేన మనస్వినీ
గాత్రాణి వాససీ చైవ ప్రక్షాళ్య సలిలేన సా. ౧౨

(ద్రౌపది భయముక్తయై సూతపుత్రుల నిరసించి భీమసేనునివలన విముక్తయై నగరమునుగూర్చి వెడలెను. పెద్దపులికి భయపడు లేడియట్లామె పురమునుగూర్చి వెడలెను. గాత్రములు, వస్త్రములు ప్రక్షాళన మొనరించికొని యామె నగరమును ప్రవేశించుచుండగా బురజను లామెను జూచి పదిదిక్కులకు పాఱజొచ్చిరి. గంధర్వభయత్రస్తులై పురజనులు కండ్లు మూసికొనిరి. మహానసద్వారమందు మత్త

* 'తాం మృగీమివ సంత్రస్తాం దృష్ట్వా కృష్ణాం సమీపగాం' ౧౫-౨౨ అని కీచకనివేశమునకుబోవు ద్రౌపదినిగూర్చి చెప్పబడినది. కడు జాగరూకతగా మెలంగుచున్న ద్రౌపది యపుడుకీచకవధను సాధించునదియై యున్నది కావున 'మృగీ మివ సంత్రస్తాం అనిమాత్రమే కలదు. కీచకుని వలన సంత్రస్తయైనదని కా దిక్కడ యభిప్రాయము. పురమునుగూర్చి పోవునామె పెద్దపులికి భయమొందు లేడియట్లు కానవచ్చునదియై పురమును ప్రవేశించుచున్నదని యభిప్రాయము.

మహాగజమట్లు నిలిచియున్న భీమసేనుని గాంచి పాంచాలి యిట్లు పలికెను.

తం * విస్మయంతీ శనకై స్సంజ్ఞాభి రిద మబ్రవీత్
గంధర్వరాజాయ నమో యేనాఽస్మి పరిమోక్షితా. ౧౫

భీమసేనః

యే పురా విచరంతీహ పురుషా వశవర్తినః
తస్యా స్తే వచనం శ్రుత్వా త్వనృణా విహరంత్యత.

(ఆశ్చర్యవతియగు పాంచాలి సంజ్ఞావచన మిట్లు పలికెను. 'గంధర్వరాజునకు నమస్కార మెవ్వానివలన విమోచన మందితినో' అని పలికెను. భీమసేనుడు 'వశవర్తులై చరించుపురుషులు నీయీమాట విని అనృతులై విహరించెదరు సుమ్ము' అని పలికెను.)

మహాపరాక్రముడగు కీచకుని, పరాక్రమవంతులగు కీచకులను—నూటయైదుగురు పరాక్రమవంతులను హతమార్చి భీముడు యథాస్థితిగా మహానసమందిరద్వారమున మత్తమహాగజమట్లు విలసిల్లుచుండుటను దిలకించిన ద్రౌపది

---

* తత స్సైవ కన్యాభి ర్ద్రౌపదీ రాజవేశ్మ తత్
ప్రవివేశ సుధేష్ణాయా స్సమీప ముపగామినీ ౨౬

'ఉపగామినీ' అనునది ద్రౌపదియొక్క తత్కాలకృత్యమును దెల్పుచున్నది. అపుడామె సుధేష్ణను సమీపించుటయే యాచరింపవలసిన కార్యమని దీని భావము. కన్యలతో నామె యంతఃపురమును బ్రవేశించుట మఱియు విత్రముగానున్నది. ద్రౌపది కన్యలతో సుధేష్ణాంతఃపురమును బ్రవేశించినది.

కృతజ్ఞతావచనము పలికినది. 'విస్మయంతీ' అని యిచ్చట గలదు. భీమపరాక్రమవిశేష మట్టివిధముగా ద్రౌపదియందు ప్రతిఫలించినదని యిది వ్యక్తీకరించుచున్నది. భీమసేనుడు నందుకు దగు ప్రతివచనము పలికినాడు.

తత స్సా నర్తనాగారే ధనంజయ మపశ్యత
రాజ్ఞః కన్యా విరాటస్య నర్తయానం మహాభుజమ్ ౧౮
తతస్తా నర్తనాగారా ద్వినిష్క్రమ్య * సహార్జునాః
కన్యా దదృశు రాయాంతీం క్లిష్టాం కృష్ణా మనాగసమ్
దృష్ట్వా తా మేత్య సర్వా స్తా ఇద మూచు ప్రహర్షితాః

కన్యాః

దిష్ట్యా సైరంధ్రి ముక్తాసి దిష్ట్యాసి పున రాగతా ౧౯
దిష్ట్యా వినిహతా సూతా యే త్వాం క్లిశ్యం త్యనాగసం

బృహన్నళా

కథం సైరంధ్రి ముక్తాసి కథం పాపాశ్చ తే హతాః ౨౦
ఇచ్ఛామి వై తవ శ్రోతుం సర్వ మేవ యథాతథమ్

సైరంధ్రీ

బృహన్నళే కిన్ను తవ సైరంధ్ర్యా కార్య మద్య వై ౨౧
యా త్వం వససి కళ్యాణి సదా కన్యాపురే సుఖం

---

* కన్యాః...సహార్జునాః' అనునది విచిత్రముగా నున్నది. కన్యలపుడు తమ కొటగలవునట్టి యర్జునునితో బైటకువచ్చిరను విచిత్రదృశ్య మిందు ధ్వనించుచున్నది, 'కన్యాః...సహర్షితాః' అనునదియునిట్టి విచిత్రమునే వ్యక్తీకరించుచున్నది.

నహి దుఃఖ మవాప్నోషి సైరంధ్రి యదుపాశ్నుతే ౨౨
తేన మాం దుఃఖితా మేవం పృచ్ఛసే ప్రహస న్నివ

బృహన్నళా

బృహన్నళాఽపి కళ్యాణి దుఃఖ మాప్నోత్యనుత్తమమ్
తిర్యగ్యోనిగతా బాలే న చైనా మవబుధ్యసే
త్వయా సహోషితా చాఽస్మి త్వంచ సర్వాస్సమోషితా
క్లిశ్యంత్యాం త్వయి సుశ్రోణి కోను దుఃఖం న చింతయేత్
నతు కేనచి దత్యంతం కస్యచి ద్ధృదయం క్వచిత్ ౨౪
వేదితుం శక్యతే నూనం తేన మాం నావబుధ్యసే

... ... ... ...

తా మబ్రవీ ద్రాజపత్నీ విరాటవచనా దిదమ్. ౨౭

(రాజకన్యల కాటగఅపునట్టి మహాభుజుండగు ధనంజయునామె నర్తనాగారమందు జూచెను. సహార్జునలై కన్యలు నర్తనాగారమునుండివచ్చి పరిక్లేశ మొంది వచ్చుచున్న ద్రౌపదిని గాంచిరి. వారందఱు హర్షయుక్తులై యిట్లనిరి. 'సైరంధ్రీ దైవవశమున విముక్తినొందితివి, దైవవశమున సూతులు హతులైరి' అనిరి. బృహన్నళ 'సైరంధ్రీ యెట్లు విముక్తురాలవైతివి. ఎట్లుగా నాపాపులు హతులైరి. యథాతథముగా వినగోరుచున్నాను' అని పలికెను. సైరంధ్రి 'బృహన్నళ! సైరంధ్రితో నీకిపుడేమిగలదు. కన్యాంతఃపురమందు సుఖమున్నవాడవుకదా. సైరంధ్రిపొందిన దుఃఖము నీకు కాదుకదా, (న వాప్నోషి) కావుననే దుఃఖితురాలనగు

నన్ను ప్రహసించువాడువలె నడుగుచుంటివి' అనెను. బృహన్నల 'బృహన్నళయు, నీ కళ్యాణియు గొప్పదుఃఖ మొందియే యున్నది. తిర్యగ్యోనిగతయగు దీని నెఱుంగకుంటివి. నీతోడకలసియున్నదాన, నీవును మాతోడ గలసి యుండినదానవు, కావున నిది దుఃఖహేతువు కాకుండునా, ఒకరి హృదయము నొకరొకానొక పరిస్థితియందు దెలియని వారలేయగుదు రందువలననన్ను తెలియకున్నావు' సమీపమునకు వచ్చియున్న సైరంధ్రినిజూచి సుధేష్ణ విరాటవచనమునిట్లు పలికెను.) మహానసద్వారమున భీమసేనునిదిలకించిన ద్రౌపది పిమ్మట నర్తనశాలందు ధనంజయుని గాంచినది. ఆపదను దాటివచ్చిన యామె 'భీమార్జునులను వారి వారి స్థానములందు గాంచుట సౌభాగ్యవిషయమై యున్నది, మఱియు నామె విశ్వాస్యుడగు భీమసేనునకపుడు కృతజ్ఞతను దెల్పుట యావశ్యకముగాన నట్లుగావించినది. భీమసేను డందులకు దగిన ప్రతివచనము (మేల్మిమాట) పలికినాడు.

అర్జునుని నర్తనశాలయందు దర్శించుట యావశ్యకమే కాని యాతనితో బ్రసంగించు బరిస్థితి ద్రౌపది కపుడేమియు లేదు. కన్యకలర్జునునితో సహా నర్తనశాలనుండి వెడలివచ్చి ద్రౌపదినిగాంచి సౌదార్ద్ర పల్కు-పల్కిరి. ఇచ్చోట కన్యావచనానంతరము బృహన్నలావచనముండుట గమనింపదగినది. ఓదార్పుమాట కావున నది బృహన్నళావచనమే యని యభిప్రాయము - అర్జునుడపుడు భీమునట్లు కృతకృత్య పరిస్థితియందున్నవాడే, అది సౌదార్ద్రమాటగాన సైరంధ్రి

యందుకు దగువిధముగా.బృహన్నళతో నిష్ఠురవచనమే పలికి నది. ఆమె కన్యలకేమియు ప్రతివచనము పలుకకుండుట యందుగల గాంభీర్యముకూడ గమనింపదగినదై యున్నది. సైరంధ్రికింకను కష్టముగా గడచు దినములు మిగిలియున్నవి, బృహన్నళ కామె కష్టమున బాలుగలదుగాన గష్టపుపాటునే బృహన్నళ ప్రతివచనముగా బలుకుట యేర్పడినది. ఆయో దార్ప్వవిధముగా నపుడు నడచినది. పిమ్మట ద్రౌపది కన్య కలతో కూడ సుధేష్ణాంతఃపురమును ప్రవేశించుటయు సాభి ప్రాయముగా నున్నది. అర్జునుడచ్చోటనే నిలిచినాడనునది గంభీరమే.అపుడుసుధేష్ణయామెతో విరాటవచనమిట్లుపలికెను.

సైరంధ్రి గమ్యతాం శీఘ్రం యత్ర కామయసే గతిం
రాజా బిభేతి తే భద్రే గంధర్వేభ్యః పరాభవాత్ ౨౮
త్వం చాపి తరుణీ సుభ్రురూపేణాఽప్రతిమా భువి
పుంసా మిష్టశ్చ విషయో గంధర్వాశ్చాఽతికోపనాః ౨౯

సైరంధ్రీ

త్రయోదశాఽహ మాత్రం మే రాజా క్షామ్యతు భామిని
కృతకృత్యా భవిష్యంతి గంధర్వాస్తే న సంశయః ౩౦
తతో మా ముపనేష్యంతి కరిష్యంతిచ తే ప్రియమ్
ధ్రువంచ శ్రేయసా రాజా యోక్ష్యతే సహ బాంధవైః

('సైరంధ్రీ నీయిష్టమువచ్చినచోటునకు వెడలిపొమ్ము. గంధర్వపరాభవమునకురాజు భయమొందుచున్నాడు. నీవు తరుణవయస్సులో నున్నావు, రూపమున భూమియందు సాటిలేనిదానవై యున్నావు. విషయేష్టత్వము పురుషులం

దుండు నింక గంధర్వులతికోపము గలవారు' – సుధేష్ణ యిట్లుపలుకగా సైరంధ్రి 13దినములుమాత్రముగాజుక్షమింప దగును, ఆ గంధర్వులు కృతకృత్యులగుదురు. నన్ను గొని పోయెదరు. మీకు ప్రియ మాచరించెదరు. ధ్రువమిది, రాజు నిశ్చయముగా సబాంధవుడై శ్రేయ మొందు వాడగును.

గంధర్వపతుల రక్షనుగూర్చి ద్రౌపది యాదిలో బలికినది. కట్టడిగావించికొని ప్రవేశించు సందర్భమది గావున ద్రౌపది యట్లుగావించినది. కీచకుడు 'తనయభిలాషను దెల్పునపుడు ద్రౌపది యట్టికోర్కె-ధర్మముకాదని పలికినది. అపుడు విపరీతము పలుకు కీచకునితో సైరంధ్రి "గంధర్వ రక్షితనగు నాయందట్టి తలాపు విడువుము కానిచో ప్రమాదము వారు కల్గించెదరు. అని పలికినది. కీచకునింటికి బోయి సురను దెమ్మని సుధేష్ణ పలుకగా వాని యింటికి బోవుదానను గానని సైరంధ్రి పలికినది. సుధేష్ణ నిర్బంధించి బంపగా ద్రౌపది విపరీతమాచరింపబోవు కీచకుని నేలపై బడవేసి పరుగున రాజసభకు వచ్చినది. సభయెదుట సూర్యనియోజితుండగు రక్క-సుడు సైరంధ్రిరక్షణమొనరించెను. కీచకునివధను సభలో నిర్ణయించు ప్రయత్నమాచరించుచున్న ద్రౌపదికి ధర్మజుడందు కనుమతి వచనము పలికినాడు. సైరంధ్రి నుద్దేశించియాతడు పలికిన వచనమునకు సైరంధ్రి ప్రతివచనముచ్చరించి సుధేష్ణ యింటికి వచ్చినది. కష్టపుపాటును గూర్చి సుధేష్ణయడుగగా ద్రౌపది జరిగిన కష్టదశ నామెకెఱిగించినది. కీచకుని దండింతునని సుధేష్ణయపుడు పలుకగా

సైరంధ్రి గంధర్వపతులింక వానిని దుదముట్టించెదరని పలికి నది. భీమసేనుని భవనమునకు బోవుచు సైరంధ్రి నిష్ఠుర వచనము పలికినది. భీమసేనునితో ద్రౌపది కడగండ్లనెల్ల దెల్పి కీచకునివధింపుమని పలికినది. భీమనియోగానుసారము ద్రౌపది కీచకునితో సంకేతమొనరించి వాడొంటరిగా నర్తన శాలకు జేరునట్లు గావించినది. కీచకవధానంతరము ద్రౌపది యచ్చటనేయుండి భీమనియోగానుసారముపకీచకసంహార మును సమీచీన మొనరించినది, కీచకశవముతో గట్టి యుప కీచకులు గొనిపోవునపుడు ద్రౌపది భీమునుద్దేశించి పలుకగా నాతడు వారినెల్ల సంహరించెను. మహానసద్వారమందు యథాప్రకారము నిల్చియున్న భీమునకు ద్రౌపది కృతజ్ఞ తను వ్యక్తీకరించినది కష్టమెట్లుదాటి వచ్చితివని బృహన్నల పలికినదానికి సైరంధ్రి కష్టనిష్ఠురవచనము పలికినది. విరాట వచనానుసారము సుధేష్ణ 'యింక వెడలిపొమ్మని' పలికిన దానికి సైరంధ్రి 'రాజు క్షమింపదగునింక పదుమూడు రోజు లుండెదను. గంధర్వపతులపుడు నన్నుగొని పోయెదరు' అని పలికినది, ద్రౌపది విరాటనగరమందజ్ఞాత వాసముపూర్తి గావించినది. విరాటుడు కీచకులసంకటమునుండి తేఱి ధర్మ పథవర్తియై సబాంధవముగ, శ్రేయమొందువాడయినాడు.

హీనకేతు హతే రాజా విరాటః పరవీరహా
పరాం సంభావనాం చక్రే కుంతీపుత్రేషు వీర్యవాన్

కీచకులు హతులుకాగా పరవీరహంతయగువిరాటుడు. కుంతీపుత్రులందు పరమసంభావన చేసెను.